# చతుర

సంపుటి-3 జూలై 1980 సంచిక-6

అనుకోని విధంగా ఆ గ్రామంలో ఒకరి తరువాత మరొకరు అంతు తెలియని వ్యాధితో ఆహుతయిపోసాగారు. చివరికి ఆ గ్రామంలో ప్రజాసేవ చేస్తున్న విదేశీ మిషనరీ డాక్టర్ కూడా ఆ జబ్బుతోనే మరణించాడు. అది కేవలం ఆ గ్రామంలోనే ఆగక ఇతర ప్రాంతాలకు కూడా వ్యాపించ నారంభించింది. మొదలూ, తుదీ, నివారణ మార్గం ఏదీ తెలియని ఈ

## కొత్త శత్రువు

ను నిర్మూలించేందుకు, వేలాది మందిని రక్షించేందుకు డాక్టర్లు, పరిశోధకులు నిర్విరామంగా ఎలా పోరాడారు?

### మల్లాది వెంకట కృష్ణమూర్తి

తన తాజా నవల 'కొత్త శత్రువు'లో క్రొంగ్రొత్త విషయాలను మీకు పరిచయం చేస్తున్నారు.



ముఖచిత్రం : టి. శ్రీనాథ్

2, 3 కవర్లు మూరళీ ఎస్. శర్మ

# రచయితలకు సూచనలు

* జా[illegible] చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.

* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 - 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతున్న నవలికలు చతురలో అచ్చులో 60 - 70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.

* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.

* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచనను బట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

## చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ - 500004.

# విపుల కథా సాగరం

అపార సాగర జలధి అడుగున దాగిఉండే ఆల్చిప్పలలోని ఆణిముత్యాల్ని సేకరించినట్లు ఈ విశాల విశ్వంలోని విభిన్న భాషల విశిష్ట కథలను సేకరించి ప్రచురిస్తుంది 'విపుల'. తెలుగు పాఠకులకు కథానికా ప్రపంచంలోని కొత్త కోణాలను పరిచయం చేస్తుంది విపుల. సరికొత్త రుచులను ఆస్వాద యోగ్యం చేస్తుంది విపుల. ఇంతవరకూ వెలువడిన 30 సంచికల లోనూ దాదాపు 500 వివిధ భాషల కథలను అచ్చ తెలుగులో అందజేయగలిగింది విపుల. ఆ కథలలో వెల్లివిరిసే వైవిధ్యం అనంతం. ఆ కథల ద్వారా పరిచయమైన విభిన్న ప్రాంతాలు అసంఖ్యాకం. ఆయా జాతుల విశిష్ట భాషా సాహిత్యాలు సుసంపన్నం. వాటి అందచందాలు తెలుగు పాఠకులకే ప్రత్యేకం. మరే భారతీయ భాషలోనూ తనకు సాటి రాగల పత్రిక లేని మేటి మాసపత్రిక విపుల.

# విపుల





## మీ చేతుల్లో ఒదిగిపోయే తారామణిహారం
## మీ కన్నుల్లో వెలుగులు చిమ్మే దివ్వెల తోరణం

- చలనచిత్ర పరిశ్రమలోని ప్రతి రంగం గురించీ సమగ్రమైన సమాచారాన్ని అందిస్తుంది 'సితార'
- ఆబాలగోపాలాన్ని తన అందచందాలతో ఆకర్షిస్తుంది 'సితార'
- రంగుల ముఖచిత్రాలతో, అభిమాన తారల వర్ణచిత్రాలతో, తాజాతాజా ఖబుర్లతో మిమ్మల్ని మురిపించే మరిపించే అంశాలతో, ఎన్నెన్నో విశేషాలతో వారం వారం వెలువడుతుంది 'సితార'

# సితార

సమగ్ర సినీవార పత్రిక

రూపాయి మాత్రమే

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాదు-500004

## లక్షలు...లక్షలు...

జీవితంలో ఓ లకారం సంపాదిస్తే చాల్లే అనుకోని వారు అరుదు. కానీ అమెరికాలో దక్షిణ పోర్ట్‌లాండ్‌లో కేథరీన్ స్వీగర్స్ స్కూల్లో చదివే 31 మంది ఐదవ తరగతి విద్యార్థులు మాత్రం పది లక్షలు సంపాదించాల్సిందేనని కంకణం కట్టుకున్నారు. అయితే పదిలక్షల డాలర్లు సంపాదించేంత స్థాయికి వారింకా రాక




పోవడం వల్ల కనీసం పది లక్షల సీసా మూతలయినా సేకరిద్దామనుకుని 1978 అక్టోబర్‌లో ప్రారంభోత్సవంచేసి దాదాపు రెండున్నర లక్షల మూతలు కూడ బెట్టేరు. 1981 నాటికి తమ పదిలక్షల ధ్యేయం నెరవేరుతుందన్న ధీమా ఏర్పడింది వాళ్ళకి.

ఇంతకీ ఈ సీసా మూతలన్నింటినీ చెత్తకాగితాలమ్మే వ్యాపారికి అమ్మగా వచ్చిన డబ్బుతో వాళ్ళ స్కూలు వారందరికీ ఘనంగా పార్టీ ఇవ్వాలని వాళ్ళ ఉద్దేశమట.

ఇలాగే అమెరికాలోని పనామాకి చెందిన విద్యార్థులు కూడా సీసా మూతల్ని సేకరిస్తున్నారు. అయితే వీరంతా 'బీరు' సీసా మూతల్ని మాత్రమే సేకరిస్తారు. ఈ మూతలమ్మగా వచ్చిన డబ్బుని సంఘ సంక్షేమ కార్యకలాపాలకి, పథకాలకి వినియోగించడం వీళ్ళ ఆశయమని చెప్తున్నారు. వీళ్ళ కలెక్షను ఇప్పటికి నాలుగు లక్షల బీరు సీసాల మూతలు.

1958లో అమెరికాలో రోమల్ కుటుంబీకులు సెంట్ నాణాలను సేకరించడం మొదలెట్టి ఇరవై ఏళ్ళలో పది లక్షల సెంట్ నాణేలు సేకరించారు. ఇవి నాలుగు టన్నుల బరువు తూగాయిట. ఈ మధ్యే వీరు ఈ నాణేలను స్థానిక బాంకులలో ఇచ్చి బదులుగా 7,500 డాలర్లు సంపాదించేర్ట. ఆధునిక యుగంలో వృధాపోయే వస్తువేలేదు. ఇది ఎకానమీ యుగం. చెత్తలోంచి విత్తం సంపాదించొచ్చు కృషి ఉంటే.

## దొంగ అలారం

ప్రపంచంలో ఏ వస్తువునైనా దొంగిలించి బైట పడచ్చేమోగాని అలారం గడియారాన్ని దొంగిలించి తప్పించుకోవడం చాలా ప్రమాదకరమైన విషయమని గోవా ఉదంతం స్పష్టంచేస్తోంది. పోర్చుగీసు గవర్నర్ జనరల్ సల్వార్ నివాస భవనంలోవున్న విలువైన వస్తువుల లిష్టు తయారు చేసుకు రమ్మని వివిధ రాష్ట్రాలకు చెందిన కొందరు అధికారులను నియోగించింది భారత ప్రభుత్వం.




తాళాలు తీసి లోపలికి ప్రవేశించి మెల్లిగా పన్లోకి జొరబడ్డారు అధికారులు. గవర్నర్ జనరల్‌గారి టేబిల్‌మీద తళ తళ మెరిసిపోతున్న ఓ చిన్న విదేశీ అలారం గడియారం ఓ ఆఫీసర్ కంట పడింది. దాన్ని చేతుల్లోకి తీసుకుని అన్ని 'బటన్స్'ని పరీక్షించి, అటూఇటూ చూసి ఎవరూ తనని చూడ్డంలేదని నిర్ధారించుకుని మెల్లిగా దాన్ని కోటుజేబులోకి జారవిడి చాడు. తిరిగి ఇంకెక్కడా భద్రపర్చు కునేందుకు వీల్లేకుండా వస్తువుల జాబితా తయారవగానే అత్యవసర సమావేశానికి




ఆఫీసర్లంతా హాజరవ్వాల్సిందిగా కార్య నిర్వాహణాధికారి నుండి ఉత్తర్వు వచ్చింది. అందరితో బాటు ఈ ఆఫీసరూ వెళ్ళక తప్పలేదు.

సమావేశంలో ఒక్కొక్కరూ లేచి తాము రాసిన వస్తువుల లిష్టును చదవ సాగారు. ఇంతలో ఉన్నట్టుండి ఆఫీసరుగారి కోటుజేబులోని అలారం గడియారం గొంతుచించుకు మరీ అరవడం మొద లెట్టింది. అది విని ఎక్కడివారక్కడ నిశ్చేష్టులై పోయారు; గడియారాన్ని బైటికితీసి ఆపుదామని ప్రయత్నించాడు గానీ ఎలా ఆపాలో తెలీదు. అందరికళ్ళూ తనని దొంగలా గుచ్చి గుచ్చి చూస్తుంటే ఏం చెప్పాలో తోచలేదు. నిర్వాహణాధికారి పట్టలేని కోపంతో "మీ అంత నిజాయితీ గల ఆఫీసరుని మేము భరించలేం. హాయిగా ఇంట్లో విశ్రాంతి తీసుకోమ"ని చెప్పి ఉద్యోగంలోంచి వెళ్ళగొట్టాడు. ఇవాళ టేబుల్ మీది గడియారం చూసి మనసు పడ్డాడు. రేపు లంచాలు పుచ్చు కుని ప్రభుత్వాన్నే ముంచేలా వున్నాడని మిగతా ఆఫీసర్లకి వినబడేలా గొణుక్కు న్నాడు నిర్వాహణాధికారి. అందుకే దొంగ తనం చేసినా అరవని, కరవని వాటిని ఎన్నుకోడం ఉత్తమమైన చోరుడు చేసేపని.

## ఒలింపిక్స్

ఈయేడు మాస్కోలో జరగబోయే ఒలింపిక్స్‌కి దాదాపు 444 బంగారు పతకాలు, అదే సంఖ్యలో వెండివి, 463 కంచు పతకాలు అవసరమవుతాయట. ఇవ్వబడే మొత్తం ప్రైజులు 203. అయితే జంటగా గెలుపొందే వారికోసం అదనంగా కొన్ని పతకాలు అవసరమవుతాయి.

రాజకీయాల గందరగోళంతో మాస్కో ఒలింపిక్స్‌కి కొంత ప్రత్యేకత ఏర్పడ నున్నా పూర్వంనుంచీ ఒలింపిక్స్ పతకాలకి కొంత చరిత్ర ఉంది. ప్రాచీన గ్రీసు దేశంలో ఒలింపిక్ విజేతల గౌర వార్థం బ్రహ్మాండమైన ఆర్చిలను నిర్మించే వారు. కవులు వారి వీరోచిత కార్యాలను బహు పసందుగా వర్ణించేవారు.

అందమైన యువతులు విజేతలకు ఆలివ్ ఆకుల కిరీటాన్ని అమర్చేవారు.

అప్పట్లో ఆలివ్‌ఆకుల కిరీటాన్నే గొప్పగా భావించేవారు.

తిరిగి ఆధునిక యుగంలో ఒలింపిక్స్ క్రీడలు మొదలయ్యాక 1896లో ఏథెన్సు నగరంలో జరిగిన ఒలింపిక్ పోటీల్లో విజేతలకు వెండి పతకాలు, రెండవ స్థానం పొందిన వారికి కంచు పతకాలు ఇవ్వబడ్డాయి.

తర్వాత పారిస్‌లో జరిగిన ఒలింపిక్ పోటీల్లో పాల్గొన్న క్రీడాకారులందరికీ పతకాలిచ్చి విజేతలకు ప్రత్యేక బహుమతు లిచ్చారు. అమెరికాలో జరిగిన



మూడవ ఒలింపిక్స్‌లో పతకాలు తిరిగి మార్చారు. 1908 లండన్ ఒలింపిక్స్‌లో పతకాలమీద విజేతకు ఆలివ్ ఆకుల కిరీటాన్ని అలంకరిస్తున్న ఇద్దరు యువతుల చిత్రం ఉంది. స్టాక్‌హోం ఒలింపిక్స్‌లో కూడా కొన్ని మార్పులు జరిగేయి. 1924 పారిస్ ఒలింపిక్స్ ప్రారంభమైనపుడు పతకాల డిజైను కోసం పోటీ మొదలైంది. ఎన్నిక చేసిన పతకం డిజైనులో ఒలింపిక్స్ క్రీడల చిహ్నాలన్నీ ఉన్నాయి.

చివరికి 1928లో ఆమ్‌స్టర్‌డామ్ ఒలింపిక్స్‌లో నిర్ణయించిన పతకం నమూనాయే ఇప్పటికీ కొనసాగుతోంది. పతకానికి ఒక వైపుగా స్నేహం, సౌభ్రాతృత్వం, ఐక్యమత్యానికి గుర్తుగా గ్రీకు దేవత విక్టరీ బొమ్మని, పురాతన రోమ్ నగర భాగాన్ని చిత్రిస్తే; రెండో వైపు ఒలింపిక్స్‌లో జరిగే ప్రదర్శనల వివరాలుంటాయి.

ఈ సంవత్సరం ఆ భాగంలో 22 ఒలింపియాడ్, మాస్కో 1980 అని ఉంటుంది. ఇంకో వైపు ఒలింపిక్ నిర్వాహకులు తమకిష్టమైన చిత్రాన్ని ముద్రించుకోవచ్చు. మాస్కో ఒలింపిక్ పతకాలపై వెలుగును ప్రసరిస్తున్న ఒలింపిక్ టార్చితోబాటు ఎలుగుబంటి మిషా (మాస్కో ఒలింపిక్ గుర్తు) కూడా ఉంటుంది.

## నిద్రనడక

'ఐజాతుకోసారి పోయిరమ్మంటే గునిసే అబ్బాయిల్నే చూస్తుంటాం మనం రోజూ. కానీ 'సోమ్నాంబులిజం' (నిద్ర నడక) అనే వ్యాధికి గురైన వాళ్ళు మాత్రం నిద్రలో వాళ్ళకు తెలీకుండానే మైళ్ళకు మైళ్ళు నడిచేసారు. అందుకుదాహరణగా రైబెండాల్ అనే పన్నెండేళ్ళ కుర్రాణ్ణి చెప్పుకోవచ్చు.

రోజూలాగే ఆ రాత్రి కూడా అమ్మా, నాన్నల పక్కనే నిద్రపోతున్న రైబెండాల్ ఛటుక్కున నిద్ర లేచి నడవడం మొదలెట్టాడు. అర్ధరాత్రి వేళ రోడ్డున పడ్డ యజమాన్ని చూసి అతని పెంపుడు కుక్క 'కిమ్' కూడా అతని

 

వెంట పడింది. ఇద్దరూ కలిసి రోడ్లన్నీ దాటి, సందుగొందుల్ని, పంటపొలాల్ని అధిగమించి ఇంచుమించు మూడు మైళ్ళు వచ్చేశారు. అప్పటిగ్గాని తెలివి రాలేదు అబ్బాయిగారికి. ఎదురుగా చూసేసరికి మేనమామ ఇల్లు కనపడింది. ఆశ్చర్య చకితుడై పోయాడు రైబెందాల్. ఇతన్ని చూసిన మేనమామ కూడా ఆశ్చర్యపోయి హడావుడిగా రైబెందాల్ తల్లిదండ్రులకి ఫోన్ చేశాడు. వాళ్ళు కంగారుగా పరిగెత్తు కొచ్చి కుర్రాడు క్షేమంగా వున్నందుకు ఆనందపడుతూ ఇంటికి తీసుకుపోయారు.



తర్వాత తాపీగా ఈ విషయాన్ని అడిగుతే-"నా కసలేం తెలీలేదు. నేనెక్కడికి పోతున్నానో, ఏం చేస్తున్నానో అంతా అయోమయంగా కలలోలా అనిపించింది. నా యీ బలహీనతకు చాలా సిగ్గుపడుతున్నాను" అన్నాడు రైబెందాల్ విచారంగా మొహం పెట్టి.

## నేరాల రాజ్యం

మన దేశానికే కాక నేరాలకు్కూడా రాజధానిగా చెప్పుకోవచ్చు ఢిల్లీ నగరాన్ని. ముఖ్యంగా స్త్రీల విషయంలో అక్కడ జరుగుతున్న అత్యాచారాలకు లెక్కేలేదు. ప్రతిరోజూ ఏదో ఒక అత్యాచారం జరుగుతున్నట్టు పేపర్లో వార్త పడుతోంది. వాటిలో కొన్ని గృహ విషయాలకు సంబంధించినవైతే చాలమట్టుకి మాత్రం మానభంగాలకు చెందినవే.

కిడ్నాపింగ్‌లూ, రేప్‌లూ విపరీతమైపోవడంతో స్త్రీలు రాత్రిళ్ళు బస్సుల్లో ప్రయాణం చెయ్యడానికే భయపడుతున్నారు. స్త్రీలకని ప్రత్యేకించిన సీట్లలో బైఠాయించి వాళ్ళు నిలబడి వున్నప్పటికి లేవకుండా వినోదించే ప్రబుద్ధులు ఉన్నారక్కడ. ఇహ ఈవ్ టీజింగ్ సరేసరి. కాలేజీ, యూనివర్సిటీ గేట్ల దగ్గర, దార్లోనూ అమ్మాయిలనల్లరి చేసే రోమియోలకి లెక్కేలేదు. పోలీసులకు్కూడా వీళ్ళని కంట్రోలు చెయ్యడం సాధ్యమవడంలేదు.



అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా జరిగిన సభల్లో,సమావేశాల్లో

రాజకీయ నాయకులు, ఇతర ప్రముఖులు వీటి నరికట్టడానికి అనేక సూచనలు, జాగ్రత్తలు తీసుకున్నప్పటికీ నేరాల సంఖ్య తగ్గలేదు.

కాందిశీకులు, పై రాష్ట్రాల ప్రజలు, విభిన్న మతాల, మనస్తత్వాల ప్రజలిక్కడ వృత్తి రీత్యా నివసిస్తూండడంవల్ల ఇటువంటి దురన్యాయాలు జరుగుతున్నాయని పరిశీలకులు అంటున్నారు. అయ్యో! ఇదీ మన రాజధాని స్థితి.

## ఆ...ఆ(... ఆ...ఛ్!

తుమ్ములకి, దగ్గులకీ జలుబే కారణం కానక్కర్లేదని ఇంగ్లండ్‌లో జరిగిన యీ సంఘటన ద్వారా తెలుస్తోంది. ఫ్లాగ్నన్ అనే ఓ పధ్నాలుగేళ్ళ పిల్లాడికి వున్నట్టుండి విచిత్రంగా తుమ్ముల జబ్బు పట్టుకుంది. దాంతో కుర్రాడెప్పుడూ చాలా విచారంగా ఉండేవాడు. ఆ తుమ్ముల బాధ భరించలేక అతని స్నేహితులు కూడా అతనికి దూరంగా ఉండటం మొదలు పెట్టేరు. ఎంతోమంది డాక్టర్లకి ముడుపులు చెల్లించుకున్నా, ట్రీట్మెంట్లు తీసుకున్నా ప్రయోజనం లేకపోయింది. ఊపిరితిత్తులకి ఎక్స్‌రే తీసినాగాని తుమ్ముల పజిల్ విప్పలేకపోయారు. ఫ్లాగ్నన్ ఇంటి ఓనర్ కూడా డాక్టరే. ఆయన చాలా దగ్గర్నుంచి రకరకాల కోణాల్లో ఎక్స్‌రే తీసేడు. చివరికి ఒక ఎక్స్‌రేలో ఫ్లాగ్నన్ తుమ్ములకి కారణం కనుక్కోగలిగేడు. అతని ఊపిరితిత్తుల్లో రబ్బరుతో చేయబడ్డ సైనికుడి బొమ్మ ఇరుక్కుపోయి వుంది. శ్వాసకి ఆ బొమ్మ అడ్డుపడ్డం వల్ల ఫ్లాగ్నన్‌కి విపరీతంగా తుమ్ములొస్తున్నాయి. పదేళ్ళ కిందట అంటే అతని నాలుగవ ఏట ఆ బొమ్మను మింగేసినప్పట్నుంచీ యీ విపరీత లక్షణాలు కనిపించేయి. "ఫ్లాగ్నన్ చాలా అల్లరిపిల్లాడు. ఇంత చిన్న వయసులో ముసలాడిలా వాడు దగ్గటం, తుమ్మటం నేను భరించలేకపోయేదాన్ని. అదృష్టం బాగుండి




ఊపిరితిత్తులు చెడిపోక ముందే బొమ్మ బయటకు తీయడం జరిగింది. అసలా బొమ్మను వాడు మింగిన సంగతే నాకు తెలీదు" అని ఫ్లాగ్నన్ వాళ్ళమ్మ వాపోయిందట. అంచేత పిల్లల తల్లులూ బహుపరాక్!

## మంత్రాలకు చింతకాయలు...

మూర్ఖత్వం, అజ్ఞానం ప్రబలంగా ప్రజల్లో ముఖ్యంగా 'చీకటి ఖండం'గా, పేరుపడ్డ ఆఫ్రికాలో ఎంతగా పేరుకుపోయాయో స్విస్ రాయబారి భార్య సెలీన్‌సూటార్ చెప్పిన సంఘటన ద్వారా

తెలుస్తోంది. వాళ్ళు ఆఫ్రికాలో వున్నప్పుడు జరిగిన అనుభవం ఇది.

అక్కడి గ్రామ ప్రజల్లో చిన్న చిన్న పన్లకి ఎవరూ ముందుకు రాకపోవడంతో విదేశీయుల్ని అటువంటి పనులకోసం దిగుమతి చేసుకుంటారు. అటువంటి వారిలో రాబర్ట్ అనే కార్ డ్రైవరు కొంచెం నెమ్మదస్తుడు. చదువుకున్నవాడు. తోటివాళ్ళతని అమాయకత్వాన్ని అలుసుగా తీసుకుని అతని తిండి కూడా తినేసి నానా యాగీ చేసేవారు. కొన్నాళ్ళకి మిసెస్ సెలీన్ ఇది గమనించి.



వాళ్ళని హెచ్చరించడంతో అల్లరి తగ్గించేరు.

ఇలా ఉంటూండగా ఓ రోజు రాబర్ట్ కడుపునొప్పి వచ్చిందనీ, అక్కడి ఆఫ్రికన్ మాంత్రిక వైద్యుడికి చూపించుకోడానికి సెలవు కావాలని అడిగేడు. ఇంగ్లీషు డాక్టరికి చూపించుకోమని సలహా ఇచ్చినప్పటికీ పెడచెవిని పెట్టి నాటు వైద్యుడి దగ్గరకెళ్ళేడు.

ఆ మర్నాడు కళ కళలాడుతున్న మొహంతో మిసెస్ సూటార్ దగ్గరికొచ్చి నాటువైద్యుడి వైద్యం అమోఘంగా పని చేసిందని, తొడదగ్గర గంటు పెట్టి కడుపులో ఉన్న చెత్తంతా బయటకు తీసేసాడని సంబరపడుతూ చెప్పేడు. జేబులోంచి ఓ పొట్లం తీసి విప్పేడు. దాన్నిండా గాజు పెంకులూ, మేకులూ, టార్చిలైట్ బల్బులూ, చెత్తా చెదారం వున్నాయి. ఇవన్నీ కడుపులో చేరడం వల్లనే యీ కడుపు నొప్పి ప్రారంభమైందనీ, మంత్రంతో నయంచేసిన ఆ వైద్యుడ్ని భట్రాజులా ఒహటే పనిగా పొగడ్డం మొదలుపెట్టాడు.

అతని వెర్రికి నవ్వాలో ఏడ్వాలో తెలియని సూటార్ అదంతా మోసమని చెప్పినా వినిపించుకునే స్థితిలో లేడతను.

కాబట్టి 'ఎందెందు వెదికి చూచిన అందందే కలరు మూర్ఖులు' అని చదువుకోవచ్చు మనం.

# కప్పల పెళ్ళి

చంద్రమండలం మీద మనిషి కాలు మోపిన ఈ శతాబ్దంలో కూడా ప్రజలు అజ్ఞానాంధకారంలో తలమునకలుగా వున్నారంటే చాలా విచారించదగ్గ విషయం. వ్యవసాయం ప్రధాన వృత్తిగా గల మన దేశంలో వర్షాలకోసం రైతులు ఎదురుచూడవలసి వస్తోంది. తగినంత నీటి సదుపాయం లేని కారణంగా వర్షాల కోసం చకోర పక్షుల్లా ప్రజలు మేఘాల కోసం ఎదురు చూస్తూ కూర్చోవలసి వస్తోంది.

కానీ వివిధ రాష్ట్రాల్లో జనం వర్షాల కోసం అవలంబించే మూర్ఖపు పద్ధతులు

చాలా నవ్వు పుట్టించేటట్టున్నాయి.

ఉత్తర ప్రదేశ్‌లో చాలా గ్రామాల్లో 'జోకుమార' అనే పండగ వరుణదేవుడి ప్రీత్యర్థం చాలా అట్టహాసంగా జరుగుతుంది. స్త్రీలు వేపాకులూ, పువ్వులూ తలచుట్టూ అలంకరించుకుని గ్రామం చుట్టూ ప్రదక్షిణలు చేస్తారు. దార్లో రైతుల దగ్గర ఆగి చేతులు చాపుతారు. వాళ్ళు వేపాకులు, పువ్వులు దోసిట్లో వేసారు. ఇలా ఊరేగింపు పొలాల వేపు సాగిన తర్వాత అక్కడ 'జోకుమార' అనే వ్యంగ్య, హాస్య విగ్రహాన్ని సృష్టి



సారు. కొన్ని చోట్ల ఆ విగ్రహం మీదుగా నడుస్తారు. కోపం వచ్చి వరుణదేవుడు వానలు కురిపిస్తాడని వీళ్ళ ఆశ.

'పర్జన్య యజ్ఞం' అనేది చాలా పురాతన వేద సంప్రదాయం. కప్పని ఇంద్రుడి ప్రధాన సేవకుడిగా పరిగణిస్తారు వీళ్ళు. ఆ విధంగా వరుణుడికి కూడా కప్ప చాలా దగ్గిర బంధువే. దీని పరంగా మన రాష్ట్రంలో ఒక వింత ఆచారం అమల్లో వుంది. యువకులు, పిల్లలూ కలిసి ఓ బుట్టలో రెండు కప్పల్ని పెట్టి చుట్టూ వేపాకులు పేర్చి ఊరంతా ఆడుతూ, పాడుతూ తిరుగుతారు. కప్పల బెక బెకలూ, పిల్ల కూతలూ విని వానలు కురుస్తాయని వీళ్ళ నమ్మకం.

మరికొన్ని ప్రదేశాల్లో వానల కోసం కప్పని తిరగలికి కట్టి 'గొంతియెల్లమ్మ' అనే బురద విగ్రహాన్ని పక్కనే ఉంచుతారు.

బళ్ళారి జిల్లాలో కూడా ఇటువంటి ఆచారం ఉంది. అక్కడ కూడా మహారాణీ సమేతుడైన రాజావార్లా కప్పల్ని వెదురుబుట్టలో వేపాకుల్తో ఏర్పాటు చేయబడిన శయ్యలో ఉంచి పాటలు పాడుతూ వరుణ దేవుడ్ని ప్రార్థిస్తూ ఊరేగిస్తారు.

అస్సాంలో కప్పలకి పెళ్ళిళ్ళు చేసి, తద్వారా ఇంద్రుడ్ని సంతుష్టుడ్ని చేసే ఆచారం ఉంది. పూర్తిగా శాస్త్ర ప్రకారం కప్పలకి పెళ్ళి జరుపుతారు. ఇంద్రుడు తన సేవకుడికి జరిగిన గౌరవానికి మురిసిపోయి కుంభవృష్టి కురిపిస్తాడని వీళ్ళ విశ్వాసం. కానీ బీహార్లో దీనికి వ్యతిరేకంగా కప్పల్ని హింసించి, ఆ విధంగా ఇంద్రుడికి కోపం తెప్పిస్తే వానలు పడతాయని అక్కడి జనం నమ్మకం.

## రికార్డు బ్రేక్

'రికార్డు బద్దలు కొట్టడంలో మా వాళ్ళు ప్రముఖ స్థానం వహించారోచ్' అని గర్వంగా చెప్పుకోవచ్చు మనం కూడా! 'గిన్నెస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్' లో మనవాళ్ళ పేర్లు కూడా ఎక్కాయి.

కలకత్తా వాస్తవ్యుడైన మురారీ మోహన్ ఆదిత్య అనే అతను గోళ్ళని

 

పెంచడంలో రికార్డు సాధించేడు. 1962 నుంచి పెంచుతున్న ఈయన ఎడంచేతి గోళ్ళ పొడవు 70 అంగుళాలు. పాముల్లా మెలిదిరిగిన ఈ గోళ్ళకి చక్కగా రక రకాల రంగులు వేసి గోరుకో పేరు పెట్టి పిలుచుకుని మురిసి పోతున్నాడు. రమేష్ శర్మ అనే ఢిల్లీ పెద్దమనిషి కూడా ఈ కోవకి చెందినవాడే. పదకొండేళ్ళు శ్రమ పడి పెంచితే ఇతని గోరు 23 అంగుళాలు పెరిగిందట.

బీహారుకి చెందిన 'తిలియా' అనే ఆవిడ ప్రపంచంలోకెల్లా పొడవైన



స్త్రీగా పరిగణింపబడుతోంది. ఈమె పొడవు ఏడడుగుల ఐదంగుళాలు. ఈవిడ ఈ మధ్యే మరణించింది.

ప్రపంచంలోకెల్లా బరువైన కవలలు (ఐదుగురు) 1956 లో పాండిచ్చేరికి చెందిన మిసెస్ కమలా మామల్ అనే ఆమెకు పుట్టారు. వాళ్ళ బరువు 25 పౌన్లు.

మసూరియా దియా అనే ఉత్తర ప్రదేశ్ మీసాలరాయుడి మీసాల పొడవు 102 అంగుళాలు. వీటి సంరక్షణకి సంవత్సరానికి రూ. 240 ఖర్చెడుతున్నాడా మహానుభావుడు.

వేసవికాలం కాస్త జుత్తు పెరిగితేనే చికాగ్గా వుంటుంది. కానీ తిరువాడుతురై మఠాధిపతి పండూర సన్నిధి కేశాల పొడవు 26 అడుగులట.

ఆఫ్రికన్ పిగ్మీల కంటె పొట్టి వ్యక్తులున్న తెగ అండమాన్ దీవుల్లో అంజెస్ అనే ప్రదేశంలో ఉంటున్నారు. ఆ తెగలో పురుషుల పొడవు 4' 5".

స్వామి మౌజ్‌గిరి మహరాజ్ అనే స్వామీజీ 17 సంవత్సరాలపాటు ధ్యాన మగ్నుడై రికార్డ్ స్థాపించేడు. రాత్రిళ్ళు మాత్రం కాస్సేపు విశ్రాంతిగా నిద్ర పోతాట్ట. ఈయన షాజహాన్‌పూర్ నివాసి.

ప్రపంచ ప్రసిద్ధ చలన చిత్ర గాయని లతా మంగేష్కర్ ఇప్పటికి ఇరవై భారతీయ భాషల్లో 1948 నుంచి ఇప్పటి దాకా 1800 చిత్రాల్లో 25,000 పైచిలుకు పాటలుపాడి రికార్డ్ సృష్టించింది.

మరొక రికార్డు సృష్టికర్త కలకతాకి చెందిన గజ ఈతగాడు మిహిర్ సేన్. 1966 ఏప్రిల్‌లో పాక్ జలసంధిని, ఆగస్టులో జిబ్రాల్టర్ జలసంధిని, సెప్టెంబర్‌లో డార్డ్‌నెల్స్ జలసంధిని(యూరప్, ఆసియా మైనర్ మధ్యనున్న జలసంధి), అక్టోబర్‌లో పనామా కాలువని ఈదేడు. ఇతని రికార్డుని ఇంతవరకూ ఎవరూ బద్దలు కొట్టలేదు.

ఇహ దీర్ఘ కాలం నిలిచిన వైవాహిక జంట తేముల్జీ వికాజీ. బొంబేకు చెందిన వారు. అతని ఐదవయేట 1853 లో వివాహం జరిగింది. ఇద్దరూ కలిసి 86 ఏళ్లు కాపరం చేశాక తన 91వ యేట వికాజీ మరణించేడు.

రాయలసీమలోని ఓ గ్రామం అది. పేరు నెమలికొండ.

ఇటీవలే విద్యుత్‌శక్తి వచ్చిందా గ్రామానికి. వెయ్యి గడపలు మించి లేవా గ్రామంలో. నాలుగయిదు వేల లోపు జనాభా.

పోటీ లేకుండా పంచాయితీ ప్రెసిడెంట్‌గా నెగ్గాడు నెమలికొండలోని మోతుబరి రైతు కనకారావు. ఆ గ్రామ ప్రజలందరికీ కనకారావు దేముడు. కనకారావు ప్రయత్నం వల్లే ఆ గ్రామానికి ఎలక్ట్రిసిటీ వచ్చింది. రెండు సంవత్సరాల క్రితం స్కూల్ బిల్డింగ్‌కి గ్రాంట్ వచ్చింది. పూరిపాకలో వున్న స్కూలు సిమెంట్ కట్టడంలోకి మారింది.

కనకారావు చుట్టని ఆఖరిసారి పీల్చి దూరంగా విసిరేశాడు. పడకకుర్చీలోంచి లేచి ఇంటి వెనక వున్న గాది పొయ్యి వైపు నడిచాడు.

కనకారావుని దూరంనించే చూసి వినయంగా నిలబడ్డాడు వంటవాడు భీముడు.

"ఏరా! ఎంతదాకా వచ్చింది?" అడిగాడు కనకారావు-అక్కడి వ్యవహారాన్ని పరికించి చూస్తూ.

"ఇంకో గంటన్నరలోగా తయారయిపోతుందయ్యా!" చెప్పాడు భీముడు.

"ఆలస్యం చెయ్యకు. అల్లుడు మొదటిసారి మనింటికి రావడం."

"కోళ్ళు కొయ్యడం అయిపోయిందయ్యా! వేడిగా వుండాలని కోడికూర ఆఖరున పెట్టాను."

"సరే కానీ."

"అయ్యా!"

"ఏందిరా?"

"చిన్న మాట శెలవివ్వచ్చా?"

"ఏందో త్వరగా చెప్పేడు."

"అల్లుడుగారి చదువు పట్నంలో అయిపోయింది. మరి ఆ డాక్టరీ బోర్డు మన గ్రామంలోనే కడితే బావుంటుంది కదా!"

కనకారావు తెల్లటి గుబురు మీసాల లోంచి మందహాసం చేశాడు.

"ఆలోచిద్దాం. ఏదీ అల్లుడు వచ్చి రెండు రోజులు కూడా కాలేదు. అప్పుడే ఈ విషయాలు మాట్లాడితే ఎలారా?"

"చిత్తం"

"కానీ...ఎన్ని కోళ్ళు కోస్తున్నావు?"

"పదిహేను. పాతిక మంది పైనే వున్నారుగా"

"సరేకానీ"

కనకారావు మళ్ళీ ఇంటి ఎదురుగా వేప చెట్టు నీడలో వేసివున్న పడక కుర్చీ దగ్గరకి చేరుకున్నాడు. పడుకుని, తాటాకుతో అల్లిన చుట్టల పెట్టె మూత తెరిచి ఓ చుట్ట అంటించాడు.

సగం చుట్ట కాలేసరికి కనకారావు బాల్య స్నేహితుడు అనిమారెడ్డి వచ్చాడు.

"ఏం రెడ్డీ! ఎలా వుంది మీ ఆవిడకి?" అడిగాడు కనకారావు.

"ఇందాకే మిషనరీ ఆస్పత్రికి తీసుకెళ్ళాను. డాక్టర్ ఇంజక్షన్ ఇచ్చాడు. ఇక రావక్కర్లేదన్నాడు. పూర్తిగా నయమయింది పంటి నొప్పి. ముసలిదయిపోతోంది అది" నవ్వాడు గలగలా.

"పెద్దతనం వచ్చాక మనందరినీ ఏదో ఓ రూపంలో అనారోగ్య దేవత వరిస్తూంటుంది."

అనిమారెడ్డి కూడా ఓ చుట్ట తీసి అంటించాడు. మిత్రులిద్దరూ మౌనంగా వుండిపోయారు చాలా సేపు.

అనిమారెడ్డి తన పిల్ల పెళ్ళి గురించి




ఆలోచిస్తున్నాడు. కనకారావు వచ్చే ఆదివారం మంత్రిగారిని కలిసి, రైతులకి బావులలోంచి నీళ్ళు తోడే ఎలక్ట్రిక్ పంపులు కొనడానికి ఋణాలు మంజూరు చేయించే విషయమై ఎలా మాట్లాడాలో ఆలోచిస్తున్నాడు.

కనకారావు అల్లుడు మనోహర్ వచ్చాడు.

"రా బాబూ కూర్చో!" ఆహ్వానించాడు కనకారావు అల్లుడిని చూసి.

మనోహర్ అనిమారెడ్డికి నమస్కారం చేసి చప్టామీద కూర్చున్నాడు.

"లైబ్రరీ నుంచా?" అడిగాడు అనిమా రెడ్డి.

"లేదు. మిషనరీ ఆస్పత్రి నుంచి" చెప్పాడు మనోహర్. ఓసారి క్రాఫ్‌ని సవరించుకున్నాడు.

"డాక్టర్ జేమ్స్ వున్నాడా?" అడిగాడు కనకారావు అలవాటుగా మీసాలు దువ్వుకుంటూ.

తలూపాడు మనోహర్.

"మామయ్యా! మనవూరి బావులలోని నీళ్ళు టెస్ట్ చేయించాలి."

"ఏమయింది?" అడిగాడు అనిమా రెడ్డి. అతని కంఠంలో కొద్దిగా భయం చోటుచేసుకుంది.

"చాలామందికి నారపురుగు వ్యాధి అంటుకుంది. అది నీళ్ళ ద్వారానే వ్యాపిస్తుంది. ఆస్పత్రికి అరడజను మంది దాకా వచ్చారు వ్యాధి అంటుకున్నవాళ్ళు. ఇంకా చాలా కేసులున్నాయని చెప్పారు జేమ్స్."

"నిజమే! మా పాలేరు కొడుకు కూడా ఆమధ్య నారపురుగుతో ఇబ్బంది పడ్డాడు" చెప్పాడు అనిమారెడ్డి.

"మనింట్లోని బావినీళ్ళు కూడానా?" అడిగాడు కనకారావు. ఆయనా దీని సంగతి విని వున్నాడు.

"ఊహుఁ ప్రజలందరూ వాడే పబ్లిక్ వెల్స్‌లోని నీళ్ళు. ఆ వ్యాధి సోకినవారు దిగుడు బావిలోకి దిగకూడదు. కాళ్ళు ఆ నీళ్ళకి తగిలితే ఆ వ్యాధి క్రిములు నీళ్ళలో కలిసి మిగతావాళ్ళకి అంటుకునే ప్రమాదం వుంది."

"ఈసారి కడప వెళ్ళినప్పుడు సేనిటరీ ఇన్‌స్పెక్టర్లని పిలుచుకు వస్తాను.నిజమే. ఏదో చేయాలి" చెప్పాడు కనకారావు ఆలోచనగా.

"మనోహర్ బాబూ! నెమలికొండలోన్నే బోర్డు కట్టరాదూ. చదువయిపోయిందిగా ?" అడిగాడు అనిమా రెడ్డి. మనోహర్ చిన్నగా నవ్వి చెప్పాడు.

"ఎం. బి. బి. యస్.తో ఆపటంలేదు నేను చదువు. ఎం. ఎస్. చేద్దామనుకుంటున్నాను."

కనకారావు భార్య బయటకి వచ్చింది. అలసటగా ఉంది ఆమె మొహం.

"భోజనం వడ్డించమంటారా?" అడిగింది.

తల వూపాడు ఆకలితో నకనకలాడుతూన్న కనకారావు. చుట్ట పారేశాడు.

"పావుగంటాగి పిలుస్తాను మళ్ళీ" ఆవిడ లోపలికి వెళ్ళిపోయింది.

కనకారావు కొత్త చుట్ట తీసి పెదిమల మధ్య వుంచాడు.

'గొంతులో వచ్చే కేన్సర్‌కి ఇది మూల కారణం' మనసులో అనుకున్నాడు మనోహర్. తన మామగారు పొగ తాగటం ఎక్కువయిందని గమనించాడు.

* * *

అనిమారెడ్డి రెండు రోజుల తర్వాత

పుదయం నిద్రలేచే సరికి ఏదో ఇబ్బందిగా అనిపించింది. మంచంమీద నుంచి లేచి కూర్చున్నాక తలంతా బరువుగా వున్న ట్లనిపించింది చెవులు దిబ్బడ వేసుకున్న ట్లుగా అనిపించింది.

లేచి, కాలకృత్యాలు తీర్చుకుని పొలం వైపు నడిచాడు. మధ్యాహ్నానికల్లా అనిమారెడ్డి ఒంట్లో అనారోగ్యం ఎక్కువయింది.

క్రమంగా చెవుల్లో హోరు అధిక మయింది. సముద్రపు హోరు వింటున్న ట్లుగా అనిపించింది. అరిపాదాలు నేల మీద పెడితే నిప్పుల్లో పెట్టినట్లుగా మంట సాగాయి.

అనిమారెడ్డి పక్క పొలంలోని శ్రీనివాసరెడ్డి ఎద్దులబండి ఎక్కి అర గంటలో ఇల్లు చేరుకున్నాడు. తూలుతూ లోపలికి వెళ్ళాడు.

భర్తని చూసి అనిమారెడ్డి భార్య ఆశ్చర్యపోయింది. భయంగా అడిగింది నీరసించిన ఆయన మొహం చూచి–

"ఏమయింది ?"

"ఒంట్లో నలతగా వుంది" చెప్పాడు.

ఆవిడ భర్త వంటి మీద చెయ్యివేసి చూసింది. ''ఎలా కాలిపోతోందో ఒళ్లు" అన్నది కంగారుగా.

అనిమారెడ్డి మంచం మీద పడుకున్నాడు. కాసేపట్లో నిద్ర పట్టే సింది ఆయనకి. భార్య మంచం పక్కనే కుర్చీ వేసుకుని కూర్చుని తడిబట్టతో ఆయన ఒళ్లు అద్దసాగింది. సమయానికి కూతురు కూడా ఇంట్లో లేదు. కడప వెళ్ళింది. ఆ రాత్రి ఆయనకు మెలుకువ రాలేదు. జ్వరంవల్ల వచ్చిన మగతతో అలాగే పడుకున్నాడు. ఆయన్ని భార్య కూడా లేపలేదు. రాత్రంతా చలితో వణికిపోయాడు.

మర్నాడు పుదయం జ్వరం తగ్గింది. కాని ఆ ఒక్కరోజు జ్వరానికే బాగా నీరసించి పోయాడు అనిమారెడ్డి. రాత్రి జ్వరం ఎక్కువయితే బండిలో మిషనరీ ఆస్పత్రికి తీసుకు వెళదాం అనుకున్న ఆయన భార్య మర్నాడు ఆ విషయం మర్చిపోయింది, జ్వరం తగ్గడంతో.

సాయంత్రం అయేసరికి మళ్ళీ జ్వరం ఎక్కువయింది అనిమారెడ్డికి. చెవుల్లో సముద్రపు హోరు వినిపించడం లేదు ఇప్పుడు.

మాట్లాడకుండా నోరు కదుపుతున్న తన భార్యని చూశాడు. తనని చేత్తో తట్టిలేపి,తనవంక చూస్తూ ఏదో మాట్లాడు తోంది— నిశ్శబ్దంగా.

''సరిగ్గా మాట్లాడు" విసుక్కు న్నాడు అనిమారెడ్డి.

ఆవిడ ఆశ్చర్యంగా చూసింది భర్త వంక.

అనిమారెడ్డి మంచం మీద నుంచి లేచి గోడకి దిండు ఆనించి, ఆ దిండు మీద ఆనుకుని కూర్చున్నాడు. ఆయన అల వాటది.

క్షణకాలం వింతగాఅనిపించింది అనిమా రెడ్డికి. మంచంమీద కదిలాడు. ఇంకోసారి కదిలాడు. క్రమంగా అతని మొహంలో, కళ్ళలోకి భయం పాకటం గ్రహించింది అనిమారెడ్డి భార్య.

"ఏమిటి ?'' అడిగింది.

"చప్పట్లు కొట్టు''

ఆవిడ ఏమిటన్నట్లుగా చూసింది భర్త వంక.

"చప్పట్లు కొట్టు" మళ్ళీ చెప్పాడు.

ఆవిడ రెండు చేతులతో చప్పట్లు




కొట్టింది. ఆ శబ్దం అనిమారెడ్డి చెవులకి అందలేదు.

"నాకు వినపడటం లేదు" భయంగా చెప్పాడు.

"ఆఁ ?"

"అవును. మంచంమీద కదిలితే క్రిరు మంటుందిగా ఈ పాత మంచం. ఆ శబ్దం, చప్పట్ల శబ్దంవినపడటంలేదు. నువ్వు విసనకర్ర విసురుతున్నా నిశ్శబ్దంగా ఉంది అంతా.

అనిమారెడ్డి భార్య ఆయన చెవుల వంక చూసింది. అవి ఎర్రగా వున్నాయి రక్తమంతా చెవులలో నిలిచి పోయినట్లుగా. లేచి ఆయన చెవులని చేత్తో తాకింది.

"అబ్బా'' బాధగా అరిచాడాయన.

"మండిపోతున్నాయి చెవులు— నిప్పుల్లో వుంచినట్లుగా" చెప్పాడు మూలుగుతూ.

ఆవిడ ఆయన చెవుల దగ్గర నోరుంచి మాట్లాడింది.

"వినపడుతోందా ?"

సమాధానం లేదు.

ఈసారి ఇంకా గట్టిగా అడిగింది.

"వినబడుతోందా ? వినపడితే తల వూపండి"

సమాధానం లేదు.

మూడోసారి గొంతు చించుకుని అరిచింది ఆవిడ భయంగా.

"వినబడుతోందా ?"

ఆ మాటలు ఆయనకి వినబడినట్లు లేవు. పాలేరు పరుగెత్తుకు వచ్చాడు ఆ అరుపుకి చేతిలో గడ్డపలుగుతోనే. పెరట్లో పాదులకి నీళ్ళుపోయే మార్గం చేస్తున్నాడు.

"పోలయ్యా ! వెంటనే బండి సిద్ధం చెయ్యి. ఆస్పత్రికి వెళ్లాలి" చెప్పింది.

అయిదు నిమిషాల్లో బయలుదేరారు. అనిమారెడ్డి పది గజాల దూరంలో వీధి బయట ఆగివున్న బండిదాకా నడవలేక పోయాడు. కాళ్ళు నేలమీద వుంచితే నిప్పులో పెట్టినట్లుగా మంట. అరిపాదాలు ఎర్ర రంగులోకి మారాయి.

పోలయ్య, ఆయన భార్య ఎత్తి తీసుకెళ్ళి బండిలో పడుకోబెట్టారు. దారిలో మూలుగుతున్నాడు అనిమారెడ్డి. చలికి వణికిపోతున్నాడు.

అరగంట తర్వాత బండి మిషనరీ ఆస్పత్రి ప్రాంగణంలో ఆగింది. పోలయ్య లోపలికి వెళ్ళి నర్స్‌కి సంగతి చెప్పాడు. నర్స్ క్షణాల్లో స్ట్రెచర్‌తో బయటకి వచ్చింది.

వణికిపోతున్న అనిమారెడ్డిని చూసి 'మలేరియా' అనుకుంది. స్ట్రెచర్‌మీద పోలయ్య సహాయంతో పడుకోబెట్టింది. అనిమారెడ్డి వళ్లు కాలిపోవడం గుర్తించింది. నూటామూడు దాకా వుండచ్చు అనుకుంది మనసులో.

డాక్టర్ జేమ్స్ ఆ సమయంలో ఆస్పత్రిలో లేడు. టైఫాయిడ్‌తో బాధపడే స్కూల్ టీచర్‌కి ఇంజక్షన్ ఇవ్వడానికి వెళ్ళాడు పక్క గ్రామం.

డాక్టర్ వచ్చేలోగా నర్స్ దయానా అనిమారెడ్డిని మంచం మీద పడుకోబెట్టి చలికి వణుకుతున్న ఆయన ఒంటి నిండా వులెన్‌బ్లాంకెట్స్ రెండు కప్పింది. తర్వాత ధర్మామీటర్ తెచ్చి ఆయన నోట్లో వుంచింది.

39.4 సెంటిగ్రేడ్ టెంపరేచర్ వుంది.

"ఎంతుంది?" అడిగింది అనిమారెడ్డి భార్య.

"నూట మూడు మీద ఎనిమిది డిగ్రీలుంది"

"అమ్మ బాబోయ్! అంతే?" భయంగా అన్నాడు పోలయ్య గుండె మీద చెయ్యి వేసుకుని.

"ఏం జ్వరం?" అడిగింది ఆవిడ.

"మలేరియలాగా వుంది"

ఓ ఛార్టు తీసుకుని దానిమీద ఆయన పేరు రాసి టెంపరేచర్ రాసింది. ఎడ్మిట్ చేసుకున్న టైం కూడా రాసి అడిగింది—

"వయసు ఏభై అయిదు కదా?"

"వుండచ్చు. ఏ సంవత్సరంలో పుట్టారో ఆయనకే తెలియదు" చెప్పింది అనిమారెడ్డి భార్య.

వయసు కాలం ఎదురుగా 55 అని రాసింది నర్స్ దయానా. ఐస్‌బేగ్ తీసుకుని రెఫ్రిజరేటర్ తెరచి ఫ్రిజ్ బాక్స్‌లో వుంచిన ప్లాస్టిక్ మగ్గుని బయటకు తీసింది. అందులోని ఐసుని తీసి ఐస్ బేగ్‌లో వేసి అనిమారెడ్డి నుదుటి మీద వుంచింది.

అప్పుడు గమనించింది ఎర్రబడ్డ చెవులని దయానా. చేత్తో ముట్టుకుని చూసింది వాటిని.

బాధగా అరిచాడు అనిమారెడ్డి.

"ఆయనకి వినపడటం లేదు. వాటిని ముట్టుకుంటే నొప్పిగా వుందిట" చెప్పింది అనిమారెడ్డి భార్య దుఃఖాన్ని మింగుకుంటూ.

"అరి పాదాలు కూడా ఎర్రబడ్డాయి. నడవలేకపోతున్నారు" చెప్పాడు పోలయ్య.

ఛార్టు తీసుకుంది దయానా. ఆ వివరాలు కూడా ఛార్టులో రాసింది.

"జ్వరం ఎప్పుడు మొదలయింది?" అడిగింది.

"నిన్న మధ్యాహ్నం నించి"

దయానాకి ఏం చేయాలో తెలియలేదు. డాక్టర్ జేమ్స్ కోసం ఎదురుచూస్తూ అనిమారెడ్డి టెంపరేచర్ తగ్గడానికి నుదుటి మీద ఐస్ బాక్స్ అద్దసాగింది.

అనిమారెడ్డి భార్య నిశ్శబ్దంగా ఏడుస్తోంది. ఐస్ పెట్టేటంత జ్వరం వచ్చిందంటే అది చాలా ప్రమాదకరమయిన జ్వరం కిందే లెక్క ఆవిడ దృష్టిలో ట్రితం సంవత్సరం పెద కాపు భార్యకి జ్వరం వచ్చి పోయింది. ఆమెకి కూడా ఐస్ పెట్టారు పొయ్యేరోజు.

పోలయ్య బిక్క మొహం వేసుకుని చూస్తూండిపోయాడు.

అరగంట తర్వాత వచ్చాడు డాక్టర్ జేమ్స్. ఆయన వయసు అరవై అయిదు. పాతికేళ్ళ క్రితం అమెరికా నించి వచ్చి కడప జిల్లాలోని నెమలికొండలో మిషనరీ ఆస్పత్రి తెరిచాడు. అప్పటినుంచి ఆ చుట్టు పక్కల గ్రామాల్లోని ప్రజలకి వుచితంగా వైద్య సహాయం చేస్తూ ఆదివారాలు ఆస్పత్రి పక్కనే వున్న చర్చిలో ఏసుక్రీస్తు గురించి చర్చికి వచ్చే ప్రజలకి చెప్తూ ప్రశాంతంగా జీవితం గడుపుతున్నాడు. ఆస్పత్రి నడపడానికి కావలసిన డబ్బు న్యూయార్కులోని అమెరికన్ క్రిస్టియన్ సొసైటీనించి వస్తూంటుంది.

నర్స్ దయానా రెండు సంవత్సరాల క్రితం షికాగో నగరంనించి వచ్చింది. మరో నర్స్ మలయాళీ. పక్క గ్రామంలో ఎవరినో పాము కాటువేస్తే ఏంటీ వీనమ్‌సిరం ఇంజక్షన్ ఇవ్వడానికి వెళ్ళింది గంటన్నర క్రితమే.

జేమ్స్ ఛార్ అందుకుని చూశాడు. అన్నీ మలేర్టియా లక్షణాలే.కాని చెముడు రావడం, అరి పాదాలు నేల మీద పెట్ట




లేనంత బాధగా వుండటం ఆయనకి అంతుపట్టలేదు. మలేరియాలోని భాగం కావా లక్షణాలు.

"ప్రొకెయిన్ పెన్సిలిన్, క్లోరొక్వైన్ ఇంజక్షన్స్ ఇవ్వు" దయానాకి చెప్పాడు జేమ్స్.

మలేరియా జ్వరాన్ని అణచివేసే ఆ ఇంజక్షన్స్ ఇచ్చింది దయానా. రెండు గంటల తర్వాత టెంపరేచర్ తగ్గింది నూట రెండుకి.

కాని చెవుల ఎరుపుదనం తగ్గలేదు. చలికూడా తగ్గలేదు వణకు ఎక్కువైంది.

"ఏదయినా పురుగు కుట్టి వుండచ్చు. ఆ విషప్రభావం వల్ల చెముడు వచ్చి వుంటుంది. మలేరియా జ్వరం మాత్రం ఆ విషం వల్ల కాదు. సహజంగా వచ్చి వుండాలి" దయానా డాక్టర్ జేమ్స్‌తో చెప్పి ఆయన అభిప్రాయం కోసం ప్రశ్నార్థకంగా చూసింది.

ఆలోచనలో పడ్డ జేమ్స్ అడ్డంగా వూపాడు తల.

"చెముడు కలిగించే విషం గల పురుగు గురించి ఇంతదాకా ఎన్నడూ వినలేదు నేను."

డాక్టర్ జేమ్స్ అనిమారెడ్డి భార్యకి చెప్పాడు-పూర్తిగా నయమయ్యేదాకా ఆయన్ని ఆస్పత్రిలోంచి కదపడంమంచిది కాదని.

అనిమారెడ్డి తమ్ముడిని పిలుచుకు వచ్చాడు పోలయ్య. అతను కూడా నెమలికొండలో వ్యవసాయం చేసుకొంటున్నాడు. అన్నగారంటే భయం, భక్తి వున్నాయి.

రాత్రి అన్న దగ్గర తనే వుంటానని వదినకి ధైర్యం చెప్పి ఇంటికి పంపించాడు.

నర్స్ దయానా అనిమారెడ్డి బట్టలు మారుస్తూండగా గమనించింది వీపు మీద దద్దుర్లు. లేత నీలం రంగులో వున్నాయి పావలా కాసంత మేరవున్న దద్దుర్లు. పది హేను దాకా వున్నాయి అలాంటివి.

వెంటనే జేమ్స్ గదికి వెళ్ళి పిలుచుకు వచ్చి వాటిని చూపించింది. ఆయన వాటిని పరిశీలనగా చూసి చెప్పాడు-

"ఇలాంటి దద్దుర్ల గురించి ఎన్నడూ వినలేదు. వింతగా వుంది."

నర్స్ దయానా ఆ రాత్రి సరిగ్గా నిద్రపోలేదు. ప్రతీ రెండు గంటలకి అనిమారెడ్డి టెంపరేచర్ చూసి ఛార్ట్‌లో రాసింది. అనిమారెడ్డి మగతగా మూలుగుతున్నాడు. టెంపరేచర్ 103 తగ్గలేదు. వణుకు కూడా తగ్గలేదు.

ఆ రాత్రి జేమ్స్ కూడా నిద్రపోలేదు. పాత మెడికల్ జర్నల్స్ తిరగేశాడు ఎక్కడయినా అనిమారెడ్డికి వచ్చిన వ్యాధి వివరాల గురించి కనబడుతుందే మోనని.

ప్రయోజనం లేకపోయింది.

మర్నాడు వుదయం ఇంటినించి భోజనం తెచ్చింది అనిమారెడ్డి భార్య. కాని ఆకలి లేదని అనిమారెడ్డి ఒక్క మెతుకు కూడా ఎంగిలి పడలేదు. మూడు రోజుల్లోనే బాగా చిక్కిపోయాడు. 'కనీసం అయిదు కిలోలయినా తగ్గి వుంటాడు' దయానా మెడికల్ ఛార్ట్‌లో రాసింది.

సాయంత్రం అయ్యేసరికి టెంపరేచర్ మళ్ళీ పెరిగింది. 104.2 దాకా పెరిగింది.

ఏంటీ మలేరియా ఇంజక్షన్లు పని చేయలేదన్న సంగతి అర్థం అయింది డాక్టర్ జేమ్స్‌కి. ముక్కు వెంట నెత్తురు

కారసాగింది ఆగి ఆగి.

అనిమా రెడ్డి బాధగా మూలుగుతున్నాడు.

“కడప తీసుకు వెళ్ళడం మంచిది” చెప్పాడు అనిమారెడ్డి తమ్ముడికి ఆయన. తనవల్ల కాదని అర్థమైంది.

“నేను చచ్చినా పర్వాలేదు. కాని నన్ను మాత్రం కదల్చకండి. ఒళ్ళంతా సూదులు గుచ్చుకున్నట్లుగా వుంటోంది కదిలితే.”

రానని మొండికేశాడు అనిమారెడ్డి. గ్లూకోస్ వాటర్ ఎక్కించాడు డాక్టర్ జేమ్స్ డీ-హైడ్రేషన్ మొదలవటంతో. అయిదో రోజు దాకా మంచినీళ్ళు దాహం వేసినప్పుడల్లా తాగుతున్నాడు అనిమారెడ్డి. కాని అయిదో రోజు నుంచి తాగిన నీళ్ళు తాగినట్లే వాంతి చేసుకోసాగాడు.

మూత్రం రావడం కూడా ఆగిపోయింది. కిడ్నీ పాడయివుంటుందని గ్రహించాడు డాక్టర్ జేమ్స్. ఆర్టిఫిషి





యల్ కిడ్నీ మిషన్ లేదు. పరిస్థితి అలాగేసాగితే శరీరంలోని రక్తంలోవుండే చెడు పదార్థాలు బయటకి వెళ్ళక, చెమట ద్వారా కొంత బయటకి వచ్చినా చివరకి మరణం తప్పదని తెలుసు డాక్టర్ జేమ్సకి.

క్రమంగా మాట్లాడలేకపోయాడు అనిమారెడ్డి. గొంతు బాగా వాచింది. నోరు తెరిస్తే లోపల కనపడే నాలిక, కొండ నాలిక బాగా వాచి రక్తపు ముద్దలా కన

బడ్డాయి. చెంపలలోపలి భాగంలో, నాలిక మీద తెల్లటి గుండుసూది తలంత పొక్కులు కనబడ్డాయి.

అనిమారెడ్డి స్పృహలోలేడు. ఆ రోజంతా. కడపనించి ఆయన కూతురిని పిలిపించారు. చాలామంది వచ్చి ఆయన్ని చూసి వెళుతున్నారు.

ఒంట్లో బాగాలేదని అంతకు ముందు రోజే కనకారావు చిన్న కొడుకుని ఆస్పత్రికి తీసుకువచ్చాడు కనకారావు. నూటరెండు దాకా జ్వరం వుంది కనకారావు కొడుకుకి.

నర్స్ దయానా మలేరియాగా గుర్తించింది ఆ జ్వరం. చలికి వణుకుతున్నాడు పద్నాలుగేళ్ళ కుర్రాడు. ఏంటీ-మలేరియా ఇంజక్షన్స్ చేసింది.

కనకారావు అనిమారెడ్డిని పరామర్శ చేశాక ఆయన తమ్ముడితో చెప్పాడు.

"చేతబడిలాగా వుంది. బంగారయ్యని పిలిపించి ధూపం వేయించి తిరగ్గొట్టిచ్చండి. ఎవరు చేశారో తెలుస్తుంది· ఆలస్యం చేయకండి."

అనిమారెడ్డి తమ్ముడు అప్పటికప్పుడు పక్క గ్రామంలో వుండే మంత్రగాడు బంగారయ్యని పిలిపించి సంగతి చెప్పాడు. బంగారయ్య వేపాకులు, వేపకొమ్మలు తీసుకొచ్చి, వాటిని నీళ్ళలో వేసి ఆ నీళ్ళతో స్నానం చేసి, నేలమీద ముగ్గులు గీసి మంత్రాలు చదివి, కోడిగుడ్లమీద గీతలు గీసి, వాటిని పగల కొట్టి నానా ఆర్భాటం చేశాడు ఓపూట.

అయినా అనిమారెడ్డి పరిస్థితి ఇంకా క్షీణించ సాగింది. ఇక కడపకి తీసుకెళ్ళి కూడా ప్రయోజనంలేదని తెలుసు డాక్టర్ జేమ్స్‌కి.

అనిమారెడ్డి టెంపరేచర్ 107 దాకా పెరిగింది. బాగా బలమయిన మనిషి కాబట్టి ఆయన తట్టుకోగలుగుతున్నాడు కాని ఇంకొకరయితే ఒంట్లో కుంపటి మండుతున్న భావన కలిగేలా కాచే ఆ జ్వరానికి తట్టుకోలేరు.

మర్నాడు కనకారావు ఒక్కడే వచ్చాడు ఆస్పత్రికి.

"ఎలా వుంది మీ అబ్బాయికి?" అడిగింది నర్స్ దయానా.

"ఏం బాగాలేదు. ఎక్కువయింది. మీరే ఓసారి వచ్చి చూడాలి" చెప్పాడు దిగులుగా.

"ఓ అరగంటాగి వస్తాను."

"మావాడికి చెముడొచ్చింది. వినబడటంలేదు" చెప్పాడు కనకారావు. ఆయన కంఠం దుఃఖంతో జీరపోయింది.

దయానా కొన్ని క్షణాలు కళ్ళు మూసుకుంది. తర్వాత కళ్ళు తెరచి అడిగింది-

"చెవులు ఎర్రబడ్డాయా?"

"అవును."

"అక్కడ ముట్టుకుంటే బాధగా వుందంటున్నాడా?"

"అవును."

"అరిపాదాలు?"

"అవీ ఎర్ర బడ్డాయి. నడవలేక పోతున్నాడు. మా అల్లుడు ఏవో ఇంజక్షన్లు ఇచ్చాడు కాని ఉపయోగం లేక పోయింది. వాడు కుర్రాడు. పూర్తిగా డాక్టరీ తెలియదు."

"అయితే వెంటనే డాక్టర్ జేమ్స్ దగ్గరకి పదండి" చెప్పింది దయనా.

ఇద్దరూ అనిమారెడ్డి మంచం పక్క నిలబడ్డ డాక్టర్ జేమ్స్ దగ్గరకి వెళ్ళారు. "డాక్టర్! వీళ్ళబ్బాయికి కూడా ఇవే రోగ లక్షణాలు వచ్చాయి" చెప్పింది జేమ్స్‌తో.

జేమ్స్ క్షణకాలం కనకారావు కళ్ళ




లోకి చూసాడు. తర్వాత అనిమారెడ్డి గుండెలదాకా వున్న తెల్ల దుప్పటిని పైకిలాగి, మొహం కనపడకుండా పూర్తిగా కప్పాడు.

వెనక్కి తిరిగి చెప్పాడు.

"వెంటనే మీ అబ్బాయిని కడపలోని జనరల్ హాస్పిటల్‌కి తీసుకెళ్ళండి. నేనేం చేయలేనిక్కడ. సరయిన మందులు లేవు"

"అనిమారెడ్డి......?" అడిగాడు కనకారావు భయం భయంగా, పూర్తిగా దుప్పటి కప్పి వున్న శరీరాన్ని చూస్తూ.

డాక్టర్ జేమ్స్ చేత్తో క్రాస్ గుర్తువేసి మౌనంగా వెనక్కి తిరిగాడు. తల పగిలి పోతోంది ఆయనకి. తలంతా బరువుగా వుంది. చెవుల్లో సముద్రపు హోరు విని పిస్తోంది.

నెమ్మదిగా తన గదిలోకి వెళ్ళి రెండు ఏస్ప్రిన్ మాత్రలు వేసుకుని మంచినీళ్ళు తాగి పడుకున్నాడు అలసటగా.

అనిమారెడ్డికి ఆ జ్వరం వచ్చి అప్పటికి సరిగ్గా తొమ్మిది రోజులయింది.

* * *

జేమ్స్ నోట్లోంచి థర్మామీటర్ తీసి టెంపరేచర్ చూసింది దయానా.

''నూట నాలుగు'' చెప్పింది.

థర్మామీటర్‌ని కడిగి, జేమ్స్ పక్కన కూర్చుని ఐస్‌బేగ్‌ని ఆయన నుదుటిమీద వుంచి మృదువుగా అద్దసాగింది. ఆయన బాధగా మూలుగుతున్నాడు. చలికి వణుకు తున్నాడు.

ఆయన వంక చూసింది దయానా.

ఎర్రటి శరీరం. సూర్యరశ్మి వల్ల కొద్దిగా రంగు మారింది చర్మం. బట్ట తల. సన్నటి కోల మొహం. నీలంరంగు కళ్ళు. ఆరడుగుల ఎత్తు. మెళ్ళో వెండితో చేసిన క్రాస్. పొడుగాటి వేళ్ళు. మిషనరీ ఫాదర్స్ ధరించే తెల్లటి గౌను. నడుముకి కట్టుకున్న నల్లటి తాడు.

''ఇది మలేరియా కాదు'' చెప్పింది.

జేమ్స్ కళ్ళు తెరచి చూశాడు దయనా వంక. చిరునవ్వు నవ్వాడు.

కొద్ది దూరంలో బల్లమీద వున్న బైబిల్ వంక సౌంజ్ఞ చేసి చూపించాడు. ఆయన కోరిక అర్థం చేసుకుని బైబిల్‌ని తెచ్చింది దయానా.

''చదువు.''

"ఇప్పుడా?"

''అవును ఆలస్యం కాకమునుపే."

అయోమయంగా చూస్తూన్న దయానా వంక చూసి చెప్పాడు డాక్టర్ జేమ్స్, పెద్దగా నిట్టూర్చి-

"బహుశ రేపటినించి నాకు చెవులు వినబడకపోవచ్చు."

ఆ ఒక్క వాక్యంతో దయానా మొదటి సారిగా అర్థం చేసుకుంది అంతా.

"ఇది అంటువ్యాధా ?" అడిగింది.

"అనుకుంటున్నాను."

కొన్ని క్షణాలు మాట్లాడలేదు దయానా. తర్వాత బైబిల్ పక్కన పెట్టి లేచి బయటకి వెళ్ళింది. డిస్పెన్సరీలో ఓ చిన్న గాజుగిన్నెలో నీళ్ళు పట్టి దాంట్లో డెట్టాల్ కలిపి ఆ గిన్నెతో తిరిగి డాక్టర్ దగ్గరకి వచ్చింది.

ప త్తిని ఆ నీళ్ళలో ముంచి డాక్టర్ రెండు చెవుల్లో నాలుగయిదు చుక్కలు వేసింది. తర్వాత ప త్తిని ఆ నీళ్ళలో ముంచి డాక్టర్ ఒళ్ళంతా శుభ్రంగా తుడి చింది నాలుగయిదుసార్లు.

డాక్టర్ జేమ్స్ నిద్రలోకి జారి పోయాడు. మరోసారి టెంపరేచర్ చూసింది.

నూట అయిదు పాయింట్ రెండు !
పెరిగింది !!

గబగబా ఐస్‌బేగ్‌లో, నీళ్ళయిన ఐసు బయట పారబోసి దాన్నిండా మళ్ళీ ఐస్ నింపి ఆయన నుదుట వుంచింది. మరో రెండు ఐస్‌బేగ్‌లని ఐస్‌తో నింపి డాక్టర్ ఛాతీమీద వుంచింది వాటిని.

ఐస్ బేగ్‌లని శరీరం మీద అద్ద సాగింది రెండు చేతులతో.

గంటలోగా మూడుసార్లు మార్చింది బేగ్‌లలోని ఐస్‌ని. లోపలి మంచు త్వరగా నీళ్ళయిపోతోంది. తర్వాత టెంపరేచర్ చూసింది మళ్ళీ. కొద్దిగా తగ్గింది జ్వరం.

నూటమూడు పాయింట్ ఎనిమిది.

దయానాలో ధైర్యం పుంజుకుంది.

టెంపరేచర్‌ని తగ్గించే విధానం ఇదే. మందులు కాదు. వుత్సాహంగా డాక్టర్ జేమ్స్ ఒంటిమీద ఐస్ బేగ్‌లని వుద్ద సాగింది.

మలయాళీ నర్స్ మార్తా లోపలికి వచ్చి చెప్పింది దయానాతో.

"మనోహర్ వచ్చారు. డాక్టర్‌తో మాట్లాడతానంటున్నారు"

"లోపలికి పంపించు" చెప్పింది దయానా.

కొన్ని క్షణాలలో మనోహర్ లోపలికి వచ్చాడు. డాక్టర్‌ని చూసి అడిగాడు దయానాని–

"జ్వరం వచ్చిందా?"

"అవును"

"అనిమారెడ్డిని శ్మశానానికి తీసుకెళ్ళారు. చూసి వస్తున్నాను"

కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా వుండిపోయారు ఇద్దరూ. మనోహర్ డాక్టర్ కాళ్ళనీ, చెవులనీ శ్రద్ధగా గమనించాడు.

"డాక్టర్‌కి కూడా అనిమారెడ్డి జ్వరం అంటుకుంది" చెప్పింది దయానా.

"ఆ విషయమే మాట్లాడదామని వచ్చాను. మా మామగారు కనకారావుకి కూడా ఒంట్లో నలతగా వుంది ఆ విష జ్వరం లక్షణాలే కనిపిస్తున్నాయి."

"చెవులు ఎర్రబడ్డాయా ?"

"పూర్తిగా చెక్ చేసి వస్తున్నాను. చెవుల్లో హోరుమనే శబ్దం వినిపిస్తోందిట. అరి పాదాలు ముట్టుకుంటే నిప్పులో వుంచి కాలిస్తే ఎలా బాధేస్తుందో అంత బాధగా వుందిట. వీపుమీద లేత నీలం రంగు దద్దుర్లు చాలా వచ్చాయి. నూటమూడు పైనే టెంపరేచర్"

"డాక్టర్‌కి కూడా ఇవే లక్షణాలు కనిపించాయి" చెప్పింది దయానా.

పెద్దగా నిట్టూర్చాడు మనోహర్.

"ఇదివరలో ఇలాంటి విషజ్వరం ఎవరికయినా వచ్చిందా ఈ చుట్టు పక్కల ?" అడిగాడు.

"లేదు. ఇదే మొదటిసారి"

"నేను హౌస్ సర్జెన్ ఇటీవలే పూర్తి చేశాను. పుస్తకాల్లో కానీ, ఆస్పత్రులలో కానీ ఇలాంటి వ్యాధి గురించి చదవలేదు, చూడలేదు. కొత్తగా వుంది నాకు"

డాక్టర్ జేమ్స్ కళ్ళు తెరచి చూశాడు.

"ఎలావుంది?" అడిగాడు మనోహర్.

"నిప్పుల్లో వున్నట్లుగావుంది ఒళ్ళంతా. చలిపేస్తోంది కొద్ది కొద్దిగా... నీ బావమరిదిని కడప తీసుకెళ్ళారా ?"

"తీసుకెళ్ళాం. ఆస్పత్రిలో ఎడ్మిట్ చేసుకున్నారు. నేను ఇందాకే వచ్చాను మా మామగారితో. తీరా ఇక్కడికి వచ్చాక ఆయనలో కూడా సింప్టమ్స్ కన

బడుతున్నాయి"

"నేను కూడా కడప ఆస్పత్రికి వెళ్ళామనుకుంటున్నాను" చెప్పాడు జేమ్స్ నీరసంగా.

"అయితే జీపు తీసుకు వస్తాను. మీ ఇద్దరినీ ఒకేసారి తీసుకెళ్ళచ్చు."

తలవూపాడు జేమ్స్.

తర్వాత గట్టిగా తుమ్మాడు.

"జలుబు చేసింది" అన్నాడు. మళ్ళీ అన్నాడు నవ్వి "అనిమారెడ్డికి ఈ సింప్టమ్ మాత్రం లేదు"

"ఐస్ బేగ్‌లవల్ల జలుబు చేసినట్లుంది" చెప్పింది దయానా.

మనోహర్ లేచి నిలబడి చెప్పాడు–

"ఓ గంటలో వస్తాను మళ్ళీ"

మనోహర్ వెళ్ళాక దయానాతో చెప్పాడు డాక్టర్ జేమ్స్–

"నా టేప్‌రికార్డర్ తీసుకు వస్తావా?"

దయానా లేచి వెళ్ళి టేప్‌రికార్డర్‌ని తెచ్చింది.

"దయచేసి నన్ను కాసేపు ఒంటరిగా వదులు. అమెరికాలోని నా తమ్ముడికి ఆఖరి వుత్తరం రికార్డ్ చేయాలి"

"ఆఖరి వుత్తరం ?" అడిగింది దయానా సంభ్రమంగా.

"అవును. అనిమారెడ్డిని కలుసుకోబోతున్నాను కొద్ది రోజుల్లోనే"

దయానా మొహం పాలిపోయింది వెంటనే.

"డాక్టర్ ! కడపలో వేక్సిన్స్ ఏమయినా వాడితే..."

దయానా మాటలకి అడ్డు వచ్చాడు డాక్టర్ జేమ్స్–

"నూటికి తొంభై తొమ్మిది పాళ్ళు ఇంతదాకా ప్రపంచంలో వున్న ఏ వేక్సిన్ పనిచేయదు ఈ జ్వరానికి. దేని మందు దానికే వుపయోగిస్తుంది. మలేరియా మందు టైఫాయిడ్‌కి పనిచేయదు. టి.బి. మందు కుష్టు వ్యాధికి పనిచేయదు"

"అంటే..."

"అంటే ఎందువల్ల ఈ వ్యాధి వస్తుందో, ఇది బేక్టీరియా వల్ల వస్తుందో లేక వైరస్ వల్ల వస్తుందో తెలుసుకుని, దాన్ని ఐడెంటిఫై చేసి ఆ తర్వాత ఆ కొత్త శత్రువుని సంహరించే మందు తయారుచెయ్యాలి. దిసీజ్ ఏ న్యూ ఎపిడమిక్"

దయానా కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఎక్కిళ్ళని బలవంతంగా ఆపుకోడానికి ప్రయత్నం చేసినా సాధ్యం కాలేదు.

డాక్టర్ జేమ్స్ దయానా తల నిమిరాడు ఆప్యాయంగా.

"మరణం మనిషికి తప్పదు. ఏడవకు" చెప్పాడు.

దయానా బయటికి వెళ్ళిపోయాక టేప్ రికార్డర్‌లో కొత్త కేసెట్‌ని వుంచి ప్లే, రికార్డ్ బటన్స్ రెండూ ఒకేసారి నొక్కి నెమ్మదిగా చెప్పసాగాడు–

"హలో డియర్ బ్రదర్ రాబర్ట్! దిసీజ్ జేమ్స్ స్పీకింగ్ టు యు. ఐ హేవ్ జస్ట్ కాంట్రాక్టెడ్ ఏ టెరిబుల్ కంటేజియస్ డిసీజ్..."

డాక్టర్ జేమ్స్ తన చావుకి సిద్ధపడుతూంటే పక్క గదిలో దయానా వెక్కి వెక్కి ఏడవసాగింది నిస్సహాయంగా.

* * *

మనోహర్ గంట తర్వాత వచ్చాడు. జీప్‌లో వెనుక సీట్ తీయించి పరుపులు పరిపించాడు. కనకారావు పడుకుని వున్నాడు జీప్‌లో. మనోహర్ ఆయనకి నిద్ర మాత్ర ఒకటి ఇచ్చాడు బాధ

తెలియకూడదని.

ఆస్పత్రిలో ముందు గదిలో దయానా ఓ నలభై ఏళ్ల రైతు కాలినించి నార పురుగుని బయటకి తీస్తోంది. అరగజం పైనే వుంది అది. తర్వాత ఏంటీ బయాటిక్స్ వేసి కట్టు కట్టింది. గాయాన్ని శుభ్రంగా కడిగి పెన్సిలిన్ ఇంజక్షన్ చేసింది.

మందు పొట్లం ఇచ్చి ఎప్పుడెప్పుడు వేసుకోవాలో వివరాలు చెప్పి పంపించింది.

"డాక్టర్‌గారు రెడీయేనా?" అడిగాడు మనోహర్. తల వూపింది.

దయానా శుభ్రంగా మోచేతిదాకా చేతులు కడుక్కున్నాక ఇద్దరూ డాక్టర్ జేమ్స్ గదిలోకి వెళ్ళారు.

జేమ్స్ బైబిల్ చదువుతున్నాడు. ఇద్దరినీ చూసి లేవబోయాడు. కాని అరికాలు మంట పుట్టడంతో కదలలేక పోయాడు.

"స్ట్రెచర్ తీసుకురండి" చెప్పాడు మనోహర్ దయానాకి.

దయానా స్ట్రెచర్ తెచ్చాక చెప్పాడు జేమ్స్ ఓ కవరు అందించి–

"దీన్లో కేసెట్ వుంది. అమెరికాలోని నా తమ్ముడికి పోస్ట్ ద్వారా పంపు. తర్వాత నేను...నేను మరణించడం సంభవిస్తే ఆ నల్ల ట్రంక్ కూడా నా బ్రదర్‌కి పంపే ఏర్పాటు చేయి. అమెరికన్ క్రిస్టియన్ సొసైటీకి కేబుల్ పంపితే మరో కొత్త డాక్టర్‌ని ఇక్కడికి పంపుతారు. నువ్వు ఆస్పత్రి చూసుకో.

దయానా కళ్ళలోంచి నీళ్ళు కారుతున్నాయి. ఏడుస్తూ జేమ్స్ చేతులు పట్టుకుంది.

జేమ్స్ ఆప్యాయంగా మరోసారి దయానా తల నిమిరాడు.

"తిరిగి వచ్చినా రావచ్చుగా?" అన్నాడు. ఆయన్ని స్ట్రెచర్‌మీద పడుకోబెట్టి బయటకు తీసుకు వచ్చారు.

మలయాళీ నర్స్ మార్తా అప్పుడే వచ్చిన భీముడిని పరీక్షిస్తోంది.

"ఏమయింది?" అడిగాడు మనోహర్ వాడిని.

"జ్వరం వచ్చింది. చెవుల్లో హోరుమంటోంది. అరికాళ్ళు నొప్పెడుతున్నాయి" చెప్పాడు.

జేమ్స్, మనోహర్ ఒకరి మొహం మరొకరు చూసుకున్నారు.

"వీడు మా వంటవాడు" చెప్పాడు మనోహర్ జేమ్స్‌తో. తర్వాత భీముడితో చెప్పాడు–

"పట్నం వస్తావా? ఇక్కడ మందు లేదు"

తల అడ్డంగా వూపాడు భీముడు. స్ట్రెచర్ మీద నుంచి జీపులోకి ఎక్కించారు జేమ్స్‌ని.

మనోహర్ అట్టే బలవంతం చేయలేదు భీముడిని. అతనికి తెలుసు ఇదేదో కొత్త వ్యాధని, కడపలో కూడా మందు దొరకదని. మరణించడం తథ్యం అయితే పుట్టి పెరిగిన గ్రామంలోనే పోవచ్చు భీముడు–అనుకున్నాడు మనసులో.

ఎక్కి కూర్చుని జీప్ స్టార్ట్ చేశాడు. దయానా, మార్తాలకి వెళ్తున్న జీపు కనబడలేదు.

కన్నీటి తెర అడ్డు పడింది.

* * *

జనరల్ హాస్పిటల్ సూపరింటెండెంట్‌తో మాట్లాడాడు మనోహర్ – జేమ్స్‌నీ, కనకారావునీ ఎడ్మిట్ చేశాక.





"కొత్త రకం రోగంలా వుంది ఇది" అన్నాడాయన అంతా విని.

"అవును. ఈ పేషెంట్లని ఏం చెయ్యాలి?"

"ఇది అంటు వ్యాధి కాబట్టి వీళ్ళని విడిగా వుంచాలి. మిగతా పేషెంట్స్‌తో కలిపితే ఇది వాళ్ళకి కూడా అంటుకో వచ్చు"

సూపరింటెండెంట్ హైదరాబాద్‌కి ట్రంకాల్ బుక్ చేసి పై అధికారులతో మాట్లాడాడు కొత్త రకం జ్వరం గురించి.

తర్వాత కనకారావుని, ఆయన కొడుకుని, జేమ్స్‌ని పరిశీలించాడు.

"ఈయన డాక్టర్ జేమ్స్. ఈ రోగంతో మరణించిన మొదటి పేషెంట్ అనిమా రెడ్డిని ట్రీట్ చేసింది వీరే" పరిచయం చేశాడు మనోహర్ కడప జనరల్ హాస్పిటల్ సూపరింటెండెంట్‌కి.

బలహీనంగావున్న జేమ్స్‌ని చూసి పలకరింపుగా నవ్వాడు సూపరింటెండెంట్.

"ఇది అంటువ్యాధి. మమ్మల్ని అందరు పేషెంట్స్‌తో కలపటం మంచిది కాదు. క్వారన్‌టైన్‌లో వుంచండి" చెప్పాడు డాక్టర్ జేమ్స్.

సూపరింటెండెంట్ మొహంలో వెంటనే ఆందోళన చోటు చేసుకుంది.

"ఇది భయంకర వ్యాధి. పేషెంట్‌ని చిత్రవధ చేసిగాని చంపదు. ఫ్లూ లాగా బలహీనం చేస్తుంది మన్నాటికల్లా. ఇంత వరకూ ఏ వ్యాధికీ లేని లక్షణం అరిపాదాలు నేలమీద పెట్టినా, చివరకి దుప్పటి తగిలినా నిప్పులో వుంచినట్లుగా మండటం. టైఫాయిడ్ వచ్చి తగ్గాక చెముడు వస్తుంది. కాని ఇది మూడో రోజుకల్లా కర్ణేంద్రియాన్ని నాశనం చేస్తుంది. తల మీద వెంట్రుకలు రాలుతాయి. హై టెంపరేచర్‌తో వుంటుంది జ్వరం. నూటమూడు తగ్గదు. క్రమంగా మాట్లాడలేం కూడా. గొంతు వాస్తుంది. దిసీజ్ రియల్లీ ఎ వెరీ డ్రెడ్‌ఫుల్ డిసీజ్"

ఆయాసపడుతూ చెప్పాడు జేమ్స్.

సూపరింటెండెంట్ కొద్దిగా భయంగా చెప్పాడు డాక్టర్ జేమ్స్‌తో-

"నిన్న వుదయం ఈ కుర్రవాడిని చేర్పించారు. ఇవాళ వుదయం ఇదే వార్డు లోంచి అయిదుగురిని డిశ్చార్జి చేసాం. పొరబాటున వాళ్ళకి ఇది సోకివుంటే..."

"వాళ్ళ చిరునామాలు మీ దగ్గర కార్డ్‌లో వుంటాయి. వెంటనే మీ మనుషులని పంపించి వాళ్ళని పిలిపించండి క్వారన్‌టైన్‌లో వుంచండి వాళ్ళని. డెవలప్‌మెంట్స్ చూసి తర్వాత డిశ్చార్జి చేయొచ్చు".

తల వూపాడు సూపరింటెండెంట్.

"నేను ఓ పేషెంట్‌ని ట్రీట్ చేశాను కాబట్టి డాక్టర్‌గా ఈ రోగ లక్షణాలని పరిశీలించాను. ఎవరయినా స్టెనో ని పంపిస్తే...మాస్క్ వేసుకొని వస్తే మరీ మంచిది...డిక్టేట్ చేస్తాను"

తల వూపాడు సూపరింటెండెంట్. ఆయనకి పరిస్థితి అర్థమయిన కొద్దీ భయం అధికం కాసాగింది.

"మందు వున్న అంటు రోగం ప్రబలితేనే దాన్ని కంట్రోల్ చేయటం కష్టం. మందులేని ఈ రోగం పాకితే..." ఓ గుటక వేసి ఆగాడు.

"నా బ్లడ్, యూరిన్, స్టూల్స్ సేంపిల్స్ తీసుకోండి. హైదరాబాద్‌లో బిర్లా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ రిసెర్చ్ వుంది. అక్కడికి పంపండి. వాటిని ఎనలైజ్ చేసి ఇది బాక్టీరియానో,

ఫంగసో లేక వైరస్ క్రిమో కను క్కుంటారు. ఆ తర్వాత ఏం చేయాలో వాళ్ళే ఆలోచిస్తారు".

సూపరింటెండెంట్ ఆలోచనల్లో పడ్డాడు. పరధాన్యంగా తల వూపాడు.

"బిర్లా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ రిసెర్చ్‌లో మా గురువుగారు వర్క్ చేస్తున్నారు. రిసెర్చ్ చేస్తున్నారు ట్రాపికల్ డిసీజెస్ మీద. నేను గాంధీమెడికల్ కాలేజీలో ఫైనల్ ఇయర్‌లో వున్నప్పుడు ఆయన మాకు విజిటింగ్ ప్రొఫెసర్‌గా వారానికి రెండు క్లాసులు తీసుకునేవాళ్ళు" చెప్పాడు మనోహర్.

"నువ్వే సేంపిల్స్ తీసుకుని వెళ్ళి ఆయనతో మాట్లాడితే మంచిది" చెప్పాడు జేమ్స్.

"వెళ్తాను" స్థిరంగా చెప్పాడు మనోహర్.

"పరిస్థితి వివరిస్తూ నేను లెటర్ రాసి ఇస్తాను. దాన్ని కూడా ఆయనకి ఇవ్వండి" చెప్పాడు సూపరింటెండెంట్. ఇంకా ఆయన మొహంలో భయం తగ్గలేదు.

"ఆలస్యం చేస్తే అనేకమంది ప్రాణాలకి ముప్పు రావచ్చు. ఎంత త్వరగా వెళితే అంత మంచిది. బహుశ ఈ వ్యాధికి ప్రపంచంలో ఎక్కడో ఓమూల ఎవరో మందు ఇప్పటికే కనిపెట్టి వుండచ్చు"

"ఇంకో అరగంటలో బయలుదేరుతాను"

"ఎలా వెళ్తావ్ ?"

"బస్‌లో"

జేమ్స్ కొన్ని క్షణాలు మౌనంగా వుండిపోయాడు. తర్వాత అన్నాడు-

"స్పెసిమన్స్ అతి జాగ్రత్తగా తీసుకెళ్ళాలి. దారిలో మిగతా ప్రయాణికులకి అంటించకూడదు ఈ వ్యాధి"

హాస్పిటల్ సూపరింటెండెంట్ వెంటనే చెప్పాడు-

"మా హాస్పిటల్ అంబులెన్స్‌లో వెళ్ళచ్చు"

"అది మంచిది" చెప్పాడు డాక్టర్ జేమ్స్.

"మిమ్మల్ని వెంటనే హాస్పిటల్ వెనక వున్న క్వారంటైన్ రూమ్స్‌లోకి మార్చే ఏర్పాటు చేస్తాను. మీ సేంపుల్స్ కూడా ఏర్పాటు చేస్తాను"

"ఎయిర్‌టైట్ వేక్యూమ్ కంటెయినర్స్ వున్నాయా సేంపుల్స్ తీసుకెళ్ళ డానికి?" అడిగాడు డాక్టర్ జేమ్స్.

తల వూపాడు సూపరింటెండెంట్. బయటికి వెళ్ళిపోయాడు.

"నాకు అంటుకో లేదు ఇంకా ?" అడిగాడు మనోహర్ డాక్టర్ జేమ్స్‌ని.

"నీ శరీరంలో ఏంటీబాడీస్ బలంగా వుండి వుండవచ్చు. నీ శరీరంలో కూడా ఈ విష క్రిమి ప్రవేశించి వుంటుంది నూటికి నూరుపాళ్ళు. కాని రోగ నిరోధక శక్తే అధికంగా వుండి వుండవచ్చు"

పది నిమిషాల తర్వాత స్టెనోగ్రాఫర్ వచ్చింది. డాక్టర్స్ ఆపరేషన్ చేసేటప్పుడు వేసుకునే తెల్లటి మాస్క్ ముక్కుకి, నోటికి అడ్డంగా కట్టుకుని వుంది.

జేమ్స్ రోగ లక్షణాలు వివరంగా డిక్టేట్ చేశాడు-పేషంట్ వయసు, సెక్స్, వృత్తి మొదలయిన వివరాలు తెలియచేశాక.

తర్వాత మరో లెటర్ డిక్టేట్ చేశాడు.

"ఈ రోగంతో నేను మరణించే పక్షంలో, నా మరణానంతరం నా శవాన్ని పోస్ట్‌మార్టంకి కాని, మరే ఇతర మెడికల్ రిసెర్చ్ ప్రోగ్రెస్‌కయినా ఉపయోగించు

క్కోవచ్చు. అందుకు నాకు ఎట్టి అభ్యం తరం లేదని తెలియ చేసున్నాను"

మనోహర్ ఇంజక్షన్ నీడిల్‌ని డాక్టర్ జేమ్స్ కుడిజబ్బలోని సిరకి గుచ్చి 10 సి.సి. రక్తాన్ని బయటికి తీశాడు.

మరో అరగంటలో యూరిన్, స్టూల్స్ సేంపుల్స్ తీసుకున్నాడు. ఆ వుంచిన బాటిల్స్‌నిస్టీల్ వేక్యూమ్‌కంటెయినర్స్‌లో వుంచాడు.

జేమ్స్ సంతకం పెట్టిన డెడ్‌బాడీ డొనేషన్ లెటర్‌ని జేబులో వుంచు కున్నాడు.

హాస్పిటల్ సూపరింటెండెంట్ హైదరా బాద్‌లోని తన పై అధికారులకి ట్రంక్ కాల్ చేసి పరిస్థితి వివరించాడు. మెడికల్ టీంని పంపుతున్నట్లుగా చెప్పారు అధికా రులు. వ్యాధి ప్రబలకుండా తగిన జాగ్రత్త తీసుకోవలసిందిగా హెచ్చరిం చారు.

సూపరింటెండెంట్ తన గదిలోని బాత్ రూంలోకి వెళ్ళి బట్టలు పూర్తిగా విప్పి నగ్నంగా షవర్‌బాత్ కింద నుంచు న్నాడు. మెడికేటెడ్ సోప్‌తో ఒళ్ళంతా అరగంటసేపు రుద్దుకున్నాడు. డెట్టాల్ కొద్దిగా కలిపిన నీళ్ళతో స్నానం చేశాక ఇంటినుంచి వచ్చినప్పుడు తను వేసుకున్న బట్టలు తొడుక్కున్నాడు. డాక్టర్ జేమ్స్‌ని చూడటానికి వెళ్ళినప్పుడు ధరించిన హాస్పిటల్ యూనిఫాంని తాక లేదు మళ్ళీ. వాటిని అలాగే బాత్‌రూంలో వుంచి బయటికి వచ్చాడు.

సూపరింటెండెంట్ కోసం ఎదురు చూస్తున్న మేల్ నర్స్ ఆయన యూని ఫాంలో లేకపోవడం గమనించాడు. తల మీద స్నానం చేసిన గుర్తుగా జుట్టంతా తడితడిగా వుంది. నుదుటి మీదకి కారు తున్నాయి నీటిబొట్లు.

"చెప్పు" అన్నాడు ఆయన ఫేన్ కిందకి కుర్చీ లాగి కూర్చుని.

"అయిదుగురిలో ముగ్గురు వచ్చారు. వాళ్ళని క్వారంటైన్ గదిలో వుంచాం"

"మిగతా ఇద్దరూ ?"

"ఒకరు ఇంట్లో లేరు. బయటికి వెళ్ళారు. ఇంటికి రాగానే ఆస్పత్రికి పంపమని ఇంట్లో చెప్పి వచ్చాను. అయిదో వ్యక్తి దొరకలేదు"

"చిరునామా సరిగ్గా ఇవ్వలేదా ?"

"ఇచ్చాడు. గంట క్రితమే వూరెళ్లే డని చెప్పాడు-అతను బసచేసిన మునిసి పల్ గెస్ట్‌హౌస్ కేర్‌టేకర్"

"ఏ వూరు ?"

"హైదరాబాద్. అక్కడ అకౌంటెంట్ జనరల్ ఆఫీసులో సెక్షన్ ఆఫీసరుగా పనిచేస్తున్నాడుట. ఆఫీసు పనిమీద ఆడిట్ చేయడానికి వస్తే ఇక్కడ జబ్బు చేసిం దట. బస్సులో హైదరాబాద్ వెళ్ళాడుట"

సూపరింటెండెంట్ చిన్నగా నిట్టూ ర్చాడు. తర్వాత టెలిఫోన్ అందు కున్నాడు.

* * *

కనకారావు చిన్నకొడుకు మాణిక్యాల రావు పరిస్థితి రోజు రోజుకీ దిగజారి పోతోంది. అనిమారెడ్డి అంత జ్వరాన్ని, బాధని ఓర్చుకోగలిగాడు కాని,పధ్నాలు గేళ్ళ మాణిక్యాలరావు ఆగలేక పలవ రింతలు మొదలుపెట్టాడు.

అనేక రకాల ఏంటీ బయోటిక్ ఇంజ క్షన్లు ఇచ్చారు. ప్రయోజనం లేక పోయింది. ఐస్‌బేగ్‌ల వల్ల జ్వరం తగ్గు తోంది గాని నూట మూడు దిగటం లేదు. ఐస్‌బేగ్‌ల వల్ల పడిసం పట్టింది అతనికి.




వూపిరితిత్తులనిండా కఫం చేరింది నాలుగో రోజుకే. అది నిమోనియాలోకి దించింది.

ఐస్‌బేగ్స్ తీసేశారు. నిమోనియాకి చికిత్స చేశారు. అనిమారెడ్డికి ఏ విధంగా రోజురోజుకీ ఆరోగ్యం క్షీణించిందో అదే విధంగా ముగ్గురికీ ఆరోగ్యం దెబ్బ తింటోంది— సరిగ్గా అదే పద్ధతిలో.

వాళ్ళని క్వారన్‌టెయిన్‌లో మిగతా రోగులకి దూరంగా ఉంచినా ప్రయోజనం లేకపోయింది. అయిదారుగురు పేషెంట్స్‌కి కూడా ఆ కొత్త వ్యాధి అంటుకుంది అప్పుడే.

హాస్పిటల్ స్టాఫ్‌లో ఓ డాక్టరుకి, ఓ మేల్ నర్స్‌కి, ఇద్దరు ఫీమేల్ నర్స్‌లకి, స్వీపర్‌కి జ్వరం వచ్చింది. ఆ వ్యాధి లక్షణాలు కనిపించాయి ఆ అయిదుగురిలో.

మొత్తం పదిమంది ఆ వ్యాధికి గురయ్యారు. సూపరింటెండెంట్ వాళ్ళని దూరంగా వున్న క్వారన్‌టెయిన్ గదుల్లో వుంచాడు.

వాళ్ళ గదిలోకి వెళ్ళిన ప్రతి డాక్టర్, నర్స్ బయటకి వచ్చాక మెడికేటెడ్ సోప్‌తో స్నానం చేస్తున్నారు ఇప్పుడు. హాస్పిటల్‌లో నీటిని ఇరవై నిమిషాలసేపు కాచి దాన్ని తాగడానికి ఇస్తున్నారు పేషెంట్లకి. ఆ పేషెంట్స్ వున్న గదుల్లోంచి బయటకి వచ్చే ప్రతి వస్తువుని స్టెరిలైజ్ చేస్తున్నారు. ఆ గదుల వైపు ఎవరూ వెళ్ళకుండా వాచ్‌మేన్‌ని కాపుంచారు ఇరవై నాలుగు గంటలూ.

వాళ్ళలో ఏర్పడే మార్పులని ఏరోజుకారోజు బిర్లా ఇన్‌స్టిట్యూట్ అఫ్ మెడికల్ రిసెర్చ్‌లోని ట్రాపికల్ డిసీజెస్‌మీద రిసెర్చ్ చేసే డాక్టరుకి తెలియ చేస్తున్నాడు సూపరింటెండెంట్ ఫోన్ మీద.

ఆ డాక్టరు పేరు గౌతమ్.




లేబొరేటరీలో ఎలుకలని పరీక్షిస్తూంటే లేబ్ అసిస్టెంట్ వచ్చి చెప్పాడు గౌతమ్‌కి అతని కోసం ఎవరో వచ్చారని.

విజిటర్స్ రూంలో, చేతిలో తోలు సంచీతో కూర్చుని వున్న మనోహర్- గౌతమ్ ఆ గదిలోకి రాగానే లేచి నిలబడి తనని తాను పరిచయం చేసుకున్నాడు.

"గుర్తున్నావు" చెప్పాడు గౌతమ్ నవ్వి. గౌతమ్‌లో ఎలాంటి మార్పూలేదు. రెండున్నర సంవత్సరాల క్రితం ఆఖరిసారి చూసినప్పుడు ఎలా వున్నాడో దాదాపుగా అలాగే వున్నాడు.

అయిదు అడుగుల ఎనిమిది అంగుళాల పొడవు. తెల్లటి శరీరం. నల్లటి వత్తయిన జుట్టు, నల్లటి మీసం, చురుకుగా చూసే కళ్ళు. కుడి కాలు ఎడం కాలి కన్నా అరంగుళం పొడవు. కాని నడిచేటప్పుడు తేడా ఎంత మాత్రం తెలియదు. కారణం ఎడం కాలికున్న బూట్ కుడి కాలుకున్న బూటు కన్నా అరంగుళం ఎత్తు. కాని కాళ్ళకి ప్రత్యేకంగా చేయించుకున్న ఆ బూట్లు లేకపోతే నడకలో తేడా తెలిసిపోతుంది. గౌతమ్ మొహం చూస్తే తెలివిగలవాడన్న సంగతి విశద

మవుతుంది చూపరులకి.

మనోహర్‌కి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు గౌతమ్.

"చెప్పండి" అన్నాడు కుడికాలుని ఎడంకాలు మీద వేసి.

"నేను కడప నించి వస్తున్నాను. కొత్త వ్యాధి గురించి మీకు తెలిసిందా?" అడిగాడు.

"ఏ కొత్త వ్యాధి?" అడిగాడు డాక్టర్ గౌతమ్.

"ఇవాళ వుదయం పేపర్‌లో వచ్చిందనుకుంటాను."

"తెలియదు"

మనోహర్ పావుగంట సేపు అనిమారెడ్డి ఏ విధంగా మృత్యువుకు గురయిందీ చెప్పాడు. గౌతమ్ శ్రద్ధగా విన్నాడు. క్రమంగా అతని భృకుటి ముడిపడది.

తర్వాత మనోహర్ డాక్టర్ జేమ్స్ గురించి చెప్పాడు. తన మామగారు కనకారావు, బావమరిది మాణిక్యాలరావు గురించి చెప్పాడు. తను తీసుకువచ్చిన సేంపిల్స్ గురించి చెప్పాడు.

డాక్టర్ జేమ్స్ రాసిన దోనర్ లెటర్, రోగ లక్షణాల గురించిన వివరాలు గల లెటర్ అందించాడు గౌతమ్‌కి.

గౌతమ్ కొన్ని క్షణాలు వాటిని అందుకోకుండా అలాగే కూర్చున్నాడు ఆలోచిస్తూ. తర్వాత లేచి నిలబడి చెప్పాడు–

"ఇప్పుడే వస్తాను"

అయిదు నిమిషాల్లో చేతులకి గ్లోవ్స్ తొడుక్కుని వచ్చాడు. అప్పుడు తీసుకున్నాడు లెటర్స్. వాటిని విప్పబోతూ చెప్పాడు చిన్నగా నవ్వి–

"జాగ్రత్త అవసరం"

జాగ్రత్తగా రోగ లక్షణాల గురించి అయిదారుసార్లు చదివాడు.

మనోహర్ అడిగాడు.

"దీనికి మందుందా?"

"ఇలాంటి వ్యాధి గురించి వినలేదు ఎప్పుడూ. జస్ట్ ఎ మినిట్"

మళ్ళీ లేచి లోపలికి వెళ్ళాడు. లేబొరేటరీలో ఓ ట్రేలో ఆ లెటర్స్ పడేసి, గ్లోవ్స్ విప్పి వాటిని గోడకి అమర్చిన ఎలక్ట్రిక్ పొయ్యిలో పడేసి ఆ రబ్బరు గ్లోవ్స్‌ని కాల్చేశాడు. చేతులని శుభ్రంగా మెడికేటెడ్ సోప్‌తో రుద్దుకుని కడుక్కున్నాడు.

తన క్యూబిక్‌లోకి వెళ్ళి అద్దాల బీరువా తెరిచి అందులోంచి 'ఇండెక్స్ టు డిసీజస్' అనే లావుపాటి నల్లటి బైండ్ బుక్ తీశాడు. నించునే 'ఆఫ్రికన్ డిసీజెస్' అనే సెక్షన్ తెరచి వ్యాధుల పేర్లు, వాటి లక్షణాలు చదవసాగాడు.

గౌతమ్ మెడమీద వేడిగా, తడిగా, మృదువుగా తాకాయి. వాటిని పెదిమలుగా గుర్తించాడు. వెనక నించి రెండు చేతులు అతని భుజాలని చుట్టేశాయి.

వెనక్కి తిరిగి చూసి నవ్వాడు.

"హలో ఉదయా! ఇవాళ శెలవు పెట్టి మళ్ళీ వచ్చావేం?" అడిగాడు.

"మిమ్మల్ని చూడాలనిపించి ... ఏమిటంత దీర్ఘంగా చూస్తున్నారు"

"కూర్చోండి"

ఉదయ గౌతమ్ పక్కనే వున్న బల్ల అంచుమీద సుతారంగా కూర్చుంది.

"ఆఫ్రికన్ ఫీవర్ ఒకటుంది. గుర్తుందా మీకు? ఈ హై ఫీవర్, బ్లీడింగ్ ఫ్రమ్ నోస్, ఫాలింగ్ ఆఫ్ ది హేర్, బ్లర్డ్ విజన్..."

"అదెందుకిప్పుడు?"

"చెప్పండి"

"అమెరికాలో మీ కాలిఫోర్నియా

యూనివర్సిటీ నుంచి వచ్చే బుల్లెటిన్‌లో వుంటుందది"

గౌతమ్ తను చదువుతున్న పుస్తకాన్ని మళ్ళీ అద్దాల బీరువాలో యథాస్థానంలో వుంచి అమెరికానించి వచ్చే మెడికల్ బుల్లెటిన్స్ వున్న ఫైల్‌ని తెరచి ఉదయ రాసిన ఇండెక్స్‌ని చూశాడు.

మే సంచికలో వున్నాయి తనకి కావలసిన వివరాలు. ఏ పేజీలో ఆ వివరాలుంటాయో ఉదయ రాసింది ఇండెక్స్‌లో.

ఉదయ పెదవులమీద అంటీ అంటకుండా ముద్దు పెట్టుకుని చెప్పాడు గౌతమ్–

"థాంక్స్ బేబీ!"

తర్వాత అది చదవటంలో మునిగిపోయాడు. పది నిమిషాల తర్వాత దాన్ని మూసి తల విదిలించాడు. డాక్టర్ జేమ్స్ రాసి పంపిన రోగ లక్షణాలు ఉదయకి వివరించి అడిగాడు డాక్టర్ గౌతమ్–

"ఇలాంటి రోగం గురించి ఎప్పుడయినా చదివిన గుర్తుందా?"

పెదవి విరిచింది ఉదయ.

"ఊహు"

గౌతమ్ రాయలసీమలోని కడప జిల్లాలో వున్న నెమలికొండలో అనిమా రెడ్డి మరణం గురించి, డాక్టర్ జేమ్స్ గురించి, విజిటర్స్ రూంలో కూర్చునున్న డాక్టర్ మనోహర్ గురించి చెప్పాడు ఉదయకి క్లుప్తంగా.

"చాలా బాధపెట్టే వ్యాధిలాగా వుంది" అన్నది ఉదయ భయంగా.

"అవును."

"మీరు టేకప్ చేస్తారా?"

"యస్ డార్లింగ్!"

మౌనంగా వుండిపోయింది ఉదయ. చిరునవ్వు నవ్వి ఉదయ బుగ్గమీద చిటికవేసి చెప్పాడు–

"ఇదెలాగయినా నాకే అప్పగిస్తారు. డిసీజెస్ గురించి రీసెర్చ్ చేసేది నేనేగా! పైగా వైరాలజిస్టుని కూడా."

ఉదయ గౌతమ్ చేతిమీద తన చేతి నుంచి అన్నది మృదువుగా–

"బి కేర్‌ఫుల్"

"జాగ్రత్తగా వుండకపోతే ఈ వృత్తిలో నేనెప్పుడో, ఏ రోగంతోనో మరణించేవాడిని. రెండేళ్ళనించి రీసెర్చ్ చేస్తున్నాను. చూస్తూనే వున్నారుగా మీరు?"

"కాని ఈసారి ఎందుకో భయంగా వుంది నాకు. ఆ రోగ లక్షణాలు...అబ్బా! ఎంత బాధాకరంగా వున్నాయ్? చాలా భయంకర రోగం అది."

"ఇది సాల్వ్ చేయగలిగితే ఇందులో.." గౌతమ్ అమెరికానించి వచ్చిన మెడికల్ బుల్లెటిన్స్ వున్న ఫైల్‌ని చూపుడు వేలుతో కొడుతూ చెప్పాడు. "...నా పేపర్ పబ్లిష్ అవుతుంది. మరోసారి మెడికల్ కాన్ఫరెన్స్‌కి వెళ్ళే అవకాశం వస్తుంది. జీవితంలో ఇలాంటి ఛాలెంజ్ కోసమే ఎదురుచూస్తున్నాను నేను"

"మీకసలు భయం అనేదే లేదా?" అడిగింది ఉదయ–గౌతమ్ మొహంలోని పట్టుదలనీ, దీక్షనీ గుర్తించి.

"దేనిమీద?"

"ప్రాణం మీద."

"ప్రాణం మీద తీపి ఎవరికుండదు?"

"మరి...?"

"ప్రపంచంలోని కొన్ని కొన్ని వృత్తులు ప్రాణాలతో చెలగాటమాడేవిగా వుంటాయి. ఎలిమెంట్ ఆఫ్ డేంజర్ వుండే

ఆ వుద్యోగాలు భయంగా కనిపిస్తాయి బయటివాళ్ళకి. మండే ఇళ్ళనార్పే ఫైర్ మెన్, వందలమైళ్ళ వేగంతో విమానాన్ని నడిపే పైలట్, పాములని పట్టి, పెంచి విషం తీసి అమ్మే వ్యాపారసుడు, మందు గుండు సామగ్రి తయారు చేసే ఫేక్టరీలోని వుద్యోగి...ఇలా ఇంకా అనేక మంది. కాని వాళ్ళు ఎంతో జాగ్రత్త తీసుకుంటారు. అలాగే నేను కూడా."

"కాని మీ శత్రువు కంటికి కూడా కనిపించని ఓ సూక్ష్మ క్రిమి. ఒకసారి పొరబాటు జరిగిందంటే..."

"భయం అనేది వుండకూడదు. కొత్త రోగాలని కనుక్కొని తగిన మందులు కనిపెట్టే డాక్టర్‌కి. నా వృత్తిలోనివాడు అసహ్యించుకోవాల్సిన పదం 'భయం!'"

"కాని......"

"ఆగావే?"

"ఏం లేదు."

"లోకంలో అంతా ఇలాగే భయపడితే టైఫాయిడ్‌కి, కుష్టు వ్యాధికి, క్షయవ్యాధికి కారణ భూతమయిన క్రిములని కనుక్కోవటం జరిగేదే కాదు. రోగాలతో మరణిస్తూనే వుండేవారు ప్రజలు."

చిరునవ్వు నవ్వి పూర్తి చేశాడు-

"కొన్ని కోట్లమందిని, రాబోయే కొన్ని వేల సంవత్సరాలపాటు కాపాడే ప్రయత్నం చెయ్యడంలో నా ఒక్కడి ప్రాణం లేదా వందలమంది ప్రాణాలు పోయినా పర్వాలేదు ఉదయా!"

ఉదయ గౌతమ్ చేతిని ముద్దు పెట్టుకుని చెప్పింది ఆప్యాయంగా-

"గుడ్ లక్ డాక్టర్ గౌతమ్!"

"థాంక్స్"

"కొద్దిగా భయం వుండచ్చు నాలో. కాని నేను అహల్యని కాదు" చెప్పింది ఉదయ.

చాలా నెలల తర్వాత వారిద్దరి మధ్యా అహల్య ప్రస్తావన ఆరోజే వచ్చింది. గౌతమ్ మొహంలోని భావాలని చదివి చెప్పింది ఉదయ-

"ఐయామ్ సారీ!ఇంకెప్పుడూ అహల్య గురించి మాట్లాడను. పొరబాటున వచ్చేసింది"

గౌతమ్ ఉదయరెండు అర చేతులని తన గుప్పిటిలోకి తీసుకుని చెప్పాడు మృదువుగా.

"విడాకులిచ్చిన భార్యని గుర్తు తెచ్చుకోవడం నాకు భయం కన్నా అసహ్యం ఇంకెప్పుడూ ఆ ప్రసక్తి వద్దు"

* * *

బిర్లా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ రీసెర్చి డైరెక్టర్ స్టెరిలైజ్ చేయబడ్డ ఆ కాగితాన్ని జాగ్రత్తగా మరోసారి చదివాడు. డాక్టర్ జేమ్స్ సంతకం పెట్టిన టైప్ చేసిన లెటర్ అది.

తర్వాత తలఎత్తి ఎదురుగా కూర్చుని వున్న డాక్టర్ గౌతమ్ వంక చూశాడు.

"వెల్ !"

గొంతు సర్దుకొని చెప్పాడు గౌతమ్.

"ప్రస్తుతం ఏషియన్ ఎల్లో ఫీవర్ గురించి రీసెర్చి చేస్తున్నాను. గత సంవత్సరం తుఫాను వల్ల ఆ జ్వరం విపరీతంగా ప్రాణాలని బలికొంది. దాని నుంచి ఇప్పట్లో ప్రమాదం లేదు. దీన్ని టేకప్ చేయాలనుకుంటున్నాను. మీ అనుమతి తీసుకుని"

డైరెక్టర్ వుజ్వల్‌సింగ్ అంగీకార సూచకంగా తలవూపి చెప్పాడు-

"ప్లీజ్ గో ఎహెడ్. ఎలాగూ ప్రభు

 

త్వం మనల్ని రిక్వెస్ట్ చేస్తుంది. బ్లడ్ వగైరా సేంపుల్స్ సిద్ధంగా వున్నాయి కదా! రేపే మొదలు పెట్టండి"

"రేపు కాదు"

"ఎల్లుండా ?"

"ఉహూ. ఇవాళే మొదలు పెట్టదలచు కున్నాను" చెప్పాడు గౌతమ్.

"ఓ. కె. మీకు సహాయం కావాలి కదా! ఎవరిని తీసుకుంటారు ? డాక్టర్ రమేష్ చంద్ర..."

"వద్దు. డాక్టర్ సత్యనారాయణని తీసుకుంటాను" చెప్పాడు గౌతమ్.

"అతను చిన్నవాడు. జూనియర్ పైగా"

"నిజమే! అవును. కాని అతను బ్రహ్మ చారి. పెళ్ళయి, ముఖ్యంగా పిల్లలున్న వాళ్ళని ఈ ప్రాజెక్ట్‌లోకి లాగడం నాకిష్టం లేదు.

చిరునవ్వు నవ్వాడు డైరెక్టర్ వుజ్వల్ సింగ్.

"హ్యూమన్ కన్‌సిడరేషన్! ఈజిన్ట్ ఇట్? మీ ఇష్టం. కాని ఒక్కడు చాలా"

"ప్రస్తుతానికి చాలు"

"బడ్జెట్ అలాట్‌మెంట్ మొదలయినవి తర్వాత చూసుకోవచ్చు. మీరు పని ప్రారంభించండి"

గౌతమ్ లేచినిలబడ్డాడు. వుజ్వలసింగ్ చాపిన చేతిని అందుకుని కరచాలనం చేసాడు. గుమ్మం దాటుతుండగా పిలి చాడు వుజ్వల్ సింగ్.

"డాక్టర్"

"యస్‌సర్!"

"లక్ టు యు"

"థాంక్స్ ఏలాట్ సర్"

* * *

"యస్ డాక్టర్ !?" అడిగాడు డాక్టర్ సత్యనారాయణ, గౌతమ్‌ని.

"నాలుగైదు నెలలలోగా ఎంగేజ్ మెంట్స్ ఏమయినా వున్నాయా ? ఈ లోగా శలవు తీసుకోరుకదా ? అడిగాడు గౌతమ్.

"లేవు. ఏం ?"

"ప్రస్తుతం ఏ ప్రాజెక్టులో వున్నారు?"

"డాక్టర్ దత్..."

"సడన్ బ్లడ్ క్లాటింగ్ నియర్ లంగ్స్...దాన్నేమంటారు ?"

"ఎంబాలిజమ్"

"యస్! నాతో వర్క్ చేస్తారా ?"

డాక్టర్ సత్యనారాయణ కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా వుండిపోయాడు. తర్వాత చిన్నగా నవ్వాడు.తలవూపాడు.

డాక్టర్ గౌతమ్ టెలిఫోన్ రిసీవర్ అందుకుని దత్ నంబర్ చూసి మూడు నంబర్లు తిప్పాడు. అవతలవైపు డాక్టర్ దత్ రిసీవర్ ఎత్తాక చెప్పాడు డాక్టర్ గౌతమ్.

"సారీఫర్ ది డిస్టర్బెన్స్ డాక్టర్. సత్యనారాయణని నాకు కొంత కాలం స్పేర్ చేయగలరా ? డైరెక్టర్ అంగీక రించారు"

"నిజమా జోకా ?" అడిగాడు డాక్టర్ దత్ నవ్వుతూ.

ఇంటర్నల్ రిసీవర్ లోంచి అతని కంఠం సత్యనారాయణకి కూడా విన పడింది.

"ముందర నా ప్రశ్నకి సమాధానం చెప్పండి"

"తప్పకుండా తీసుకోండి"

"థాంక్స్...నిజమే జోక్ కాదు" సత్యనారాయణ రిసీవర్ క్రెడిల్‌మీద వుంచి డాక్టర్ వంకచూశాడు.

అతనిది కూడా గౌతమ్ వయసే.

కాని గౌతమ్ కున్నంత తెలివి, ఏకాగ్రత, డిగ్రీలు లేవు. మనుషులలో సాధారణంగా కొద్దో గొప్పో వుండే అసూయ సత్యనారాయణలో అధికంగా వుంది. చాలా విషయాల్లో గౌతమ్ అంటే అసూయపడతాడు.

"మనం వర్క్ చేసే ప్రాజెక్టు గురించి ముందు చెప్పాలి మీకు...."

పూర్తిగా చెప్పాడు.

సత్యనారాయణ తనలో రేగిన భయాన్ని ముఖంమీద కనపడకుండా ఎంతో జాగ్రత్త పడ్డాడు.

"మీకు ఇష్టమేనా?" అడిగాడు గౌతమ్. జవాబు చెప్పబోయేముందు కొన్నిక్షణాలు ఆలోచించాడు సత్యనారాయణ. ఇంత ప్రమాదకరమైన రీసెర్చ్‌లోకి తనని కావాలని తీసుకుంటున్నాడు గౌతమ్ ఎందుకు ? తమ పాత పగలని మర్చిపోయాడా ?

ఊహుఁ అవి గుర్తుంచుకునే తనని ఇందులోకి లాగుతున్నాడు. సాధారణంగా గౌతమ్ రిసెర్చ్ చేసే ట్రాపికల్ డిసీజెస్ ప్రాణాలు తీసేవి కావు. పొరబాటున రిసెర్చ్‌లో ఆర్టిఫిషియల్‌గా లేటరేటరీలో పెంచే ఆ సూక్ష్మక్రిములు అంటుకున్నా కొద్ది రోజులు జ్వరంతో బాధ పెట్టాక తగ్గిపోతాయికాని ప్రాణం తీయవు.

ఇలాంటి ప్రాణాంతకమయిన పనికి తన సహాయం కోరుతున్నాడంటే ఏదో కారణం వుండి వుంటుంది.

ఆ ఏదో కారణం ఖచ్చితంగా తనకా వ్యాధి ఎక్కించి చంపడమే అయి వుంటుంది. లేబ్‌లోని కల్చర్‌లోంచి సూక్ష్మక్రిములు తనకి అంటుకుని తను మరణిసే ఎవరూ గౌతమ్‌ని అనుమానించరు. తన అజాగ్రత్త వల్లే తను మరణించాడని అనుకుంటారు.

'నా కిష్టం లేదు' అని చెప్దామను కున్నాడు. నోటిదాకా వచ్చిన ఆ మాటలని బలవంతంగా అణచుకున్నాడు డాక్టర్ సత్యనారాయణ.

కారణం ఉదయ !

ఉదయని రోజూ చూడచ్చు. మాట్లాడచ్చు. ఇది మంచి అవకాశం. తన జాగ్రత్తలో తనుంటే చాలు.

ఒక విధంగా ఇది మంచి అవకాశం. ఉదయ తనదయ్యే అదృష్టం అంటూ తనకి వుంటే అది ఇప్పుడే సాధ్యమవాలి.

"నా కిష్టమే" సంతోషంగా చెప్పాడు డాక్టర్ సత్యనారాయణ. అతని మొదటి వ్యసనం అమ్మాయిలు.




రెండు రోజులు గడిచాయి.

ముందర మామూలు సుస్తీఅనుకుంది డయానా. కాని తన రోగలక్షణాలన్నీ ఆ కొత్త వ్యాధి లక్షణాలుగా గుర్తించింది. క్రమంగా డయానాలో భయం చోటు చేసుకుంది. ఆ రోగం తనకూ సోకింది. ఆ విషక్రిములు తన శరీరంలోకి కూడా ప్రవేశించాయి.

అద్దంలో చూసుకుంది.

చెవులు ఎర్రబడ్డాయి. చేత్తో తాకితే

మంట. చెవుల్లో సముద్రపు హోరు చప్పుడు. పాదాలు ఎర్రబడ్డాయి. నేలమీద పాదం మోపితే కణకణలాడే నిప్పులో వుంచినట్లుగా మండుతున్నాయి.

కడప నించి వచ్చినవాళ్ళు డాక్టర్ జేమ్స్ పరిస్థితి మెరుగుపడకపోగా దిగజారుతోందని చెప్తున్నారు. అక్కడ కూడా చికిత్స దొరకదు.

తను మరణించడం తప్పదు.

ముప్పై అయిదేళ్ళ డయానా గుండె నిండా బాధ, అలజడి, భయం, భీతి.

తను మరణిస్తుంది.

ఇంక కొద్ది రోజుల్లోనే తనకి నూరేళ్ళు నిండుతాయి. తప్పదు.

ఈ మృత్యువు కోసమేనా, తను ఇన్ని వేల మైళ్ళు ప్రయాణం చేసి షికాగో నించి ఇండియాకి వచ్చింది? అక్కడే ఏదో హాస్పిటల్‌లో పనిచేస్తూంటే ఈ అకాల మృత్యువు తనని కబళించేది కాదు కదా?

తల దువ్వుకుంటూంటే దువ్వెనతో పాటు వందల కొద్దీ వెండ్రుకలు కుదుళ్ళ నుంచి వస్తున్నాయి. గొంతు మంటగా వుంది.

మార్తా దగ్గరకి రావడానికే భయపడుతోంది.డయానా ఎన్నోసార్లు మృత్యువుని చూసింది. ఎంతో మంది పేషెంట్లు మరణించడం చూసింది.

అనేకసార్లు వివిధ రూపాలలో చూసిన మృత్యువు ఇప్పుడు తననే వరిస్తోంది!

నమ్మలేకపోతోంది తను మరణిస్తుందంటే. కాని తప్పదు. తప్పించుకోలేదు తను.

కనకారావు కొడుకు మాణిక్యాలరావు తొమ్మిది రోజులు కూడా బ్రతక లేదు. జ్వరం రావడం ప్రారంభించిన ఏడోరోజే మరణించాడు. అతని కిడ్నీ పూర్తిగా పాడయి పోయింది. పెద్దవాళ్ళ కన్నా ముందరగానే ఆ కుర్రాడికి కిడ్నీ దెబ్బ తింది. నాలుగో రోజు నుంచి యూరిన్ పూర్తిగా ఆగిపోయింది. కిడ్నీ పాడయి పని చేయకపోవడంతో మూత్రం శరీరంలో ఉత్పత్తి కావటం ఆగి పోయింది. డయాలసిస్ మిషన్ కడప ఆస్పత్రిలో లేదు. మద్రాస్‌లో విజయ హాస్పిటల్‌లో వుంది. కాని అక్కడికి పంపదలచుకోలేదు సూపరింటెండెంట్.

అది అంటు వ్యాధి.

గొంతువాచి లోపల నాలిక మీద, కొండ నాలుక మీద తెల్లటి పొక్కులు ఏర్పడ్డాయి. 107 డిగ్రీల జ్వరంతో మరణించాడు.

మరణించబోయే ముందు గాలి పీల్చుకోడానికి కూడా ఇబ్బంది పడ్డాడు. మంచం మీద ఎగిరెగిరి పడ్డాడు. దగ్గరికి వెళ్ళి కదలకుండా పట్టుకున్నారు నర్సులు.

తెల్లవారు ఝామున మూడున్నరకి ఈ లోకాన్ని విడిచేశాడు మాణిక్యాల రావు.

కనకారావుకి ఆ విషయం చెప్పలేదు. డాక్టర్ జేమ్స్‌కి మాత్రం తెలియ చేశారు.

ఆయన వెంటనే చేత్తో క్రాస్ మార్క్ అభినయించాడు.

"జీసస్" అన్నాడు బాధగా.

మర్నాడు కనకారావు టెంపరేచర్‌లో మార్పు కనపడింది. 105 నుంచి 107 డిగ్రీలకి పెరిగింది జ్వరం.

డాక్టర్ జేమ్స్ జ్వరం 105 నుంచి 106కి పెరిగింది. కిడ్నీ పనిచేయడం ఆగిపోయింది. ఫలితంగా రక్తంలోని




కలుషిత పదార్థాలు చెమట ద్వారా బయటకి నెట్టివేయబడసాగాయి - నర్సులు డెట్టాల్ నీళ్ళలో ముంచిన బట్టతో ఆయన శరీరం గంటకోసారి తుడుస్తున్నారు.

అలా తుడవక పోతే చర్మమీద చెమట ఆవిరయిపోగానే చిన్న చిన్న స్ఫటికల్లాగా మెరుస్తూ కనబడుతున్నాయి- రక్తలోంచి బయటకి వస్తున్నకలుషిత పదార్థాలు.

డాక్టర్ జేమ్స్‌కి అర్థమైంది ఇక జీసస్ తప్ప తనని మరెవ్వరూ కాపాడలేరని.

త్వరగా మరణిస్తే బావుండును అనుకున్నాడు. వంట్లోని వేడిని భరించలేక పోతున్నాడు. చెవులకి, అరి పాదాలకి చిన్న వెంట్రుక తగిలినా విపరీతమయిన మంట. మాట్లాడేందుకు వీలులేకుండా వాచిన గొంతు.

నోటి ద్వారా ఆ హా ర ం కానీ, పానీయం కానీ తీసుకోలేని స్థితికి వచ్చాడు గుటకవేస్తే నొప్పి.

ఇంట్రా వీనస్ ద్వారా గ్లూకోస్ వాటర్ ఎక్కించసాగారు డాక్టర్ జేమ్స్‌కి.

కడప జనరల్ హాస్పిటల్‌లో మూడు వందల కేసుల దాకా ఎడ్మిట్ చేసుకున్నారు ఆ కొద్ది రోజుల్లోనే.

ఆ రోగులంతా ఆ కొ త్త వ్యాధికి గురయిన వాళ్ళే. రాయలసీమలోని ఇతర ప్రదేశాలలోనే కాక, శ్రీకాకుళం లాంటి దూరంగా వున్న జిల్లాలలో కూడా ఈ కొత్తవ్యాధి కొందరికి సోకింది.

సరిగ్గా జ్వరం సోకిన తొమ్మిదో రోజు డాక్టర్ జేమ్స్ ఆస్పత్రిలో మరణించాడు. మరణించబోయే ముందు ఆయన టెంపరేచర్ 107.2. అంతకు రెండు రోజుల ముందే కనకారావు కూడా పోయాడు.

డాక్టర్ గౌతమ్ ఉదయం తొమ్మిదిన్నరకి మెడికల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్‌కి చేరుకున్నాడు. రోజూలాగానే తన సెక్రటరీ ఉదయని ఆమె ఇంటి దగ్గర పికప్ చేసుకున్నాడు.

హైద్రాబాద్‌కి దూరంగా వుంది ఇన్‌స్టిట్యూట్, హైద్రాబాద్ - బాంబే హైరోడ్‌లో ఇన్‌స్టిట్యూట్‌లో రక రకాల విషక్రిములు మనుషులకి, జంతువులకి, వృక్ష సంపదకి హాని కలిగించేవి టెస్ట్ ట్యూ బ్ ల తో పెంచబడుతుంటాయి. అందుకని వూరికి 15 మైళ్ళ దూరంలో ఏర్పాటు చేసారు దాన్ని.

ఇన్‌స్టిట్యూట్‌కి రెండు బస్సులు, ఒక మినీబస్ వున్నాయి వుద్యోగులని హైద్రాబాద్ నించి పికప్ చేసి, తిరిగి సాయంత్రం ఇళ్ళ దగ్గర విడవడానికి.

రీసెర్చ్ డాక్టర్స్ అందరికీ స్వంత కార్లున్నాయి. వాటిని వుపయోగించినా, వుపయోగించక పోయినా ఇన్‌కంటేక్స్ డిడక్షన్ కోసం కొన్నారు అంతా.

డాక్టర్ గౌతమ్ ప్రతీరోజు సికింద్రాబాద్‌లోని పేరడైజ్ సమీపంలో వున్న తన ఫ్లాట్ నించి బయలుదేరి సంజీవ రెడ్డి నగర్‌లో వుంటున్న ఉదయని పికప్ చేసుకుంటాడు. తన భార్య అహల్య విడాకులిచ్చిన కొన్ని నెలల నించీ రోజూ అలాగే చేస్తున్నాడు.

ఆ రోజు వుదయం ఇద్దరూ కారు దిగారు. 'డాక్టర్ గౌతమ్' అని వ్రాసి వున్న కారు షెడ్‌లో పెట్టి ఆ ఇద్దరూ బయటకి రావడం గమనించాడు డాక్టర్ సత్యనారాయణ.

అసూయతో పళ్ళు పటపట కొరికాడు.

ఆ ఇన్‌స్టిట్యూట్‌లో ఏభై మంది దాకా ఆడవాళ్ళు పనిచేస్తున్నారు. అందులో వయసులో వున్నవాళ్ళు పది మందికి మించరు. వాళ్ళలో అందంగా వుండే వారు సగం మంది. ఆ అయిదు గురిలో అందంగా వుంటుంది ఉదయ.

తన కాలేజీ రోజులనుంచీ సత్యనారాయణ అనేకమంది ఆడవాళ్ళని (అతని మాటల్లోనే అయితే బయొలాజికల్ ఇంటర్‌కోర్స్) అనుభవించాడు. తనకి నచ్చిన అమ్మాయిని వదలడు. ఎలాగయినా సాధించాలనుకునే తత్వం అతనిది

కొందరు తపాళ బిళ్ళలు కలెక్ట్ చేస్తారు. కొందరు చేపలని ఇంట్లో పెంచుతారు. మరికొందరు పేకాడతారు. ఇంకా కొందరు అప్పులు చేసి తీర్చరు, తీర్చ గలిగే స్థితి వుండి కూడా. అవి వాళ్ళ బలహీనతలు.

డాక్టర్ సత్యనారాయణ బలహీనత ఆడవాళ్ళని అనుభవించడం. ఇన్‌స్టిట్యూట్‌లో వుద్యోగం వచ్చాక అలాంటి అవకాశాలు దొరకడం లేదు. అంతకు మునుపు ఓ గవర్నమెంట్ జనరల్ హాస్పిటల్‌లో పని చేస్తున్నప్పుడు అవసరం లేకపోయినా ఆడపిల్లలు దొరికే వారు.

ఉదయ డాక్టర్ గౌతమ్ మోచేతి చుట్టూ తన చేతిని పెనవేసి నవ్వుతూ మాట్లాడుతూ లోపలికి వెళ్ళడం చూశాక మనసు ఇంకా స భగ్గుమంది.

డాక్టర్ సత్యనారాయణ తన మోటర్ సైకిల్‌ని పార్క్‌చేసి తాళంచెవి జేబులో వేసుకుని లోపలికి నడిచాడు. థర్డ్‌ఫ్లోర్‌లో వుంది డాక్టర్ గౌతమ్ క్యూబికల్.

అటు నడిచాడు

డాక్టర్ గౌతమ్ ఉదయకి ఏదో డిక్టేట్ చేస్తున్నాడు-సత్యనారాయణ వెళ్ళే సరికి. షార్ట్‌హేండ్‌లో గబ గబ రాసు కుంటోంది ఉదయ. ఆ ఇద్దరు తన రాకని గుర్తించనట్లుగా తమ పనిలో తాముం డటం గమనించి ఓ కుర్చీలో కూర్చు న్నాడు విశ్రాంతిగా. తనకూ వాళ్ళంటే ఎలాంటి లక్ష్యం లేదన్నట్లుగా.

ఆ లెటర్ అమెరికాలోని రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్‌లోని మైక్రోబయోలజీ డివిజన్‌కి. ఆ వ్యాధి లక్షణాలు వివరిస్తూ వాళ్ళ రీసెర్చ్‌లో ఇదివరలో అలాంటి వ్యాధి తటస్థ పడిందా, పడితే వాటి వివరాలు పంపమని.

మరో లెటర్ బ్రిటన్‌లోని నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ మెడికల్ రీసెర్చ్‌కి. ప్రపంచంలో ఇంతదాకా వివిధ రీసెర్చ్ స్కాలర్స్ కనుక్కున్న అన్ని రకాల వైరస్ క్రిములని ఆ ఇన్‌స్టిట్యూట్ టెస్ట్‌ట్యూబ్ కల్చర్స్‌లలో భద్ర పరుస్తుంది లైబ్రరీలాగా. ప్రపంచంలోని అన్ని దేశాలకీ అది రిఫరెన్స్‌గా వుపయోగపడుతుంది.

మరో లెటర్ హాలండ్‌లోని అలాంటి ఇన్‌స్టిట్యూట్‌కి. ఇంకో లెటర్ అమెరికన్ టైప్ కల్చర్ కలెక్షన్‌కి డిక్టేట్ చేశాడు.

"వీటిని టెలిప్రింటర్ ద్వారా పంపే ఏర్పాటు చేయండి. పోస్ట్‌లో కాదు. ఒకటి రెండు రోజుల్లో జవాబు వస్తుంది. పోస్ట్‌లో పంపితే సమయం చాలదు".

తల వూపింది ఉదయ.

ఒకటి రెండు రొటీన్ లెటర్స్‌కి జవాబులు డిక్టేట్ చేశాడు. తర్వాత డాక్టర్ సత్యనారాయణ వైపు తిరిగి చెప్పాడు-

"లోపలకి రాబోయే ముందు తలుపు మీద కొట్టి ఆ తర్వాతే తలుపు తెరవండి. అదీ ఇక్కడి పద్ధతి"

ఉదయ చిన్నగా నవ్వుకోవడం సత్య నారాయణ గమనించాడు.

డాక్టర్ గౌతం లేస్తూ చెప్పాడు-

"లెట్స్ గో టుది లేబ్"

ఇద్దరూ లేబొరేటరీ తలుపు దగ్గరకి వెళ్ళారు. డాక్టర్ గౌతం జేబులోంచి తాళం చెవి తీసి అంతకు ముందు రోజు తాళం వేశాక ఆ తాళం కప్పమీద అతికించిన తన సంతకం వున్న కాగితం ముక్కని ఎవరూ తీసి మరీ అతికించ లేదని నిర్ధారణ చేసుకున్నాక దాన్ని చింపేసి తాళం తెరిచాడు. సెక్యూరిటీ కోసం ఇన్‌స్టిట్యూట్ అవలంబించే పద్ధతి అది. ఆ లేబ్ తలుపు మీద ఎర్రటి ప్లాస్టిక్ అక్షరాలు అతికించబడి వున్నాయి.

"డేంజరస్. డోంట్ ఎంటర్ విత‌వుట్ పర్మిషన్"

అలవాటు ప్రకారం లేబొరేటరీలోని లైట్ల, ఫేన్‌ల స్విచ్‌లు నొక్కి లేబొరేటరీ దుస్తులు తొడుక్కున్నాడు.

ముందురోజే డాక్టర్ సత్యనారాయణ తన దుస్తులు లేబొరేటరీకి మార్చాడు కాబట్టి అతనూ తొడుక్కున్నాడు.

లేబ్ అసిస్టెంట్ రాగానే సౌజ్ఞ చేశాడు డాక్టర్ గౌతమ్. అతను ఓ స్విచ్ నొక్కాడు. బయట 'వైరస్ రిసెర్చ్ అండర్ ప్రోగ్రెస్. డోంట్ ఎంటర్' అన్న అక్షరాలు కనబడే బల్బు వెలుగుతోంది. ఆ సైన్ ఆరిపోయేదాకా ఎవరూ రారు. ఇంటర్నల్ టెలిఫోన్ ద్వారానే బయటి లోకం అతనితో కాంటాక్ట్ పెట్టుకొంటుంది.

డాక్టర్ గౌతమ్, సత్యనారాయణకి చెప్పాడు-

"ఈ విషక్రిమి ఎలా అంటు కొంటుందో తెలియదు. ఎలావ్యాపిస్తుందో తెలియదు. అసలది బేక్టీరియానో లేక వైరస్ క్రిమో తెలియదు. (బ్రతికున్న జీవాలలోని శరీర భాగాలలో పెరిగే క్రిమిని వైరస్ అంటారు. శరీర భాగాల లోనే కాక బయట మట్టిలో, నీళ్ళలో మొదలయిన చోట్ల కూడా జీవించే హాని కరమయిన క్రిమిని బేక్టీరియా అంటారు) అన్ని జాగ్రత్తలు తీసుకోవడం మంచిది."

"మీరు యూరిన్, స్టూల్స్ స్పియర్ తీసుకుని మైక్రోస్కోప్ కింద వుంచి చూడండి. క్రిములు కనపడచ్చు. తర్వాత మైక్రోస్కోప్ కింద వుంచే ఆ గాజు ముక్కలని ఎలక్ట్రిక్ పొయ్యిలో వేసి కాల్చాక డిస్‌పోజల్ బేగ్‌లో పడేయండి. చేతులకి గ్లోవ్స్ వేసుకోవడం మరువద్దు. వాటిని ఒక్కసారే వుపయోగించండి. ఎక్స్‌పరిమెంట్ అయ్యాక ఓ అరగంట సేపయినా స్నానం చేయండి. నేను బ్లడ్ సేంపుల్స్ సంగతి చూస్తాను...."

వింటూంటే డాక్టర్ సత్యనారాయణకి భయం వేసింది- తనేమయినా పొరబాటున ఈ అసైన్‌మెంట్ ఒప్పుకున్నానా అని.

డాక్టర్ గౌతమ్ గ్లోవ్స్ తొడుక్కుని ఎయిర్‌లాక్ కంటెయినర్స్‌లోంచి బ్లడ్ సేంపుల్ వున్న కంటెయినర్ తీసుకుని లేబొరేటరీలో రిసెర్చ్ చేసే అద్దాల తలుపు తెరచుకొని లోపలకి వెళ్ళాడు.

ముందు బాత్‌రూంలోకి వెళ్ళిశుభ్రంగా స్నానం చేశాడు షవర్‌బాత్ కింద, ఒళ్ళంతా సబ్బుతో రుద్దుకుని. బాత్‌రూంలో స్టెరిలైజ్ చేసి ప్రత్యేకంగా వుంచబడ్డ దుస్తులని ధరించాడు.

అందువల్ల బయట ప్రపంచంలోని విషక్రిములు ఆ రిసెర్చ్ భాగంలోకి

 

చేరవు. అక్కడే నాశనమయిపోతాయి. ప్రస్తుతం రీసెర్చ్ చేయాల్సిన సూక్ష్మ జీవి మాత్రమే బతుకుతుంది. మరో సూక్ష్మజీవి ఆ ప్రదేశంలోకి చేరితే దానివల్ల కలిగే రీసెర్చ్ ఫలితాలు ఈ కొత్త సూక్ష్మజీవివే అనే భ్రమ కలగ వచ్చు. అందుకనా జాగ్రత్త.

గౌను, గ్లౌసు, ముఖానికి మాస్క్ వేసుకున్న డాక్టర్ గౌతమ్ తెల్ల దుస్తులు ధరించిన దేవతలా అనిపించాడు అద్దాల తలుపు బయట నించి చూస్తున్న లేబ్ అసిస్టెంట్ కి.

డాక్టర్ గౌతమ్‌కి తెలుసు బేక్టీరియా కానీ, వైరస్ కానీ కనుక్కోవాలంటే కొన్ని నెలలు పడుతుంది. కొన్ని వందల లేబరేటరీ జంతువులు బాధపడి మరణిం చాల్సి వస్తుంది. వాటిలో ఆ రోగ లక్షణాలు వెంటనే కనబడకపోవచ్చు. మనుషలలోలేని ఏంటీబాడీస్ ఆ క్రిమి విషయంలో వాటిలో వుండచ్చు.

ముందర ఆ శత్రువుని కనుక్కోవాలి. అది ఎలా వుంటుందీ చూడాలి. ఆ తర్వాత దాన్ని టెస్ట్‌ట్యూబ్‌లో పెంచి ఏ మందుకి అది త్వరగా నశిసుందో కనుక్కోవాలి. ఆ మందు మానవ దేహానికి హాని చేయనిదై వుండాలి. టెస్ట్‌ట్యూబ్ లోని కొన్ని వందల క్రిములని చంపడా నికి మందు కొంతే సరిపోవచ్చు. కాని కొన్ని లక్షల క్రిములుంటాయి రోగం అంటుకున్న మానవ దేహంలో. అన్నిటినీ మట్టుబెట్టడానికి ఎంత మోతాదు మందు కావాలో అంచనా వేయాలి.

ముందర ఆ మందు ఆ రోగ క్రిములు ఎక్కించబడ్డ జంతువులలో పనిచేస్తోందా లేదా, సైడ్ ఎఫెక్ట్స ఎలా వున్నాయి గమనించాకే మనుషులతో ఎక్స్‌పరిమెంట్ చేయాలి.

ఇదంతా పూర్తవడానికి నెలలు లేదా సంవత్సరాలు పట్టచ్చు.

ఓర్పు ముఖ్యం ఇందుకు.

డాక్టర్ గౌతమ్‌లో ఓ అనుమానం వుంది. అది అనుభవం మీద నేర్చుకున్న విషయాల వల్ల కలిగిన అనుమానమే.

డాక్టర్ మనోహర్ తెచ్చిన సేంపు ల్స్‌లో ఇంకా ఆ రోగ క్రిములు బతికే వున్నాయా లేక వాతావరణంలోని స్వల్ప మార్పుల వల్ల నశించిపోయాయా ?

జేమ్స్ డాక్టర్ కాబట్టి, వైద్య విధానం తెలుసు కాబట్టి ఆరు బ్లడ్ సేంపుల్స్ పంపాడు. బ్లడ్ సేంపుల్స్‌వున్న కంటె యినర్‌ని తెరచి ఆరు బాటిల్స్‌ని బయటకి తీశాడు. అయిదు బాటిల్స్‌లోని రక్తాన్ని అయిదు పెద్దగాజు పాత్రలలోకి వంచాడు డాక్టర్ గౌతమ్.

ఆ అయిదు పాత్రలలో జంతువుల శరీర భాగాలున్నాయి. ఆ రక్తంలో ఇంకా క్రిములు బ్రతికే వుంటే ఆ భాగాలని తిని బ్రతికి వృద్ధి చెందుతాయి.

తర్వాత లోహంతో చేసిన ఎలుక బోనుల పరిమాణంలో వున్న పెట్టెలలోని ఎలుకల మీదకి సారించాడు తన దృష్టిని. వంద ఎలుకల దాకా పెంచబడుతున్నాయి లేబొరేటరీలో. మరో చోట పది కుందేళ్ళు.

అప్పుడే పుట్టిన పసిపాపకన్నా ఎంతో జాగ్రత్తగా పెంచబడతాయి అవి. సంపూర్ణ ఆరోగ్యంగా వుంటాయి అవి ఎలాంటి అనారోగ్యం లేకుండా. వాటి వయసు, బరువు ఒకే విధంగా వుండాలి. లేకపోతే పరిశోధనలో తేడాలు వస్తాయి.

ప్రతీ ఎలుక వుండే పెట్టెకున్న వెంటిలేటర్‌లోంచి అది పీల్చి వదిలే గాలి

వెళుతుంది. ఆ గాలి ఎప్పుడూ ముందే ఓ ఎలక్ట్రిక్ పొయ్యిని దాటి బయటకి వెళుతుంది. ఎక్స్‌పరిమెంట్‌లో వాటికి రోగ క్రిములు ఎక్కించాక అవి విడిచే వూపిరిలో ఆ రోగ క్రిములు ఆ పొయ్యి వల్ల నశిస్తాయి. లేకపోతే, గాలి ద్వారా వ్యాపించే క్రిములయితే, మిగతావాళ్ళకి అంటుకునే ప్రమాదం వుంది.

డాక్టర్ గౌతమ్ ఆ మెటల్ బాక్స్ కుండే ఓ స్విచ్ నొక్కాడు. ఆ బాక్స్‌పైన వున్న మైనం సంచి పగిలి అందులో నిలవ చేయబడ్డ ఈథర్ వాయువు పెట్టెలోకి ప్రవేశించి లోపల వున్న ఎలుక పీల్చే గాలిలో కలిసిపోయింది.

ఆ ఈథర్ గాలిని పీల్చిన ఎలుక రెండు నిమిషాలు కాకుండానే మత్తుగా కదలకుండా పడుకుంది.

డాక్టర్ గౌతమ్ ఆ ఎలుక వున్న పెట్టె తలుపు తెరచి దాన్ని గ్లోవ్స్ తొడుక్కున్న చేత్తో బయటకి తీశాడు. డాక్టర్ జేమ్స్ రక్తం వున్న ఆరో బాటిల్‌లోకి ఓ ఇంజక్షన్ సిరంజిని గుచ్చి 1. సి. సి రక్తాన్ని ఇంక్షన్‌లోకి ఎక్కించాడు. తర్వాత ఆ సిరంజిని ఎలుక ఒంట్లోకి గుచ్చి దాని మెదడులోకి ఎక్కించాడా రక్తాన్ని.

మరో ఎలుకని అదే విధంగా బయటికి తీసి దాని లివర్‌లోకి, ఇంకో ఎలుక కిడ్నీలోకి ఈ విధంగా పది ఎలుకల ఒంట్లోకి, ఒక్కొక్కదాని ఒంట్లోకి ఒక్కో భాగంలో 1 సి. సి చొప్పున ఎక్కించాడు.

ఆ పదింటిని వాటి పెట్టెలలో వుంచి, పెట్టెల బయట వున్న తెల్లటి లేబుల్స్ మీద స్కెచ్ పెన్‌తో ఆ వివరాలు రాశాడు.

ఇంజక్షన్ గొట్టాన్ని, సిరంజిని వేడి నీళ్ళలో పడేశాడు. ఇరవై నిమిషాల సేపు అవి బాగా మరిగాక పటకారతో బయటకి తీశాడు వాటిని.

అరగంట తర్వాత మళ్ళీ బాత్‌రూం లోకి వచ్చాడు. అరగంటసేపు ఒంటిని బ్రష్‌తో, సోప్ నురగతో రుద్దుకుని స్నానం చేశాడు. తర్వాత విడిచిన బట్టలు తొడుక్కుని బయటికి వచ్చాడు.

డాక్టర్ సత్యనారాయణ సిగరెట్ కాలుస్తూ కనబడ్డాడు.

"ఏమైంది?" అడిగాడు డాక్టర్ గౌతమ్.

"ఎలక్ట్రాన్-మైక్రోస్కోప్ నించి చూస్తే ఏం కనబడలేదు" చెప్పాడు

"మీరు హాస్పిటల్‌లో వర్క్ చేసే టప్పుడు ఆపరేషన్ థియేటర్ లో ఎప్పుడైనా సిగరెట్ తాగేవారా?" నవ్వుతూ అడిగాడు డాక్టర్ గౌతమ్.

"లేదు."

"అయితే లేబ్‌లో కూడా తాగొద్దు" చెప్పాడు బయటకు నడుస్తూ.

నిజానికి డాక్టర్ సత్యనారాయణ గుంటూరులోని జనరల్ హాస్పిటల్‌లో పనిచేసేటప్పుడు అనేకసార్లు ఆపరేషన్ థియేటర్‌లో సిగరెట్ తాగాడు.

నగ్నంగా వున్న అమ్మాయి దేహాన్ని చూస్తూ—

రిలాక్స్ అవడానికి.

బయొలాజికల్ ఇంటర్‌కోర్స్ ఒకసారి జరిగాక. మరోసారి చేయబోయే ముందు.

* * *

మధ్యాహ్నం లంచ్ అవర్‌లో డాక్టర్ గౌతమ్, ఉదయ కలసి స్టాఫ్ కేంటీన్‌కి వెళ్ళారు. ఉదయ ఇంటినుంచి పకోడీలు చేసి తెచ్చింది. కేంటీన్‌లో తప్ప

లంచ్ మరెక్కడా తినకూడదనే నియమం వుండటంతో ఇంటినించి టిఫిన్ తెచ్చు కున్నవాళ్ళు కూడా విధిగా కేంటీన్‌కే రావాలి.

పూల చెట్లకి పట్టే ఓ విధమయిన ఫంగస్‌మీద రీసెర్చ్ చేసే డాక్టర్ సురేంద్రన్ డాక్టర్ గౌతమ్‌కి మంచి స్నేహితుడు. ఇద్దరూ అమెరికాలోని యేల్ యూనివర్సిటీలో కలసి చదువుకున్నారు.

ఉదయ తను తెచ్చిన టిఫిన్ బాక్స్ తెరచి సర్వర్ వుంచిన ఖాళీ పేట్లలో వాటిని సర్దింది.

''బావున్నాయి'' చెప్పాడు సురేంద్రన్ రెండు తిని బ్రెడ్‌టోస్ట్‌ఆర్డర్ చేశాడు డాక్టర్ గౌతమ్.

''సత్యనారాయణని తీసుకున్నారే?'' అడిగాడు డాక్టర్ సురేంద్రన్ గౌతమ్‌ని.

''అతను బ్రహ్మచారి కాబట్టి''

''అంతేనా లేక...''

''లేక...''

''మీరు డేంజరస్ రీసెర్చ్ చేస్తున్నారని, తనని చంపే వుద్దేశంతో ప్రత్యేకంగా తీసుకున్నారని...'' ఆగి ఉదయ వంక చూసి పూర్తి చేశాడు సురేంద్రన్-"ఉదయకి తనంటే ఇష్టం అని. ఇది మీకు కోపం అని నలుగురయిదుగురుతో అన్నాడని తెలిసింది నాకు."

డాక్టర్ గౌతమ్ మొహంలో బాధ అలుముకుంది కొద్దిసేపు. ఉదయవైపు చూశాడు.

"అబద్ధం. నేను డాక్టర్ గౌతమ్‌ని వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నాను. సత్యనారాయణ అంటే నాకు అసహ్యం... గౌతమ్ గురించి నాకు బాగా తెలుసు. ఆయన హంతకుడు కాలేడు. ఎన్నటికీ'' ఆవేశంగా చెప్పింది. ఉదయ మొహం అప్పటికే కోపంతో ఎర్రబడింది.

సురేంద్రన్ నవ్వి చెప్పాడు.

''మీరు ప్రచారం చేసుకోకపోయినా ఈ సంగతి అందరికీ తెలుసు. అతని మాటలు ఎవరూ నమ్మలేదు. హి ఈజ్ ఏ సేడిస్ట్"

డాక్టర్ సురేంద్రన్ లేచి చెప్పాడు-

''ఎక్స్‌క్యూజ్‌మి. ఫోన్ చేయాలి నేను"

ఆయన వెళ్ళాక ఉదయ డాక్టరు గౌతమ్‌తో అన్నది చిరుకోపంతో-

"చూశారా ?"

"చూడలేదు. విన్నాను" నవ్వుతూ బదులు చెప్పాడు డాక్టర్.

"ఇంకెవరూ దొరకలేదా?పట్నాయక్‌ని తీసుకోండి. ఇతనో తలనొప్పి మనిషి.''

"బ్రహ్మచారి అతనొక్కడే."

"అతని వల్ల వరలక్ష్మి ఏమయిందో మరిచారా? లేబ్ అసిస్టెంట్‌గా పనిచేస్తూ అకస్మాత్తుగా ఎందుకు మానేసింది? ఆరోజు సత్యనారాయణ ఒక్కడే ఆ లేబ్‌లో వున్నాడు. ఆ అమ్మాయి రిపోర్ట్ చేసివుంటే ఇతని వుద్యోగం వూడేది. ఐ హేట్ హిమ్. కనీసం పనిచేసిసన్ని రోజులకు జీతం తీసుకోడానికి కూడా రాలేదు వరలక్ష్మి. ఎవరిచేతో ఆథరైజేషన్ పంపించింది."

డాక్టర్ గౌతమ్ మాట్లాడలేదు.

''అతని చూపులు అసహ్యంగా వున్నాయి. ఉదయం మీరు టి.పి. మెసేజ్ డిక్టేట్ చేస్తున్నప్పుడు..."

"...గమనించాడు''

డాక్టర్ గౌతమ్‌కి ఇక ఆ టాపిక్ మాట్లాట్టం ఇష్టంలేదని గ్రహించింది ఉదయ




"ఇంకా ఆరు నెలలు" చెప్పింది టాపిక్ మారుస్తూ.

"కాదు. అయిదు నెలల ఇరవై మూడు రోజులు" చెప్పాడు డాక్టర్ గౌతమ్.

తర్వాత ఉదయ చేతిని తన చేతుల్లోకి తీసుకున్నాడు ప్రేమగా.

డైరెక్టర్ ప్యూన్ వచ్చాడు గబగబా.

"మిమ్మల్ని డైరెక్టర్ అర్జెంట్‌గా రమ్మంటున్నారు" చెప్పాడు డాక్టర్ గౌతమ్‌తో.

తలూపాడు గౌతమ్.

అతను వెళ్ళిపోయాక ప్రశ్నార్థకంగా చూసింది ఉదయ గౌతమ్ మొహంలోకి.

ఎందుకో నాకూ తెలియదన్నట్లుగా తల అడ్డంగా వూపాడు గౌతమ్.

ఎదురుగా ప్లేట్‌లోని బ్రెడ్‌టోస్ట్‌ని ఫోర్క్‌తో అందుకున్నాడు.

పొగలు కక్కే కాఫీ అప్పటికే సిద్ధంగా వుంది. ఉదయ వేడి పోకుండా సాసర్‌ని తీసి కప్పుమీద వుంచింది.




ఉస్మానియా జనరల్ హాస్పిటల్ కాంపౌండ్‌లో తన కారుని ఆపాడు డాక్టర్ గౌతమ్. సరాసరి హాస్పిటల్ సూపరింటెండెంట్ గదికి వెళ్ళాడు. తన విజిటింగ్ కార్డ్ పంపించాడు లోపలికి ప్యూన్‌ద్వారా. లోపలికి వెళ్ళాడు ఆహ్వానం వచ్చాక.

"యస్ డాక్టర్ గౌతమ్! ఆర్ యు రెడీ?''

"రెడీ"

"లెట్స్ గో''

సూపరింటెండెంట్ గౌతమ్‌ని పోస్టు మార్టం గదిలోకి తీసుకు వెళ్ళాడు. ఎదురుగా టేబిల్‌మీద పడుకోబెట్టబడి వున్న దేహాన్ని చూసాడు గౌతమ్.

భారతీయుడిది కాదు అది. అది డాక్టర్ జేమ్స్ శవం.

దగ్గరకి వెళ్ళి పరిశీలనగా చూశాడు. అప్పుడే ఐస్‌లోంచి తీసినట్లు ఇంకా తడిగా వుంది దేహం. గొంతు బాగా వాచి వుంది. ఎర్రగా వుబ్బి అరిపాదాలు, చెవులు ఎర్రగా వున్నాయి. బాగా బాధపడ్డ గుర్తులు మొహంలో కనబడ్డాయి. ప్రశాంతంగా లేదు మొహం.

మరో ముగ్గురు డాక్టర్స్ వచ్చారు.

''గంట క్రితమే కడప హాస్పిటల్ నించి వచ్చింది శవం. ఆటోప్స చేసే సమయంలో మిమ్మల్ని పిలవమని మాకు హెల్త్ మినిస్ట్రీ నుంచి ఇన్‌స్ట్రక్షన్స్ వచ్చాయి'' చెప్పాడు సూపరింటెండెంట్.

మిగతా డాక్టర్లకి పరిచయం చేసాడు.

అందరూ చేతికి గ్లౌవ్స్, తెల్లటి గౌను, మాస్క్ తొడుక్కున్నారు.

''శరీరంలోని కొన్ని భాగాలు నేను తీసుకువెళ్తాను. ముఖ్యంగా కిడ్నీ... స్కాల్‌పెల్ మొదలయినవి ప్రయోగించేటప్పుడు జాగ్రత్తగా వుండండి. పొరబాటున మీ చేతికి ఏ చిన్న గాయమయినా ఈ రోగం మీకు సోకచ్చు. మీ శరీరాన్ని కూడా ఓ పది పన్నెండు రోజుల తర్వాత ఇలాగే ఇదే టేబిల్ మీద ఆటోప్స చేయాల్సిన అవసరం తెచ్చుకోకండి"

 చతుర ... లేల్

నవ్వుతూ చెప్పిన డాక్టర్ గౌతమ్ కంఠం లోని హెచ్చరికని గుర్తించారు మిగతా డాక్టర్లు.

"మొదట గుండె దగ్గర మొదలు పెడదాం" చెప్పాడు గౌతమ్.

పక్కనే ఇద్దరు నర్సులు సిద్ధంగా వున్నారు-శరీరాన్ని కొయ్యడానికి వుప యోగించే వివిధ పనిముట్లతో.

సూపరింటెండెంట్ స్కాల్పెల్‌ని తీసుకుని రెండున్నర అంగుళాల పొడవు గల మేర చర్మాన్ని కోసాడు. బొడ్డుకి కుడి భాగంలో రెండంగుళాల పైన ఓ డాక్టర్ చర్మాన్ని విడదీసి చర్మం కింద వున్న టిష్యూలని దూరంగా జరిపాడు. ఛాతీ ఎముక కనపడింది. ఓ ప్రత్యేకమయిన ఎలక్ట్రిక్ రంపంతో ఆ ఎముకని కోశాడు మరో డాక్టర్.

కర్వ్‌డ్ రిట్రాక్టర్స్ ఉపయోగించి సూపరింటెండెంట్ ఛస్ట్ కేజ్‌ని పక్కకి జరిపాడు.

ఇప్పుడు కొట్టుకుని గుండె కనబడు తోంది. శిరలు, ధమనులు కనబడు తున్నాయి.

డాక్టర్ గౌతమ్ జాగ్రత్తగా గమనిం చాడు ఆ గుండెని. ఎండిన రక్తం కని పించింది. 'పుల్‌మోనరీ వెయిన్స్, పుల్ మోనరీ ఆర్టరీ, ఇన్‌ఫిరీయర్ అండ్ సుపీరియర్ వెనకాలా' మొదలయిన ప్రదేశాలలో.

"ఇంటర్నల్ హెమరేజ్" చెప్పాడు గౌతమ్.

తర్వాత కిడ్నీ భాగం తెరిచారు.

"మై గుడ్‌నెస్" అన్నాడు సూపరిం టెండెంట్.

"కేన్నిబాల్ వైరస్ ?" అడిగాడో డాక్టర్.

డాక్టర్ గౌతమ్ కిడ్నీ వుండే భాగం చూస్తూండి పోయాడు. సగం కిడ్నీ దాకా తినేయబడి వుంది. కిడ్నీ ఆకారం మాత్రం అలాగే వుంది. లోపల ఫిల్టర్స్, టిస్యూలు మాయమయ్యాయి. అక్కడ కూడా రక్త నాళాలు పగిలి ఇంటర్నల్ హెమరేజ్ జరిగిన సూచనలు కనబడ్డాయి.

మరో గంటన్నర దాకా డాక్టర్ గౌతమ్ మరణించిన డాక్టర్ జేమ్స్ దేహంలోని వివిధ భాగాలు పరిశీలించాడు వృత్తిపరమయిన ఆసక్తితో.

తర్వాత కిడ్నీ, గుండె, లివర్ మొద లయిన భాగాలని తన ఇన్‌స్టిట్యూట్‌కి పంపమని కోరాడు.

హాస్పిటల్ డ్రస్ వదిలి, శుభ్రంగా స్నానం చేసి, మళ్ళీ తన దుస్తులు ధరించి, సూపరింటెండెంట్ ఇచ్చిన టీ తాగాడు. రెండు గంటలు పట్టింది పోస్ట్‌మార్టమ్.

ఈ పనులన్నీ యాంత్రికంగా చేసే శాడు. మనసంతా ఆ కొత్త రకం రోగం మీద కేంద్రీకరింపబడి వుంది.

డాక్టర్ గౌతమ్ అనేక రకాల సూక్ష్మ జీవుల గురించి తెలుసుకున్నాడు. అవన్నీ మనుషులకి హాని చేసేవయినా ఇంత వేగంగా, ఇంత అధికంగా హాని చేసే క్రిముల గురించి ఎప్పుడూ వినలేదు, చూడలేదు ఒక్క ప్లేగ్ క్రిమి తప్ప.

మౌనంగా తన కారెక్కాడు – బుర్ర నిండా రకరకాల ఆలోచనలతో. ఇన్‌స్టి ట్యూట్‌కి బయలుదేరింది కారు.

* * *

అయిదో రోజు.

నెమలికొండ మిషనరీ హాస్పిటల్‌లోని నర్స్ దయానా రెండున్నర రోజులనించి పక్కమీద నించి లేవలేదు. ఒళ్ళు కాలి

పోతోంది. విపరీతమయిన నీరసం. లోపల భరించలేనంత మంట. మూత్రం రావడం ఆగిపోయింది. చెమట ద్వారా రక్తంలోని కలుషిత పదార్థాలు వెలుపలికి నెట్టివేయబడుతున్నాయి. ఒంటినిండా టప్పులాగా పేరుకుంటోంది.

అసహ్యంగా, రోతగా వుంది దయానికి.

పిడుగులాగా తెలిసిందా వార్త.

"డాక్టర్ జేమ్స్ మరణించారుట"

గుమ్మం దగ్గరే నిలబడి చెప్పింది నర్స్ మార్తా.

తన గదిలోకి రానివ్వటం లేదు దయానా మార్తాని-ఆమెకి కూడా తన వ్యాధి అంటుకుంటుందనే భయంతో.

గత ముప్పైఆరు గంటలుగా దయానా మనసులో మెదిలే ఆలోచన స్థిరపడింది ఆ వార్తతో.

"మార్తా! ఇక నువ్వు వెళ్ళిపో. ఈ హాస్పిటల్‌లో వుండద్దు. ఇది మృత్యు నిలయం"

మార్తా ఆశ్చర్యంగా చూసింది.

"నీ సూట్‌కేస్ తీసుకుని వెళ్ళిపో. నెమలికొండలో అయిదారు వందల మంది పైగా ఈ జబ్బు వాత పడ్డారు. నువ్వు ఇక్కడ వుండి చేసేదేం లేదు. నువ్వూ మృత్యువువాత పడక మునుపే వెళ్ళిపో"

మార్తా తన సామాను సర్దుకుంది.

"మార్తా!" పిలిచింది కళ్ళ నీళ్ళతో దయానా.

దగ్గరికి రాబోయింది మార్తా.

"ఆగు. రాకు" అరిచింది దయానా. దయానా ఎంతో పెగుల్చుకుని మాట్లాడాల్సి వస్తోంది. గొంతు వాచడంతో నాలుకమీద తెల్లని పొక్కులు వుండడంతో మాట్లాడలేకపోతోంది, నాలుక కదలితే మండిపోతోంది కొలిమిలో వుంచినట్లుగా.

"నాకో చిన్న సహాయంచేసి వెళ్ళు" వగరుస్తూ అడిగింది దయానా.

ఏమిటన్నట్లుగా చూసింది మార్తా.

ఏడుస్తోంది మార్తా కూడా!

"పెంటోథాల్ బాటిల్స్, ఇంజక్షన్ సిరంజి ఇచ్చి వెళ్ళు"

"ఎందుకు?" అన్నట్లు సౌంజ్ఞ చేసింది మార్తా.

"ఈ బాధ భరించే కంటే మరణించడం మేలు"

మార్తా మొహంలో వర్ణించడానికి అలవికాని ఫీలింగ్స్.

"ప్లీజ్! నేను చావడం ఎలాగూ తప్పదు. ఈ బాధనించి త్వరగా విముక్తి చెందితే చాలు. ఇది భరించలేని బాధ"

మార్తాకి తెలుసు ఇక పదినిమిషాల్లో మరణిస్తాదని ఖచ్చితంగా తెలిసినా, పేషెంట్ ఎంత బాధ అనుభవిస్తున్నా మెడికల్ ప్రొఫెషన్‌లోని వాళ్ళు పేషెంట్ కోరినా చంపకూడదని. దానంతట అదే గుండె ఆగిపోయేదాకా బ్రతికివుండేటట్లుగా కృషి చేయాలి.

జాలితో చంపడం నేరం

మెర్సీ కిల్లింగ్ ఈజ్ ఏక్రైమ్.

ఆలోచిస్తూ నిలబడ్డ మార్తాని అడిగింది దయానా మళ్ళీ-

"మార్తా ప్లీజ్! ఈ ఒక్క సహాయం చెయ్యి. నేను లేచి అడుగు నేలమీద పెట్టలేను"

"ఐయామ్ సారీ" తల అడ్డంగా వూపింది.

"మార్తా"

"నో"

వెనక్కి తిరిగి బయటకి వచ్చింది





మార్తా. డయానా కంఠం బొంగురుగా విని పిస్తోంది.

"మార్తా మార్తా ప్లీజ్ ! హెల్ప్‌మి !" పిలుస్తోంది.

హాస్పిటల్ బిల్డింగ్‌లోంచి బయటకి వచ్చి కాంపౌండ్ గేట్ ముందు ఆగింది.

చేతిలోని సూట్‌కేస్ నేల మీద పడేసి గిరుక్కున వెనక్కి తిరిగి హాస్పిటల్‌లోకి పరిగెత్తింది మార్తా.

అంత బాధలో కూడా తిరిగి వచ్చిన మార్తాని చూసి హాయిగా నవ్వింది డయానా.

చేతిని ముందుకు చాపి అందుకుంది మార్తా అందించిన వస్తువులు.

"థాంక్స్"

"మేగాడ్ బ్లెస్ యు"

డయానా తన జీవితంలో ఆఖరిసారి మాట్లాడిన మాట, విన్న మాటలు అవే. చెవి వినలేక పోయినా పెదవుల కదలికని బట్టి అర్థం చేసుకోగలిగిందా మాటలు.




"పేపర్ చూడలేదు" చెప్పాడు డాక్టర్ గౌతమ్.

బిర్లా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ రీసెర్చ్ డైరెక్టర్ వుజ్వల్‌సింగ్ రెండు ఇంగ్లీష్ దినపత్రికలని అందించాడు హెడ్‌లైన్స్ చూశాడు డాక్టర్ గౌతమ్.

"కిల్లర్ ఫీవర్ యిక్స్ ఆంధ్రప్రదేశ్" అనే హెడ్డింగ్ ఓ పేపర్‌లో ఇస్తే మరో పేపర్‌లో ఇంకా భయపెట్టే హెడ్డింగ్.

"విల్ ఇండియన్స్ సర్‌వైవ్ ?"

దీక్షగా చదివాడు డాక్టర్ గౌతమ్. ఛాలా విషయాలు తెలిశాయి.

నెమలికొండ గ్రామంలో మొదలయిన ఈ జ్వరం అయిదు వేలమంది ప్రజలు గల ఆ గ్రామంలోని పదోవంతుకి పైగా అంటే దాదాపు ఆరు వందల మందికి అంటుకొంది. ఆ గ్రామంలో ఆరోగ్యంగా వుండే ప్రజలు నెమలికొండ వదిలి మిగతా చోట్లకి పారిపోతున్నారు.

నెమలికొండలో అనారోగ్యానికి గురయినవారు ఆ గ్రామం వదిలి బయటకి వెళ్ళకుండా కడప జనరల్ హాస్పిటల్ సూపరింటెండెంట్ సలహా మీద జాగ్రత్త తీసుకున్నారు. రోడ్‌బ్లాక్స్ పెట్టి ఆ గ్రామంలోకి కొత్తవారెవరూ వెళ్ళకుండా జాగ్రత్త తీసుకుంటున్నారు స్థానిక పోలీసులు.

కడప జనరల్ హాస్పిటల్ సూపరింటెండెంట్ ఆ రోగానికి గురయి అదే ఆస్పత్రిలో చేర్చబడ్డారు. హాస్పిటల్‌లోకి ఈ రోగానికి గురయినవారినే ఎడ్మిట్ చేసుకుంటున్నారు. దాన్ని క్వారన్‌టెయిన్ హాస్పిటల్‌గా భావిస్తూ లోపలికి ఐడెంటిటీ కార్డ్ వున్న వుద్యోగులని తప్ప మరెవరినీ వెళ్ళనివ్వడంలేదు. రోగుల బంధువులని కూడా వాళ్ళని చూడటానికి లోపలికి అనుమతించటంలేదు. ఆ రోగంతో మరణించిన వారి శవ సంస్కారం ప్రజల క్షేమం దృష్ట్యా ప్రభుత్వమే చేస్తోంది. కులమత విచక్షణ లేకుండా వారి దేహాలని కాల్చేస్తు

న్నారు. తద్వారా ఆ రోగ క్రిములు నాశనం అవుతాయి. పాతి పెడితే అవి భూమిలో బేక్టీరియా రూపంలో సజీవంగా వుండగలవని కొందరు మెడికల్ డాక్టర్స్ అభిప్రాయం.

ఆ విధంగా హాస్పిటల్‌లో చేర్చబడ్డ వాళ్ళ సంఖ్య పన్నెండు వందల ఏభై మంది దాకా వుండచ్చని అంచనా. వారిలో కడప ప్రాంతానికి చెందిన పార్లమెంట్ సభ్యుడు, అసెంబ్లీ సభ్యుని భార్య వున్నారు.

ఈ రోగం మొదటిసారిగా సోకి, మరణించిన వ్యక్తికి వైద్యం చేసిన డాక్టర్ జేమ్స్ కూడా ఆ రోగంతోనే మరణించారు. ఆయన దేహాన్ని హైదరాబాద్‌లోని ఉస్మానియా జనరల్ హాస్పిటల్‌లో పోస్ట్‌మార్టం చేశారు. ఉస్మానియా హాస్పిటల్ సూపరింటెండెంట్ ఆ సందర్భంలో విడుదల చేసిన ప్రెస్ నోట్‌లో రోగ లక్షణాలని పేర్కొన్నారు. ఆ లక్షణాలు గల రోగులు దగ్గరలోనే వున్న క్వారన్‌టీన్ లేదా ప్రభుత్వ ఆస్పత్రికి వెంటనే వెళ్ళవలసిందిగా కోరారు ఆ ప్రెస్‌నోట్‌లో.

న్యూఢిల్లీలోని వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ తమ సంతాపాన్ని తెలియచేస్తూ, ఈ రోగం మీద పరిశోధనలు ప్రారంభించిన హైదరాబాద్‌లోని బిర్లా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ రీసెర్చి డైరెక్టర్ వుజ్వల్‌సింగ్‌కూ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికీ టెలిగ్రాంలు పంపించింది.

పాకిస్థాన్ రేడియో ఓ కొత్త రకం జ్వరంతో ఇండియాలో లక్షలమంది మరణిస్తున్నారనే అసత్యపు వార్త ప్రసారం చేసింది. బి. బి. సి. ప్రసారం ప్రకారం ఇంతదాకా 5,680 మందిదాకా ఈ వ్యాధికి గురయ్యారని, పదిహేను రోజులు మించకుండా ఇంత మందిని అనారోగ్య పీడితులని చేసే ఆ రోగం కంట్రోల్ చేయలేకపోతే ఇండియా తీవ్రమయిన జన నష్టానికి గురవుతుందని పేర్కొంది.

కడప నించి ఇతర ప్రదేశాలకి వెళ్ళే వాళ్ళని పరీక్షించి అనారోగ్యలక్షణాలున్న వాళ్ళని ఆపేస్తున్నారు. నాలుగు డాక్టర్ టీమ్స్‌తో కడప రైల్వే స్టేషన్స్‌లో ఇందు నిమిత్తం టెంపరరీ డిస్పెన్సరీని తెరిచారు. కడపకూ, కడపనించి డిస్ట్రిక్ట్స్‌కి వెళ్ళే ఆర్ టి సి బస్సులన్నిటినీ రద్దు చేశారు.

హైదరాబాద్‌లో దాదాపు వందమంది దాకా ఈ కొత్తరకం రోగంతో క్వారన్‌టైన్ హాస్పిటల్‌లో చేర్చబడ్డారు.

పేపర్ నిండా రకరకాల వార్తలు.

డాక్టర్ గౌతమ్ పేపర్స్ మడిచి డైరెక్టర్ టేబిల్ మీద పెట్టి పెద్దగా నిట్టూర్చాడు.

"ఇన్‌క్రెడిబుల్" అన్నాడు.

"పోస్ట్‌మార్టం గురించి చెప్పండి"

డాక్టర్ గౌతమ్ తను చూసింది చెప్పాడు—

"ఆ రోగం సోకినవాళ్ళు విపరీతమయిన బాధకి గురవుతారు. ఇంటర్నల్ బ్లీడింగు అధికంగా వుంది. ముఖ్యంగా గుండె, కిడ్నీలు బాగా ఎఫెక్ట్ అవుతాయి. కిడ్నీ పాడవటంతో రక్తంలో యూరిక్ ఏసిడ్ పేరుకుపోయి అదే విషంగా మారి మరణించడం జరుగుతోంది. డయాలసిస్ మెషీన్ మీద వుంచితే బతకచ్చు. కాని ఇంతమందికి డయాలసిస్ మెషిన్స్ ఎక్కడనించి వస్తాయి? పాడయిపోయిన

 

కిడ్నీలు తీసి కొత్తవి ఎంతమందికని ట్రాన్స్‌ప్లాంట్ చేయగలుగుతారు? అసలు అన్ని కిడ్నీలు డొనేట్ చేయడానికి ఎంత మంది ముందుకు వస్తారు?

"కిడ్నీలని నాశనం చేసే ఈ జ్వరం పేరు? పుదయం ప్రెస్ రిపోర్టర్లు వచ్చి వెళ్ళారు. దీని పేరేమిటిని అడిగారు నన్ను" చిన్నగా నవ్వీ నవ్వకుండా నవ్వాడు గౌతమ్.

"ఇప్పుడే అన్నారు మీరు. కిడ్నీ ఫీవర్"

"కిడ్నీ ఫీవర్!"

"అవును. ఈ వింత భయంకర రోగాన్ని 'కిడ్నీ ఫీవర్' అని పిలుద్దాం."

* * *

డాక్టర్ సత్యనారాయణ కూడా పేపర్లన్నీ చదివాడు ఆ పుదయం. పళ్ళు పట పట కొరికాడు. ఎంత ప్రమాదకరమయిన పనికి తనని ఆహ్వానించాడు డాక్టర్ గౌతమ్.

ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్ళాక డైరెక్టర్ పి. ఏ. ద్వారా వారం రోజులకి శలవు చీటిని పంపించాడు-మద్రాసులోని తన తల్లికి ఒంట్లో బాగాలేదని, టెలిగ్రాం వచ్చిందని, వెంటనే వెళ్ళాలని.

లోపలికి వెళ్ళి రెండు నిమిషాల్లో బయటకి వచ్చింది-డైరెక్టర్ పర్సనల్ అసిస్టెంట్.

"మిమ్మల్ని పిలుస్తున్నారు" చెప్పింది.

లోపలకు వెళ్ళాడు సత్యనారాయణ.

"టెలిగ్రాం ఏదీ?"అడిగాడు డైరెక్టర్.

"ఇంటి దగ్గర వుంది"

"ఓ రెండు గంటలు పర్మిషన్ ఇస్తాను తీసుకురండి" చెప్పాడాయన నవ్వుతూ.

"సా... పారేశాను."

"ఐయామ్ సారీ డాక్టర్ సత్యనారాయణా! దాదాపు నేషనల్ క్రైసిస్‌ని ఎదుర్కొంటున్న ఈ సందర్భంలో శలవు మంజూరు చేయను. ముఖ్యంగా డాక్టర్ గౌతమ్ అసిస్టెంట్‌కి అసలే శలవు ఇవ్వబడదు" మందలింపుగా చెప్పాడు.

డాక్టర్ సత్యనారాయణ బయటకి వచ్చాడు తలవంచుకుని.

డాక్టర్ గౌతమ్ క్యూబికల్‌లోకి వెళ్ళాడు.

"గుడ్‌మార్నింగ్ డాక్టర్" విష్ చేశాడు గౌతమ్.

"గుడ్‌మార్నింగ్"

"లేబొరేటరీకి వెళదాం. ఇవాళ క్వారన్‌టైన్ హాస్పిటల్‌నించి బ్లడ్ సేంపుల్స్ వచ్చాయి. డాక్టర్ జేమ్స్ బ్లడ్ సిరమ్ ఎక్కించిన ఎలుకలలో ఇప్పటిదాకా ఎలాంటి మార్పు లేదు. ఆ రోగం వున్న పేషెంట్స్ శరీరంనించి తీసి, శరీర ఉష్ణోగ్రత తగ్గకుండా తెచ్చిన బ్లడ్‌తో ఇవాళ పరిశోధన చేద్దాం. పేపర్ చూశారుగా. మనం పిలయినంత త్వరగా ఆ కిడ్నీ ఫీవర్ వైరస్‌ని కనుక్కొనే ప్రయత్నం చేయాలి"

"కిడ్నీ ఫీవర్?"

"అవును. ఇవాళ పేపర్‌లో రాశారుగా? ఆ పేరు నేను, డైరెక్టర్ కలిసి పెట్టాం ఈ జ్వరానికి"

"కంగ్రాచ్యులేషన్స్"

"అంత త్వరగా చెప్పకండి. మొదలు పెట్టిన పని సాధించాక ఒకేసారి చెప్పదురుగాని"

"ఉదయ రాలేదే?"

"లేబ్‌లో వుంది. ఇవాళ నాకు అసిస్టె





చేస్తుంది". సత్యనారాయణ మనసులో ముల్లు గుచ్చుకున్నట్లయింది. తను డాక్టర్ గౌతమ్ కన్నా అందంగా వుంటాడు. మరి ఉదయ తనని ఎందుకంతనిర్లక్ష్యంగా చూస్తుంది? డాక్టర్ గౌతమ్‌లో తనలో లేని గొప్పతనం, ఆకర్షణ ఏమిటి? అందులో ఓ కాలు కుంటి.

"పదండి"

ఇద్దరూ లేబొరేటరీకి వెళ్ళారు.

రెండు బ్లడ్ బాటిల్స్ చూపించి చెప్పాడు డాక్టర్ గౌతమ్ సత్యనారాయణకి.

"దయచేసి సి.బి.పి (కంప్లీట్ బ్లడ్ పిక్చర్) రిపోర్ట్ తయారు చేయండి. ముఖ్యంగా వైట్ బ్లడ్ సెల్స్ కౌంట్ కావాలి. రక్తం రంగు చూస్తే తెల్ల కణాలు తక్కువగా వున్నాయనిపిస్తోంది"

"అలాగే డాక్టర్"

"జాగ్రత్త" సత్యనారాయణ భుజం మీద తట్టి చెప్పాడు డాక్టర్ గౌతమ్.

"మీరు కూడా"

వ్యంగ్యంగా అన్నాడో, నిజంగా అన్నాడో డాక్టర్ గౌతమ్‌కి అంతుబట్ట లేదు.

బాటిల్స్‌ని అందుకోబోతున్న సత్యనారాయణతో చెప్పాడు గౌతమ్ కొద్దిగా కోప్పడుతున్నట్లుగా–

"జాగ్రత్త"

గ్లోవ్స్ అందుకున్నాడు సత్యనారాయణ.

డాక్టర్ గౌతమ్ యధాప్రకారం బాత్ రూంలోకి వెళ్ళి, శుభ్రంగా మెడికేటెడ్ సోప్‌తో స్నానం చేసి, స్టెరిలైజ్ చేయబడ్డ గౌను, టోపీ ధరించాడు. గ్లవ్స్ తొడుక్కొని మాస్క్ కట్టుకున్నాడు ముఖానికి.

తర్వాత ఎయిర్ లాక్ చేసిన గాజు తలుపు తెరచుకొని లోపలికి వెళ్ళాడు. గౌనులో సిద్ధంగా వుంది ఉదయ. ఉదయ నర్సింగ్ కోర్స్ పాస్ అయి ఇదివరలో నర్స్‌గా పని చేసింది ఇన్‌స్టిట్యూట్‌లో చేరబోయే ముందు.

డాక్టర్ గౌతమ్ రెండురోజుల క్రితం బ్లడ్ సిరం ఎక్కించిన ఎలుకలని పరిశీలించాడు. వాటిలో ఎలాంటి మార్పు వున్నట్లు లేదు.

గాజు పాత్రలో జంతువుల సెల్స్‌లో బ్లడ్ కలిపిన టిష్యూని చిన్న గాజు పలక మీద రాసి దాన్ని ఎలక్ట్రాన్-మైక్రోస్కోప్ కింద వుంచి లెన్స్ ఎడ్జెస్ట్ చేశాడు. ఆ మైక్రోస్కోప్ కింద వుంచబడ్డ వస్తువు 50 వేల రెట్లు అధికంగా చూపబడుతుంది. జర్మనీ నుంచి దిగుమతి చేసుకోబడ్డ అది అతి శక్తివంతమయిన మైక్రోస్కోప్.

జాగ్రత్తగా పరిశీలించాడు.

సూక్ష్మ క్రిములేం కనబడలేదు.

చిన్నగా నిట్టూర్చి అ అద్దం పలకని మరిగే నీళ్ళలో పడేశాడు. తర్వాత లేబ్ అసిస్టెంట్ దాన్ని పారేస్తాడు.

పది బ్లడ్‌బాటిల్స్ వరసగా వున్నాయి. టేబిల్ మీద. 'కిడ్నీ ఫీవర్' అంటుకున్న రోగి నుంచి తీయబడ్డవి. బాటిల్స్ మీద అంటించబడ్డ లేబుల్స్‌ని పరిశీలించాడు. ఒక బాటిల్‌లో పది సి.సి. రక్తం వుంది. ఆ జ్వరం తగిలిన అయిదో రోజున అతని వంట్లోంచి తీయబడింది.

చేత్తో సౌంజ్ఞ చేశాడు గౌతమ్.

ఉదయ ఇంజక్షన్ సిరంజని అందించింది. అయిదు నిమిషాల ముందే స్టెరిలైజ్ చేసింది ఉదయ దాన్ని మళ్ళీ.

డాక్టర్ గౌతమ్‌కి ఆకుపచ్చరంగు ద్రవం వున్న బాటిల్‌ని అందించింది. ఆ బాటిల్‌లో కలిపాడు డాక్టర్ గౌతమ్ అయిదు బాటిల్స్‌లోని రక్తాన్ని.

ఉదయ 11 నుంచి 20 నంబర్లు రాసి వున్న పెట్టెల్లోని ఎలుకలకి స్పృహ తప్పించింది. ఈథర్‌ని మీట నొక్కి, అవి పీల్చే గాలిలో కలిపి.

అద్దం తలుపులోంచి స్పష్టంగా కనబడింది - అవి నిమిషంలో పూర్తిగా స్పృహ కోల్పోవటం.

డాక్టర్ గౌతమ్ ఒకొక్క ఎలుకని బయటికి తీసి వాటికి ద్రవం కలిపిన ఆ రక్తాన్ని ఒకో సి.సి ఇంజెక్ట్ చేశాడు వివిధ అవయవాల్లో. వాటి తాలూకు వివరాలు ఉదయ ఆ పెట్టెల మీద అతికించ బడివున్న తెల్ల కాగితం లేబిల్స్ మీద రాసింది.

డాక్టర్ గౌతమ్ తర్వాత టెస్ట్‌ట్యూబ్ స్టాండ్‌లోని ఓ టెస్ట్‌ట్యూబ్‌ని బయటకి తీసి సౌంజ్ఞ చేశాడు. ఉదయ దాన్నందుకుని దాని మీద తెల్లకాగితం అంటించింది.

డాక్టర్ గౌతమ్ పొడుగాటి గాజు పిప్పెట్‌ని అందుకుని ఓ బ్లడ్ సేంపుల్ బాటిల్‌ని అందుకుని మూత తెరిచాడు. ఆ బ్లడ్ సేంపిల్స్ వుంచబడ్డ పెట్టె లోపల 104 ఫారిన్ హీట్ వేడి మెయిన్ టెయిన్ చేయబడుతోంది. కిడ్నీ ఫీవర్ సూక్ష్మ క్రిమి ఆ వేడిమిలో శరీరంలో వృద్ధి చెందుతోంది కాబట్టి అవి నశించే అవకాశం లేదు.

తెరచిన బాటిల్‌లో పిప్పెట్‌ని వుంచి పిప్పెట్ రెండో చివరి భాగాన్ని నోట్లో వుంచుకున్నాడు.

భయంగా చూసింది ఉదయ.

అహల్య గుర్తుకు వచ్చింది ఉదయకి.

తలెత్తి చూశాడు గౌతమ్ ఉదయ వంక. ఆమె కళ్ళు మాత్రమె కనిపించాయి మాస్క్‌లోంచి. ఆ కళ్ళలోని భయాన్ని స్పష్టంగా చదివాడు.

అహల్య గుర్తుకు వచ్చింది గౌతమ్‌కి.

జాగ్రత్తగా కిడ్నీ ఫీవర్ క్రిములున్న ఆ మానవ రక్తాన్ని నోటితో పీల్చాడు. గాజు పిప్పెట్‌లో పైకి, పైపైకి వచ్చింది ఎర్రటి రక్తం - కూల్‌డ్రింక్‌ని పీల్చే స్ట్రాలో కూల్‌డ్రింక్ వచ్చినట్లుగా.

చివరి భాగంలో అడ్డంగా పత్తి అమర్చబడి వుంది. డిస్ఇన్ ఫెక్టెంట్‌లో ముంచి ప్రత్యేకంగా తయారు చేయబడ ఆ ఏంటీ-సెప్టిక్ పత్తి వచ్చే గాలిని వడబోసి క్రిములని సంహరిస్తుంది.

కాని పొరబాటున ఆ పత్తిని ఆ రక్తం? దాటి నోట్లోకి వస్తే ఇక మృత్యువునించి ఎవరూ రక్షించలేరు.

పిప్పెట్‌ని నోట్లోంచి తీసి చివర కుడిచేతి చూపుడు వేలు అడ్డు వుంచాడు. జాగ్రత్తగా రక్తాన్ని బాటిల్‌లో పోస్తూ పిప్పెట్ మీద గీసిన గీతలని పరిశీలిస్తూ అందులో సరిగ్గా మిల్లీ లీటర్‌లో సగ భాగం వుండేలా చేసి దాన్ని ఉదయ కాగితం అతికించిన టెస్ట్‌ట్యూబ్‌లోని ద్రవంలో కలిపాడు ఒక్క బొట్టుకూడా క్రింద వలకకుండా.

పది టెస్ట్‌ట్యూబ్‌లలో ఆ విధంగా రక్తం కలిపి వాటిని మళ్ళీ స్టాండ్‌లో వుంచాడు వాటి మీద అంటించిన తెల్ల కాగితాల మీద కొన్ని వివరాలు రాసి.

సూక్ష్మ క్రిములు పెరగటానికి సరయిన పదార్థాలు, వాతావరణం ఆ టెస్ట్ ట్యూబ్‌లో వున్నాయి. ప్రతీరోజు మైక్రోస్కోప్ ద్వారా పరిశీలించాలి వాటిని.

అవి బాగా పెరగడానికి ఎన్ని రోజులయినా పట్టచ్చు. కాని రెండు వారాలలోగా అవి నశించిపోతాయి సాధారణంగా.

ఉదయ భుజం మీద తట్టాడు భయం లేదన్నట్లుగా. తర్వాత జ్వర క్రిములున్న రక్తాన్ని ఎక్కించిన ఎలుకలున్న పది పెట్టెలకి వున్న 'వాయిస్' అనే బటన్ని నొక్కాడు. అవి లేచి కదలడం ప్రారంభం అవగానే యాంత్రికంగా టేప్ రికార్డర్ ఆన్ అవుతుంది. అవి అరిచే అరుపులు రెండు గంటలు తిరిగే స్పూల్లో రికార్డ్ అవుతుంది. ఆరుగంటలకోసారి వాటి శబ్దాన్ని రికార్డ్ చేస్తుంటారు లేబ్ లోని ఆడియో స్టాఫ్. వాటి అరుపులలోని, బాధలలోని తేడా గుర్తించి వాటిలో జ్వరంలా ఎలా అభివృద్ధి చెందుతుందో గ్రహించవచ్చు.

టెస్ట్‌ట్యూబ్‌లోని టిష్యూకల్చర్స్ వంక చూశాడు డాక్టర్ గౌతమ్.

ఏ రోగం తాలూకు సూక్ష్మక్రిములని కనుక్కోవాలన్నా ఇదే ఇంతదాకా లోకంలోని రీసెర్చ్ వర్కర్స్ అవలంబించే పద్ధతి. సూక్ష్మ క్రిములకి ఆహారంగా జంతువుల లైవ్ సెల్స్ వేస్తారు. వాటిని టెస్ట్‌ట్యూబ్‌లలో పెంచి మైక్రోస్కోప్ ద్వారా పరిశీలించి వాటిమీద అనేక రకాల విరుగుడులని వుపయోగించి ఏది త్వరగా ఎఫెక్టివ్‌గా చంపుతుందో పరిశీలించి దాన్ని మానవుల మీద ప్రయోగించి చూసి ఆ తర్వాత వేక్సైన్‌ని తయారు చేస్తారు.

ఇదే విధంగా క్షయ, ఫ్లూ, కుష్టు, యెల్లో ఫీవర్, పోలియో, ప్లేగు, అనేక ఇతర రోగాల క్రిములన్నీ చంటి పిల్లల కన్నా జాగ్రత్తగా పెంచబడ్డాయి.

స్టూల్ మీద కూర్చుని ఉదయని బాత్ రూంలోకి వెళ్ళమన్నట్లుగా సౌంజ్ఞ చేశాడు.

ఇంకో అర గంటలో ఎలుకలకి తెలివి వస్తుంది. అవి మత్తునించి కోలుకోగానే వాటి ప్రవర్తనలో ఏమయినా తేడా కనబడుతుందేమో గమనించాలని వెయిట్ చేయసాగాడు డాక్టర్ గౌతమ్.

అరగంట తర్వాత ఒక్కొక్కటే లేచాయి. కాని వాటిలో ఎలాంటి మార్పు లేదు. మరో అరగంట దాకా గౌతమ్ ఆలోచిస్తూ అలాగే కూర్చుండిపోయాడు ఆ నిశ్శబ్దంలో. వాటిలో ఇంకా మర్పు లేదు.

బయటికి వచ్చాడు స్నానం చేసి. లేబొరేటరీలోని 'ఇన్‌ఫెక్షువస్‌జోన్'లోకి వెళ్ళేటప్పుడు, వచ్చేటప్పుడూ తప్పని సరిగా ఆ జాగ్రత్త తీసుకోవాలి. లేకపోతే ఆత్మహత్యతో సమానం ఆ వృత్తి.

డాక్టర్ సత్యనారాయణ లేడు లోపల. లైటు వెలగడం లేదు. ఓసారి లేబొరేటరీని దీక్షగా చూశాడు. అనేక పరిమాణాల్లో వున్న రకరకాల గాజు సీసాలు. వాటినిండా రకరకాల ద్రవాలు. స్టాండ్స్ నిండా ఖాళీ టెస్ట్‌ట్యూబ్‌లు, పిప్పెట్‌లు, ఇతర పరికరాలు.

బయటికి వచ్చాడు. లేబ్ అసిస్టెంట్ డాక్టర్ గౌతమ్‌ని చూడగానే కూర్చున్న స్టూల్ మీద నించి గౌరవంగా లేచి నిలబడ్డాడు.

"ఇంకో మూడు గంటల తర్వాత వస్తాను" చెప్పాడు.

సరాసరి తన క్యూబికల్‌కి వెళ్ళాడు. ఉదయ ఏదో టైప్ చేస్తోంది.

"మీకు లెటర్స్ వచ్చాయి. టేబిల్ మీద పెట్టాను" చెప్పింది టైప్ చేస్తూనే..

తన రివాల్వింగ్ ఛెయిర్‌లో కూర్చుని




వాటిని అందుకున్నాడు. కాలిఫోర్నియా యూనివర్సిటీ నించి వచ్చిన బులెటిన్, తన కాలేజ్‌మేట్ స్టీవెన్సన్ పంపిన బర్త్‌డే గ్రీటింగ్. ఇండియన్ మెడికల్ ప్రాక్టీషనర్స్ అసోసియేషన్ వాళ్ల రాబోయే మీటింగ్‌కి పంపిన అజెండా, ఓ లోకల్ ఇంగ్లీష్ థియేటర్‌లో రాబోయే మూడు నెలలలో ప్రదర్శింపబడే ఆంగ్ల చిత్రాల జాబితా.

ఆఖరున ఆ కవరు అందుకున్నాడు.

చేతి రాత గుర్తుపట్టాడు.

అహల్యా!

క్షణకాలం ఆలోచనగా దానివంక చూశాడు.

ఏం రాసి వుంటుంది?

విప్పి చదవాలా?

అవసరం వుందా తనకు?

ఏదయినా సహాయం కోరి రాసి వుంటుంది. నెల నెలా భరణం తన బేంక్ నించి అహల్యా బేంక్‌కి ఆటోమేటిక్‌గా బదిలీ అవుతూంటుంది. అంతకు మించి అధికంగా సహాయం చేయడతను—చేసే శక్తి వున్నా.

తను అహల్యతో, అహల్య తనతో సంబంధ బాంధవ్యాలు తెంచేసుకున్నారు. ఇక ఎందుకీ వుత్తరం?

ఎవరయినా ఇంటికి వచ్చి తలుపు తడితే, ఎంత శత్రువయినా మర్యాదకి తప్పకుని 'రండి' అనడం సంస్కారం. కాని ఫోన్ చేస్తే రిసీవర్ ఎత్తినప్పుడు మాట్లాడకుండా పెట్టేయచ్చు ఇష్టంలేని వాళ్ళయితే.

అలాగే ఉత్తరం రాస్తే చింపేయచ్చు.

టేబిల్‌మీద కత్తెర అందుకుని ఆ కవరుని విప్పకుండానే పరపర ఎనిమిది ముక్కలుగా కత్తిరించాడు. ఓ కవరు ముక్కలోంచి చిన్న ఫొటో ముక్కరాలి కింద పడింది.

అది ఓసారి అహల్యా తను కలిసి తీయించుకున్న ఫొటోలోని ముక్కగా గుర్తించాడు డాక్టర్ గౌతమ్.

డస్ట్‌బిన్‌లో పడేశాడు వాటిని.

చిన్నగా నవ్వుకున్నాడు. తన లాయర్ కోర్టుహాల్‌లో చెప్పిన వాక్యం గుర్తుకు వచ్చి—

'విడాకులిచ్చిన భార్యకి భరణం ఇవ్వటం అంటే, చచ్చిన గుర్రానికి మేత కొనడం లాంటిది'

బహుశ తిరిగి తనని వివాహం చేసుకోవాలనుకుంటూండచ్చు. ఆ వుత్తరం లోని సారాంశం అదే అయితే దాన్ని తను చదవడానికి ఇష్టపడడు. సమాధానం రాయాల్సిన ఉత్తరం అయితే, అది చదవక పోవడమే మంచి పని.

తలుపు తెరుచుకొని లోపలికి వచ్చాడు. డాక్టర్ సత్యనారాయణ చేతిలో ప్లాస్టిక్ ఫోల్డర్‌తో.

"గదిలోకి రాబోయేముందు తలుపు కొట్టడం మరచిపోకండి ఇంకెప్పుడూ" చెప్పాడు గౌతమ్.

అతనందించిన ఫోల్డర్ తెరిచి చూశాడు. ఇదివరలో హాలెండ్‌కి, అమెరికాకి, ఇంగ్లండ్‌కి పంపిన టెలిప్రింటర్ మెసేజెస్‌కి సమాధానాలు వచ్చాయి.

కిడ్నీ ఫీవర్ క్రిములని గురించిన సమాచారం వాళ్ళ దగ్గరలేదు. ఆ సమాధానం ముందే వూహించాడు గౌతమ్.

టేబిల్‌మీద పేపర్ వెయిట్‌ని చేత్తో తిప్పుతూ ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్న డాక్టర్ గౌతమ్‌తో చెప్పింది ఉదయ టైప్ మిషన్ ముందు నుంచి లేచి.

"లంచ్ అవర్"

ముగ్గురూ లేచారు. దారిలో సత్య నారాయణని అడిగాడు డాక్టర్ గౌతమ్-

"సి.బి.పి. రిపోర్ట్ సాయంత్రానికి తయారవుతుంది కదూ?"

"అవుతుంది"

కేంటీన్‌లో వాళ్ళతో కూర్చోలేదు. ఇంకో టేబిల్ దగ్గరికి వెళ్ళాడు సత్య నారాయణ.

"ఇవాళేం తెచ్చారు?" అడిగాడు గౌతమ్.

"మీ కిష్టమయింది"

"పెసరట్"

"కాదు"

"ఇంకేమిటి?"

"ఉల్లిపాయ పెసరట్"

"అది కాదు నాకిష్టమయింది"

"ఇంకేమిటబ్బా?"

"ఉదయ చేసిన ఉల్లిపాయ పెసరట్"

"ఇది ఉదయ చేసిందే. ఉదయ తల్లి చేసింది కాదు. ఉల్లిపాయలు తరగడం నించి"

"గుడ్"

"అహల్యా ఉత్తరం రాసింది" చెప్పాడు.

టిఫిన్ బాక్స్ తెరిచి ఖాళీ ప్లేట్‌లలో ఒకదాంట్లో రెండు పెసరట్లు, మరోదాంట్లో ఒకటి వేసి అడిగింది ఉదయ.

"ఏం రాసింది?"

"చదవకుండా చింపేశాను"

కొద్దిసేపు ఇద్దరూ మౌనంగా వుండి పోయారు.

"చదివి వుండాల్సింది" అన్నది.

"నాకు రెండు వేసి మీరు ఒకటే వేసుకున్నారు?" అడిగాడు.

"మీకిష్టమని, నాకు ఒకటి చాలని"

"అన్నట్టు ఎల్లుండి నా పుట్టిన రోజు.

"గ్రీటింగ్స్ పంపివుంటుంది."

"ఇక అహల్యా గురించి మాట్లాడద్దు"

"ఇదే ఆఖరి సారి. ఆమెకి నిజంగా మిమ్మల్ని తిరిగి వివాహం చేసుకోవాలని వుందేమో?"

"నాకు లేదు"

"మీరు ప్రమాదకరమయిన వృత్తిలో వున్నారని, మీ ద్వారా మీ భార్య అయిన ఆమెకి ఆ ప్రమాదం సంభవించవచ్చని విడాకులకి పిటిషన్ పడేసిందనా?"

"కాదు. నాకు ముందే చెప్పకుండా ఆ పని చేసినందుకు. నా భార్యకి నా మీద లేని ప్రేమ తన ప్రాణంమీద వుండటం నేను సహించలేను. ధైర్యవంతుడు పిరికి వాళ్ళతో కలసి బతకలేడు. ఐ హేట్ ఇట్... పెసరట్ నిజంగా అద్భుతంగా వుంది."

కొద్దిసేపు ఇద్దరూ నిశ్శబ్దంగా వుండి పోయారు.

"పెసరట్ బావుందన్నాను."

"విన్నాను. పోనీ ఓ సారి అహల్యా..

"స్టాపిట్ ఐ సే. ఓంట్ యు స్కిప్ హర్?" చిరుకోపంతో అడిగాడు డాక్టర్ గౌతమ్.

"ఐయామ్ సారీ డాక్టర్!"

"పెసరట్ బావుంది."

"మీ కోసం నెయ్యితో చేశాను"

"జీడిపప్పు కిలో ఎంత?"

"కిలో వేయలేదుగా? అయిదారు మించి వేయలేదు. నిజానికి లెక్క పెట్టి వేశాను"

"చేత్తో రుబ్బినట్టున్నావ్ పెసలు?"

"అవును. గ్రైండర్‌లో అయితే ఈ రుచిరాదు"

"థాంక్స్ బేబీ!"

మళ్ళీ కొద్దిసేపు ఇద్దరి మధ్యా

 

నిశ్శబ్దం అలుముకుంది.

"ఉదయా!"

"ఊఁ"

"ఇంకెవరినయినా వివాహం చేసుకో గలరా మీరు ?"

"ఎందుకా ప్రశ్న ?"

"మరి అహల్య విషయం ఇంకోసారి ఆలోచించమనటంలో నీ వుద్దేశం నాకు బోధపడలేదు."

"విడాకులు ఇద్దరూ ఇష్టపడో లేక ఒకరు ఇష్టపడో తీసుకున్నాక మళ్ళీ సంవత్సరం పాటు వివాహం చేసుకోకూడదనే నియమం ఎందుకు? మన వివాహానికి ఇంకా అయిదునెలల మీద కొన్ని రోజులు ఆగాలి. విడాకులకి ముందు ఎలాగో రెండు సంవత్సరాల జుడీషియల్ సెపరేషన్ వుండాలంటున్నారుగా! కలవడమో, విడిపోవటమో ఈలోగా నిర్ణయించుకోలేరా ? పెళ్ళయి ఒక్క రోజు కలసివున్నా తిరిగి విడాకులు అయ్యాక సంవత్సరం వేచివుండాలి, మళ్ళీ లైఫ్‌లో సెటిల్ అవడానికి. అదీ శిక్ష. పైగా... కోర్టు పద్ధతుల్లో నచ్చనివి నాకుచాలావున్నాయి"

"అవి చర్చించద్దు. అందులో చక్కటి పెసరెట్ తిన్నాక''.

మరి కొంతసేపు మౌనంగా వుండి పోయారు.

"కాఫీ ?" అడిగింది సర్వర్ దగ్గరకి రాగానే.

తల వూపాడు కావాలన్నట్లుగా.

రెండు కాఫీ ఆర్డర్ చేసింది ఉదయ.

"ఎల్లుండి రాత్రి డిన్నర్ నాతో. హోటల్ బంజారాలో టేబిల్ రిజర్వ్ చేయిసాను. ఓకే ?"

"ఓకే."

సత్యనారాయణ గౌతమ్‌ని, ఉదయని దూరంగా కూర్చుని గమనిస్తున్నాడు. ఒళ్ళంతా కంపరంగా వుంది అతనికి.

"ఆ ఎలుకలు ఎంత ముచ్చటగా వున్నాయో ?" అన్నది

"లేబ్‌లోవా ?"

"అవును. ఎక్స్‌పరిమెంట్ పేరుతో వాటికి రోగాలు కలిగించి, బాధపెట్టి చంపటం అన్యాయం అనిపిస్తుంది"

చిరునవ్వు నవ్వాడు డాక్టర్ గౌతమ్.

"కొత్తల్లో అలాగే అనిపించేది. ఆ మధ్య ఇల్లస్ట్రేటెడ్‌వీక్లీలో అనుకుంటాను ఓ ఆర్టికల్ చదివాను, ఇదే విషయం మీద. పురోభివృద్ధికి కొన్ని తప్పవు. టైఫాయిడ్ జ్వరక్రిమి కనుక్కోవటంలో కొన్ని ఎలుకలు, కోతులు బాధపడి మరణించి వుండచ్చు. కాని ఈనాడు టైఫాయిడ్‌తో మరణించే మనుషులు అరుదు సకాలానికి మందు అందితే ! ఇదివరలో వాళ్ళు మీలా అనుకుంటే మనకి లోకంలో మందులే వుండేవి కావు''

"ఈ రీసెర్చ్ పేరుతో ప్రపంచంలో ప్రతీ రోజు కొన్ని వేల ఉండేళ్ళు, ఎలుకలు, కోతులు, కుక్కలు, పిల్లులు మొదలైన జంతువులు మరణిస్తున్నాయి"

"అవి ఎలాగూ చావక తప్పదు. కాని వాటి బ్రతుక్కి, చావుకీ ఓ అర్థంవుంది. మానవ జాతికి వుపయోగం వుంది. ఎంతో జాగ్రత్తగా, ఎలాంటి అనారోగ్యం వాటిల్లకుండా, ఫైవ్‌స్టార్ హోటల్స్‌లో వుంచినట్లుగా పెంచుతారు వాటిని. బయటి ప్రజలలో అవి ఈయజ్ఞంలో సమిధలుగా ఎలా బలవుతున్నాయో కొద్దిమందికే తెలుసు. జంతువులని లేబొరేటరీలకి సరఫరా చేసే వ్యాపారస్థులకి, నా లాంటి వాళ్ళ బంధు మిత్రులకి, ఎప్పుడైన వాటి



మీద ఏ పత్రికలోనో వ్యాసం ప్రచురిస్తే చదివినవాళ్ళకి. మానవజాతి వాటి వుపయోగం వల్ల ఆరోగ్యంగా సుఖంగా జీవిస్తోంది."

"మా ఇంట్లో టామీని చూశారుగా? దాన్ని చూసినప్పుడల్లా మీరు ఓ ట్రాపికల్ ఫీవర్ కోసం బలిచేసిన కుక్క గుర్తుకు వచ్చి మనసంతా బాధ అనిపిస్తుంది... మిమ్మల్ని తప్పు పడుతున్నానని కాదు. బాధ సహజం కదా! దాన్ని గురించి చెప్తున్నాను."

చిన్నగా నవ్వాడు డాక్టర్ గౌతమ్.

"పెంపుడు జంతువులని ఎత్తుకెళ్ళి మెడికల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూషన్‌కు అమ్మడం ఇంకా మన దేశంలోని నేరస్థులకి అలవాటుకాలేదు. అమెరికాలో అలాంటి



దొంగలున్నారు. ఇంట్లో ఎంతో ప్రేమగా పెంచే పెట్ ఏనిమల్స్ మరణిస్తే కుటుంబ సభ్యులంతా బాధపడతారు. మేం రీసెర్చ్‌లో చంపే జంతువుల మీద ఎవరికీ ప్రేమ వుండదు. డాక్టర్స్ వాటిని ప్రాణం వున్న జంతువులుగా గుర్తిస్తే పని సాగదు. వాటిని కూడా మైక్రోస్కోప్ లాగా, టెస్ట్‌ట్యూబ్‌లాగా, ఓ పనిముట్టు లాగా చూస్తారు.

అప్పుడే వచ్చిన సత్యనారాయణ ఆ మాటలు విన్నాడు. లంచ్ టైం అయిందని చెప్పడానికి గౌతమ్, ఉదయ టేబిల్ దగ్గరకి వచ్చాడు.

అతన్ని చూసి ఇద్దరూ లేచారు.

ఆ ముగ్గురూ మౌనంగా కేంటిన్‌లోంచి బయటికి నడిచారు.

డా. సత్యనారాయణ మనసులోని ఇదివరకటి ఆలోచన మళ్ళీ చోటు చేసుకుంది.

"'డాక్టర్ గౌతమ్‌కి ప్రాణాలంటే లెక్కలేదు. నన్ను కూడా ఓ స్టెతస్కోప్‌లాగానో, తీసివేయాల్సిన కేన్సర్ భాగంలాగానో భావించి చంపేయగలిగే మనస్థయిర్యం వుంది' అనుకున్నాడు మనసులో.




డాక్టర్ గౌతమ్ గాజు అద్దాల తలుపులోంచి కిడ్నీ ఫీవర్ క్రిములు ఇంజెక్ట్ చేసిన ఎలుకలని పరిశీలించాడు సాయంత్రం నాలుగున్నరకి. ప్రతీ రెండు గంటలకోసారి వాటిని పరిశీలిస్తున్నాడు. వాటిలో ఎలాంటి మార్పూలేదు ఇంకా.

డాక్టర్ గౌతమ్ బాత్‌రూంలో స్నానం చేసి, దుస్తులు మార్చుకుని మళ్ళీ బయటికి వచ్చాడు. డాక్టర్ సత్యనారాయణ పనిచేసే భాగంలోకి వెళ్ళాడు మరోసారి స్నానంచేసి..

నిశ్శబ్దంగా వున్న తన గది తలుపు తెరుచుకోగానే కొద్దిగా వులిక్కి పడ్డాడు. సత్యనారాయణ,ఎవరో గదిలోకి వచ్చారని గ్రహించగానే. తల వెనక్కి తిప్పి చూశాడు.

అతని మొహంలోని భయాన్ని గమనించాడు డాక్టర్ గౌతమ్.

"ఎంతదాకా వచ్చింది ?" అడిగాడు.

"అయిపోయింది."

ఓ కాగితం అందించాడు. దాన్నందుకుని చదివాడు డాక్టర్ గౌతమ్.

"టోటల్ వైట్ బ్లడ్ కార్పుస్కల్స్ 2,800 పర్ క్యూబిక్ మిల్లీ మీటర్ ఆఫ్ బ్లడ్"

"చాలా తక్కువ" అన్నాడు పెదవి విరిచి.

"మైగాడ్ ! హోమ్ పేర సైట్స్ పధ్నాలుగు శాతం?"

"అవును, అందుకే రక్తం పేల్‌గా వుంది చూపులకి"

"న్యూట్రోఫిల్స్ నలభై రెండు శాతం. టూ బేడ్"

డాక్టర్ గౌతమ్ జేబులోంచి పేపర్ టిష్యూ తీసి ఓసారి మొహం తుడుచుకుని దాన్ని డిస్‌పోజల్ బేగ్‌లో పడేశాడు. తర్వాత బయటకి నడిచాడు ఆలోచనగా.

సత్యనారాయణ డాక్టర్ బయటకి వెళ్ళేదాకా ఆగి తర్వాత గౌతమ్ పారేసిన ఆ పేపర్ కర్‌ఛీఫ్ వంక చూసాడు.

ఇంత స్టెరెల్ వాతావరణంలోకి జ్వర క్రిములని పేపర్ కర్‌ఛీఫ్ ద్వారా తీసుకురావచ్చు. అవి కిడ్నీఫీవర్‌వే అయివుండాల్సిన పనిలేదు. మరే విష జ్వరం క్రిములయినా చాలు తనకి అంటించడానికి. లేకపోతే ఆ కర్చీఫ్‌ని ఎందుకు ఇక్కడ పారేసినట్లు? చెమట కూడా పట్టదే, ఏర్ కండిషన్డ్ కాబట్టి. ఎందుకు దాన్ని వుపయోగించినట్లు ?

సత్యనారాయణ ఆ పేపర్‌కర్‌ఛీఫ్‌ని స్టీల్ పటకారతో డిస్‌పోజల్ బేగ్ లోంచి బయటకి తీసి ఎలక్ట్రిక్ పొయ్యిలో వేసి




కాల్చేసాడు.

ప్రాణాలని తను లెక్కచేయనని చెప్పటం స్పష్టంగా విన్నాడు. ఉదయతో చెప్పాడేమో తనని చంపదలచుకున్నానని!

డాక్టర్ గౌతమ్ మీద కోపం,అసహ్యం రెట్టింపయ్యాయి డాక్టర్ సత్యనారాయణకి.

* * *

"నేను రాత్రి లేబ్‌లోనే వుండిపోతాను. మీరు బస్‌లో ఇంటికి వెళ్ళండి" చెప్పాడు డాక్టర్ గౌతమ్ ఉదయకి డైరక్టర్‌ని కలిసి వచ్చాక.

"ఏం?"

"రాత్రి ఆ ఎలుకలని పరిశీలించాలి. తర్వాత టిష్యూ కల్చర్‌లోని టెంప రేచర్ నోట్ చెయ్యాలి. ఆ క్రిములు వృద్ధి చెందే పక్షంలో టెంపరేచర్ పెరుగు తుంది. కాబట్టి మన ప్రయత్నం విఫలమో, విజయవంతమో రాత్రికి తెలిసిపోతుంది."

"మనకి వివాహం అయివుంటే బావుం డేది"

"ఎలా?"

"నేనూ రాత్రికి మీతో సహాయానికి, కబుర్లు చెప్పుకోడానికి వుండిపోయేదాన్ని"

"వైట్ బ్లడ్‌సెల్స్ కౌంట్ చాలా బలహీనంగా వుంది. శరీరంలోని బేక్టరి యాని, వైరస్‌ని ఎదుర్కొని నాశనం చేసేవి అవే. కిడ్నీఫీవర్‌వైరస్ రక్తంలోని తెల్లకణాలకన్నా శక్తి వంతమయినవిగా కనిపిస్తున్నాయి."

"ఎంతుంది కౌంట్ ?"

"రెండువేల ఎనిమిది వందలు."

"నార్మల్‌గా అయితే ఆరు నుంచి పది వేల దాకా వుంటాయి కదా !"

"కరెక్ట్"

ఉదయకి గుర్తు వచ్చింది. ఒక క్యూబిక్ మిల్లీమీటర్ పరిమాణంలో తీసు కున్న రక్తంలోని వైట్ బ్లడ్ సెల్స్ కౌంట్ చేయడం ట్రెయినింగ్‌లో నేర్పు కుంది. ఉదయ తన హేండ్ బేగ్ అందు కుని చెప్పింది–

"గుడ్‌నైట్ డాక్టర్"

"గుడ్‌నైట్...అండ్ స్వీట్ డ్రీమ్స్"

ఉదయ నడుం చుట్టూ కుడిచేతిని వేసి దగ్గరకి లాక్కున్నాడు డాక్టర్ గౌతమ్. ఆమె పెదవుల మీద ముద్దు పెట్టు కున్నాడు.

ఓ నిమిషం తర్వాత ఉదయ విడి పించుకుంది.

"కోటా మొత్తం ఇప్పుడే ఖర్చు చేసేస్తే ఎలా ?" అన్నది వూపిరి పీల్చు కుంటూ. తనగుండె వేగంగా కొట్టుకోవటం గమనించింది ఆవేశంతో.

"పుట్టినరోజు సందర్భంగా ఈవారం కోటా పెంచాలి. తప్పదు"

మళ్ళీ దగ్గరకి లాక్కొని ముద్దుపెట్టు కొన్నాడు.

ఉదయ బలవంతంగా విడిపించుకుని చెప్పింది.

"బస్ టైం అయింది"

"గుడ్‌బై డార్లింగ్!"

"బై!"

గబగబా వెళ్ళిపోయింది ఉదయ. సరిగ్గా టెంకి బయలుదేరితాయి బస్సులు సిటీకి. అవి మిస్ అయితే ఇక వేరే ట్రాన్స్‌పోర్ట్ దొరకటం దుర్లభం.

డాక్టర్ గౌతమ్ తన రివాల్వింగ్ ఛెయిర్‌లో కూర్చున్నాడు. కళ్ళు మూసు కున్నాడు.

పెదవుల మీద మొలిచిన చిరునవ్వు క్రమంగా అధికమై గట్టిగా నవ్వాడు.

నాలుగైదు నెలల క్రితం సంఘటన

గుర్తుకు వచ్చింది.

* * *

ఉదయ ఇంటికి మొదటిసారిగా వెళ్ళాడు ఆ రోజు.

ఉదయ, ఆమె తల్లి తప్ప ఇంకెవరూ వుండరు ఇంట్లో. ఉదయ అన్నయ్య ఎయిర్‌ఫోర్స్‌లో మెకానికల్ ఇంజనీర్‌గా పని చేస్తున్నాడు. సింధీ యువతిని వివాహం చేసుకున్నాక తన కుటుంబంతో సాన్నిహిత్యం తెంపేసుకున్నాడు. ఇప్పుడతనికి తన భార్య కుటుంబమే తల్లి, చెల్లెలూ అంతా.

"నమస్తే"

చేతులు జోడించి నమస్కారం చేశాడు ఆవిడకి.

ఆవిడకి తెలుసు గౌతమ్ చట్టరీత్యా బ్రహ్మచారని, విదేశాలలో చదివి వచ్చాడని, ఎప్పుడూ చూడకపోయినా ఆహల్య ఎలా వుంటుందో, ఎందుకు విడిపోయిందో కూడా తెలుసు ఉదయ ద్వారా. గౌతమ్‌కి సంబంధించిన అనేక ఇతర విషయాలు కూడా తెలుసు. ముగ్గురూ 'మోనోపలి' ఆట ఆడారు గంటన్నరసేపు. తర్వాత ఆవిడ లేచి అన్నది–

"మరిచాను. డాక్టర్ దగ్గరకి వెళ్ళి రావాలి"

"మా అమ్మకి బి.పి. రెయిజ్ అవుతుందని అనుమానం కలిగినప్పుడల్లా చెకప్ చేయించుకోవాలి. నాలుగో ఇల్లే డాక్టర్ డిస్పెన్సరీ"

"బి. పి. ఆపార్టస్ వుంటే నే చెక్ చేస్తాను"

"లేదు"

"మీ అమ్మగారిని హాస్పిటల్‌లో డ్రాప్‌చేసి నేను వెళ్తాను" లేచాడు డాక్టర్ గౌతమ్ కూడా.

"కూర్చో నాయనా! నడిచి వెళ్ళగలను. కారులో కూర్చున్నంతసేపు పట్టదు నడవడం. వచ్చేస్తాను. ఇంకా కాఫీ కూడా తాగలేదు నువ్వు"

"నేను కాఫీ కలుపుతాను"

ఉదయ వంట గదిలోకి వెళ్ళింది గౌతమ్‌కి పేపర్ అందించి.

ఉదయ తల్లి హాస్పిటల్‌కి వెళ్ళింది.

ఓ నిమిషం పేపర్ తిరగేసి ఉదయని పిలిచాడు డాక్టర్ గౌతమ్.

"ఏమిటి?" అడిగింది వచ్చి.

దగ్గరికి లాక్కుని ముద్దు పెట్టుకున్నాడు. ఉదయ కొన్ని క్షణాలు విడిపించుకునే ప్రయత్నం చేసింది. కాని తర్వాత విరమించుకుంది.

తెల్లగా వుండే ఉదయ మొహంలో ఎర్రగా వుండే పెదవులని, మెడనీ, బుగ్గలని, కళ్ళని, కనుబొమలని, కనురెప్పలని, చెవులని...

ఉదయ ఊపిరి పీల్చుకోడానికి కొన్ని క్షణాలు వ్యవధి ఇస్తూ గాఢంగా ముద్దు పెట్టుకుంటూనే వున్నాడు.

ఎన్ని నిమిషాలు గడిచాయో తెలియలేదు ఇద్దరికీ. ఇద్దరూ ఆ తీయదనం అనుభవిస్తూ సంజీవరెడ్డినగర్ కాలానీని, హైదరాబాద్‌ని, అసలు ఇండియానే విడిచి పసిఫిక్ మహాసముద్రంలోని ఏ ద్వీపానికో చేరుకున్నట్లు ఫీలయ్యారు.

తలుపు చప్పుడు విని ఉదయ చటుక్కున దూరంగా జరిగింది తల్లి లోపలికి వచ్చే లోపలే.

"అయ్యో! కాఫీ మాడిన వాసన వేస్తోంది. పొయ్యిమీద పడేసి ఎంతసేపయింది?" అడిగింది ఆవిడ కంగారుగా.

తెల్లటి ఉదయ మొహం పూర్తిగా ఎర్రగా కందిపోయింది అప్పటికే. కళ్ళు




మత్తుగా మారాయి.

డికాషన్ మొత్తం పాడయిపోయింది మాడిపోయి.

ఎంతో సిగ్గు పడ్డారిద్దరూ.

ఆవిడ అర్థం చేసుకోగలిగిందో లేదో ఇద్దరికీ అర్థం కాలేదు.

మర్నాడు చెప్పింది ఉదయ ఆఫీస్‌లో.

"డాక్టర్ మీకు వారానికి అంటే, ఆఫీస్‌లో మనం కలిసి పనిచేసే ఆరు రోజుల్లో పధ్నాలుగు నిమిషాలే కోటా"

"దేనికి కోటా ?"

"ముద్దుకి''

"అన్యాయం"

"కాదు. తియ్యటి వాటికన్నిటికీ కోటా సిస్టం. చక్కెరకి లేంది ముద్దుకి ఎందుకు వుండకూడదూ ?''

"పండగలకి ఎక్స్‌ట్రా కోటా వుంటుందా?''

''ఉంటుంది''

"ఓవర్ డ్రాఫ్ట్?''

"ఇదేం బేంక్ ఎకౌంట్ కాదు- ఓవర్ డ్రాఫ్ట్, బేలన్స్, మెయిన్‌టేయిన్ చేయ డానికి. ఏ రోజుదారోజే ఉపయోగిం చాలి"

''పెళ్ళయ్యాక కూడానా ?''

"ఉహూఁ అప్పటిదాకా"

"మరి టైం చూసేది ఎవరు?"

"నేనే"

"టైం చూస్తారా లేక...?"

"రెండూ"

"బావుతేదీ పద్ధతి"

"అయితే త్వరగా పెళ్ళి చేసుకోండి"

"కుదరదుగా. కోటా, గీటా ఎత్తే యండి"

"కోటా సిస్టం ఎత్తేయ్యడం కూడా అంతే కుదురుతుంది"

"మీ అమ్మగారి సలహానా ?"

"ఛీ ! నాదే"

"మీది మట్టి బుర్రంటాను"

"మీలాంటి వారిముందు ఇలాంటి మట్టి బుర్రే మెరుగంటాను"

"ఇవాళ కోటా ఎంత?"

"నిమిషం ఛావు"

"మీ వాచ్ ఫాస్ట్ తిరిగితే"

"తిరగదు మీదే స్లో"

"ఆఁ! నేను స్లోనా?"

ఉదయని దగ్గరికి లాక్కున్నాడు. సవ్యంతూ అతని భుజం చుట్టూ చెయ్యి వేసింది ఉదయ పడిపోకుండా. తన రెండు చేతులూ ఉదయ నడుం చుట్టూ వేసి గాలిలో రెండంగుళాలు పైకి లేపి ముద్దు పెట్టుకున్నాడు ఉదయ పెదవులని.

కొద్ది సేపయ్యాక డాక్టర్ గౌతమ్ మెడమీద గట్టిగా గిల్లింది ఉదయ.

"దట్సిట్. రేపటి దాకా ఆగండి" అన్నది గౌతమ్ ఉదయని నేలమీద దింపాక.

* * *

మర్నాడు ఉదయం ఉదయ డాక్టర్ గౌతమ్ గదిలోకి అడుగు పెట్టేసరికి గౌతమ్ ఏదో రాసుకుంటున్నాడు. ఉదయని చూడగానే లేచి నిలబడి, ఆమెని పైకెత్తి గాల్లో గిరగిర తిప్పాడు సంతోషంగా.

"ఏమిటి?" అడిగింది.

"సక్సెస్"

"వైరస్ టెస్ట్‌ట్యూబ్‌లో పెరుగు తోందా?"

"ఆహా. టెంపరేచర్ రైజ్ అయింది"

"ఎలుకలు?"

"జ్వరం వచ్చింది. వాటి శరీరంలో

కూడా క్రిములు పెరుగుతున్నాయి."
"మైక్రోస్కోప్‌లో కనబడ్డాయా?"
"ఇంకా లేదు."
"ఇవాళ పేపర్ చదవండి."
"విశేషాలున్నాయా?"
"హెడ్డింగ్ చూడండి తెలుస్తుంది."
డాక్టర్ గౌతమ్ చెప్పాడు బద్ధకంగా
"చదివే ఓపిక లేదు. నువ్వే చెప్పు."
"హైద్రాబాద్‌లో రెండువేలమంది పైగా కిడ్నీ ఫీవర్ బారిన పడ్డారు. ఒకరు స్టేట్ మినిష్టర్. ఇద్దరు సెక్రటేరియట్ లోని వున్నతోద్యోగులు. మన రాష్ట్రం మొత్తం మీదా వివిధ ప్రాంతాలలో పది వేలమందిదాకా అస్వస్థులయ్యారు. ప్రజల్లో భయం ఎక్కువయింది. ఇంటర్నేషనల్ ఫ్లైట్స్ అన్నీ ఎయిర్ ఇండియా రద్దు చేసింది. ఫారిన్ టూరిస్టులు కొద్ది నెలల పాటు రారని, వాళ్ళ సంఖ్య బాగా తగ్గిపోతుందని, అందువల్ల ఫారిన్ ఎక్స్ఛేంజ్ తగ్గుతుందని టూరిస్టు శాఖవాళ్ళు విలేఖరులతో చెప్పారుట. ఫైవ్ స్టార్ హోటల్స్ హోటల్‌గది అద్దె తగ్గించ వచ్చుట, ట్రాఫిక్ లేకపోవడంతో...అన్నీ ఇలాంటి వార్తలే"
"మరో నాలుగు రోజుల్లో నా పరిశోధన పూర్తవచ్చు. లేదా కొన్ని నెలలు పడుతుంది."
డాక్టర్ గౌతమ్ మొహంలో అలసట, నిద్రలేమి బాగా కనిపించాయి ఉదయకి.
"రాత్రంతా నిద్రపోలేదా?" అడిగింది
"ఓ రెండు గంటలు పడుకున్నాను. మధ్యాహ్నం ఓ గంట పడుకుంటాను. ఇవాళ రాత్రి కూడా మేలుకొనే వుండాలి"
"సత్యనారాయణకి అప్పగించచ్చుగా ఈ పని"

"అతను చెప్పింది చేస్తాడు కాని, ఆలోచించి అవసరాన్ని బట్టి చెప్పనిది చెయ్యడు."




ఉస్మానియా హాస్పిటల్‌లోని ఎమర్జెన్సీ వార్డ్‌లో వున్నాడు స్టేట్ మినిష్టర్. హార్ట్ ఆపరేషన్ చేసినప్పుడు వుంచే స్పెషల్ రూమ్‌లో వున్నాడాయన.

ఆ గదిలో ఎలాంటి బేక్టీరియా లేకుండా స్టెరిలైజ్ చేయబడ్డది. నర్సులు, డాక్టర్లు ప్రత్యేకమయిన దుస్తులు వేసుకుని వస్తున్నారు.

ఆయనకి సెలైన్ వాటర్ ఎక్కిస్తున్నారు నాలుగు గంటలకోసారి. టెంపరేచర్ తగ్గడానికి ఐస్‌బేగ్స్ పెడుతున్నారు.

రక్తంలోకి సరిపడ్డ ఆక్సిజన్ అందటం లేదు. ఊపిరి పీల్చుకోవడానికి ఇబ్బంది పడుతున్నాడు. ఆయన మొహానికి అరగంటకోసారి పదినిమిషాల సేపు ఆక్సిజన్ మాస్క్ తగిలిస్తున్నారు చర్మం ఆక్సిజన్ లేక నీలం రంగులోకి మారినప్పుడల్లా.

క్రమంగా ఆయన ఆరోగ్యం క్షీణిస్తోంది. డయాలసిస్ మెషిన్ వుపయోగించారు.

ఆయన శరీరంలోని రక్తమంతా ఆ ఆర్టిఫీషియల్ కిడ్నీ మెషిన్‌లోకి వెళుతోంది. కిలో లోపు బరువు వుండే

కిడ్నీ చేసేపని ఆ పెద్ద యంత్రం చేస్తోంది.

శుద్ధి చెందిన రక్తం ధమనికి అమర్చిన ఓగొట్టం ద్వారా తిరిగి ఆయన శరీరంలోకి ఎక్కుతోంది. ఓ సిరకి అటాచ్ చేయబడ్డ గొట్టం ద్వారా తిరిగి రక్తం ఆ మెషన్ లోకి వెళుతోంది.

ఆయన శరీర వుష్ణోగ్రత 103 దాటడం లేదు కాని తగ్గటం లేదు.

'కిడ్నీ ఫీవర్' వచ్చినవాళ్ళు తొమ్మిది రోజులు మించి ఇంతదాకా ఎవరు బ్రతక లేదు. పదకొండు రోజులు బ్రతికిన వ్యక్తి ప్రపంచంలో ఆయనొక్కడే.

ఆక్సిజన్ మాస్క్, డయాలసిస్ మెషిన్ ఆయన ప్రాణాలు కాపాడటానికి అధికంగా సహాయం చేస్తున్నాయి. నోటి ద్వారా ఏం తీసుకోలేకపోయినా, సెలైన్ వాటర్ వల్ల శరీరంలోని రక్తంలోకి కావలసినంత నీరు అందుతోంది.

గాజు అద్దం లోంచి టి.వి కెమేరాతో ఆయనని షూట్ చేశారు.

ఆరోజు టి.వి.లో ఆయన్ని చూపించ డమేకాకుండా కిడ్నీ ఫీవర్ రాకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు ప్రాక్టికల్‌గా చూపించారు.

నీటిని సాధారణంగా పదిహేను నుంచి ఇరవై అయిదు నిమిషాలసేపు మరగ బెట్టి వడబోసి తాగితే అందులోని సూక్ష్మ క్రిములు నశిస్తాయి. కాని అరగంటయినా నీటిని మరిగించి, వడబోసి, గోరు వెచ్చని నీరు తాగాలి.

అనవసరంగా మరో వ్యక్తిని ముట్టుకో కూడదు. అందువల్ల ఇన్‌ఫెక్షన్ అంటు కోక పోవడానికి ఎక్కువ అవకాశం వుంటుంది.

రోజూ కనీసం పది లీటర్ల నీళ్ళయినా తాగాలి. రక్తంలోని అపరిశుద్ధ పదార్థాలు ఆ నీటి ద్వారా బయటికి నెట్టివేయబడ తాయి.

తరచు టెంపరేచర్ చెక్ చేసుకుం టుండాలి. ఒకరు వాడిన థర్మామీటర్ మరొకరు వాడకూడదు. చెవి నొప్పి. అరిపాదం ఎర్రగా అవడం, టెంపరేచర్ ఈ వ్యాధి లక్షణాలు. అలాంటి లక్షణాలు కనబడ్డ వెంటనే దగ్గరలోవున్న ప్రభుత్వ ఆస్పత్రికి వెళ్ళాలి. వ్యాధి ముదిరేదాకా ఇంట్లోవుంటే, తగిన చికిత్స లభ్యం కాకపోవటమటుంచి ఇతరులకి కూడా ఆ వ్యాధి సోకచ్చు.

అలాంటి లక్షణాలు గల వ్యక్తులను ఎవరయినా చూడటం తటస్థిస్తే వెంటనే దగ్గరలోని పోలీస్ స్టేషన్‌లో కానీ హెల్త్ ఇన్‌స్పెక్టర్స్‌కి కానీ తెలియ చేయాలి.

రేడియో ద్వారా కూడా ప్రభుత్వం ఈ ప్రకటనలు చేస్తోంది రోజూ.

మర్నాటికి రోగుల సంఖ్య పద్దెనిమిది వేలకి పెరిగింది!

ఇన్‌ఫెక్షన్ అధికమవుతోంది రాష్ట్ర మంతటా

* * *

డైరెక్టర్ రీసెర్చి చేసే వాళ్ళ గదు లకి వెళ్ళడం ఎన్నడో కాని జరగదు. డాక్టర్ గౌతమ్ గదికి డైరెక్టర్ వుజ్వల్ సింగ్ ఎన్నడూ రాలేదు.

ఆవేళ వచ్చాడు.

నిద్ర లేకుండా పీక్కుపోయిన మొహంతో ఏదో రాసుకుంటున్న గౌతమ్‌ని పలకరించాడు.

"గుడీవినింగ్"

"గుడీవినింగ్ సర్" అన్నాడు

గౌతమ్ ఆయన్ని చూసి వెంటనే లేచి నిలబడి.

"ఎలావుంది ప్రోగ్రస్ ?"

"ఎక్సలెంట్"

తన పరిశోధన వివరాలు చెప్పాడు.

"ఎల్లుండికల్లా పూర్తవు తుందన్న మాట".

"ఖచ్చితంగా అవాలి. నాలుగున్నర రోజుల జ్వరం గల వ్యక్తి నించి తీసుకున్న రక్తంలోని సూక్ష్మ జీవులని టెస్ట్ ట్యూబ్‌లో అదే వుష్ణోగ్రతలో పెంచుతూంటే పెరుగుతున్నాయి. ఎల్లుండికి తొమ్మిది రోజులు పూర్తవుతుంది. అవి మైక్రోస్కోప్‌లో కనబడాలి పూర్తిగా పెరగడంతో"

"ఈ రోజుదాకా కనబడలేదా ?"

"లేదు"

"ఏమిటి రాస్తున్నారు ?"

"పోస్ట్ ఎక్సపరిమెంట్ ప్లాన్స్"

డైరెక్టర్ ఆ కాగితాలని చేతుల్లోకి తీసుకుని చదివాడు అక్కడక్కడా. తర్వాత టేబిల్ మీద కూర్చుని పది నిమిషాలసేపు మొదటి నించీ చదివాడు.

"ఎక్సెలెంట్. తగిన ఏర్పాట్లు చేస్తాను" చెప్పాడు.

"ఎల్లుండి రిజల్ట్ చూసుకుని ప్రొసీడ్ అవుదాం. అంతా సరిగ్గా జరిగితే శుక్రవారం వుదయం మొదలు పెడతాను ఆ ఎక్సపరిమెంట్"

"గుడ్ లక్"



"బై దివే..."

"చెప్పండి"

"లక్షసార్లు అధికంగా చూపించే ఎలక్ట్రాన్ - మైక్రోస్కోప్ సంపాదించ గలరా? మన దగ్గర వున్నది దాంట్లో సగం పవర్ గలది"

"ఐ షల్ ట్రై. కాని ఎల్లుండిలోగా దొరక్కపోవచ్చు"

* * *

మధ్యాహ్నం డాక్టర్ గౌతమ్ ఇన్‌స్టిట్యూట్ నించి పేరడైజ్ సమీపంలో వున్న తన ఫ్లాట్‌కి చేరుకున్నాడు. స్నానం చేసి కాఫీ కలుపుకుని తాగాడు.

బెడ్‌రూంలోకి వెళ్ళి రెండు గంటల తర్వాత అలారం మ్రోగేలా ఎడ్జస్ట్ చేసి టైంపీస్‌ని పక్కనే వున్న స్టూల్ మీద పెట్టాడు. మంచం మీద పడుకుని కళ్లు మూసుకున్నాడు. అయిదు నిమిషాల్లో నిద్ర పట్టింది.

గంటన్నర తర్వాత డోర్ మీద బెల్ మోగడంతో మెలకువ వచ్చింది. లేచి మొహం చన్నీళ్ళతో కడుక్కుని వెళ్ళి తలుపు తెరిచాడు. పక్క ఫ్లాట్‌లోని ఆయన.

"రండి" ఆహ్వానించాడు.

"డిస్టర్బ్ చేస్తున్నామా?" అడిగాడాయన సందేహిస్తూ.

"లేదు. ఇంకో అరగంటలోనే నే లేచే వాణ్ని. రండి"

ముందు గదిలో సోఫాలో డాక్టర్ గౌతమ్, పక్కింటాయన, ఆయనతో వచ్చిన మరొకతను కూర్చున్నారు.

"ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్ళలేదా ఇవాళ?" అడిగాడాయన నిద్రమత్తుగా వున్న గౌతమ్ మొహాన్ని చూసి.

"వెళ్ళివస్తున్నాను. మళ్ళీ ఇంకోగంటలో బయలు దేరతాను. రెస్ట్ తీసుకుందామని వచ్చాను"

"ఇతను నా స్నేహితుడు. మీరు ఇన్‌స్టిట్యూట్‌లో కిడ్నీ ఫీవర్ మీద రీసెర్చ్ చేస్తున్నారని తెలిసి నాలుగైదు విషయాలు కనుక్కోవాలని వచ్చాడు. మీ కభ్యంతరం లేకపోతే..."

"ఇప్పుడు కుదరకపోతే రేపు వస్తాను" చెప్పాడతను మొహమాటంగా.

"ఫర్వాలేదు. అడగండి"

"ఈ వ్యాధి అగస్మాత్తుగా ఇలా రావడానికి కారణం? ఇది ప్రపంచంలో ఎక్కడా లేదని చదివాను పేపరులో"

"ఈ వ్యాధి సోర్స్ తెలుసుకోడానికి నెమలికొండలో ఓ డాక్టర్స్ టీమ్ కృషి చేస్తోంది. వాళ్ళు బొంబేలోని హాఫ్‌కిన్ ఇన్‌స్టిట్యూట్ నించి వెళ్ళారు".

"ఈ వ్యాధికి మందు లేదా?"

"మందులేని వ్యాధి లేదు"

"కేన్సర్ వ్యాధికి మందు లేదని విన్నాను"

"ఉంది...ఉంటుంది. కాని దాన్ని కనుక్కోలేదు. ఆ ప్రయత్నాలు జరుగు తున్నాయి ఇంకా"

"కిడ్నీ ఫీవర్‌కి మందు మీరు కని పెడుతున్నారా? పేపర్‌లో మీ పేరు చదివి, మీరు నా ఫ్రెండ్ పక్క ఫ్లాట్ అని తెలుసుకోడానికి వచ్చాను"

చిరు నవ్వు నవ్వాడు డాక్టర్ గౌతమ్.

"మందు కనుక్కోవడంలేదు నేను. ముందు ఈ వ్యాధి ఏ సూక్ష్మక్రిముల వల్ల వస్తుందో తెలుసుకొనే ప్రయత్నం చేస్తున్నాను. అది తెలిస్తే ఆ వైరస్‌ని ఐడెంటిఫై చేసే దానికి మందు కను క్కొనే వాళ్ళు వేరే వుంటారు"

"మీరు?"

"నేను వైరస్‌ల గురించి స్టడీ చేసే వైరాలజిస్ట్‌ని. అవకాశం ఇస్తేనే నే మందు కనుక్కోగలను. కాని చాలా కాలం పడుతుంది దానికి"

"ఎంత కాలం?"

"కుష్టు వ్యాధికి మందు కనుక్కోవటం జరిగి అర్ధ శతాబ్దం మించలేదు. అది అనాదిగా వున్న వ్యాధి. ఇంతకాలం అని చెప్పటం కష్టం. ట్రయల్ అండ్ ఎర్రర్ పద్ధతి ప్రకారం సాగుతుంది పరిశోధన. జీవిత కాలం చాలకపోవచ్చు ఒకోసారి"

"మీరు వైరస్ క్రిములని వేటాడే మెడికల్ డిటెక్టివ్ అన్నమాట" అన్నా డతను నవ్వి.

"దాదాపుగా"

డాక్టర్ గౌతమ్ కూడా నవ్వాడు.

"కాదు పూర్తిగా. మీరు ఏ విధంగా వాటిని పట్టుకుంటారో పేపర్‌లో ప్రచురించారు. మీ డైరక్టర్ వుజ్వాల్‌సింగ్‌తో ఇంటర్వ్యూ ప్రచురించారు నిన్న. గమ్మతుగా వుంది. మీకూ డిటెక్టివ్‌కు చిన్న తేడా వుంది.

"ఏమిటది?"

"డిటెక్టివ్ మామూలు దొంగలని పట్టుకోవటంలో అతనికి ప్రమాదం వుండదు. కాని మీరు హంతకులయిన వైరస్‌ని వేటాడే ప్రయత్నంలో అవి మీ ప్రాణాలు తీయచ్చు. మిమ్మల్నే కాదు. మీ బంధుమిత్రుల ప్రాణాలు కూడా తీయచ్చు"

నవ్వాడు గౌతమ్. బదులు చెప్పలేదు.

"కాదంటారా?"

"నాతో పరిచయం అయి నా పని గురించి అర్థం చేసుకున్న చాలామందికి ఈ ఆలోచన వస్తుంది. నిజమే! కాని మేం మా శత్రువుల బారి పడకుండా చాలా జాగ్రత్తలు తీసుకుంటాం"

"థ్రిల్లింగ్ జాబ్."

"అందుకే గత రెండు రోజులుగా నా స్నేహితులు కనీసం ఫోన్ అయినా చేయడం లేదు నాకు. ఫోన్‌లో నాతో మాట్లాడినా ప్రమాదమే అనుకుంటున్నట్లున్నారు"

"మన శత్రు దేశం ఏదో మనదేశంలో ఈ విష జ్వరం ప్రవేశ పెట్టిందని కొందరు అనుకుంటున్నారు?"

"ప్రస్తుతం మనం ఎవరితో యుద్ధం చేయటంలేదుగా? జెర్మ్ వార్‌ఫేర్ అభివృద్ధి చెందిన ఈ రోజుల్లో యుద్ధంలో అలాంటి భయంకర విష క్రిములని శత్రువుల మీద ప్రయోగిస్తే కలిగే ఫలితాలు ఇంకా భయంకరంగా వుంటాయి"

"జెర్మ్ వార్‌ఫేర్ అంటే"?

అతనిలో కొత్త విషయాలు తెలుసుకోవాలనే కుతూహలం అధికంగా వుందని గ్రహించాడు డాక్టర్ గౌతమ్.

"అమెరికా, రష్యాలాంటి ఆర్థికంగా అభివృద్ధి చెందిన దేశాలు రకరకాల పరిశోధనలు చేసి కొత్త కొత్త వ్యాధులని కనిపెట్టారు. వాళ్ళ మిలటరీ లేబొరెటరీస్‌లో అలా తయారు చేసిన కొత్త వ్యాధి క్రిములని జాగ్రత్తగా పెంచి దాస్తున్నారు. పాతవి నశిస్తే కొత్తవి పెంచుతారు. ఇందుకోసం అనేకమంది డాక్టర్స్ వాళ్ళ మిలటరీ లేబ్‌లలో కృషి చేస్తున్నారు. వాటికి మందుని కూడా కనిపెడతారని విన్నాను.

"యుద్ధ సమయంలో శత్రు సైన్యం వున్న ప్రాంతంలో ఆ వ్యాధులు ప్రబలేలాగా చేస్తారు. ఆ వ్యాధులు సాధారణంగా విపరీతమయిన వేగంతో మనిషిని క్షీణింప

చేస్తాయి. యుద్ధం చేసే శక్తి వుండదు"

"ఎలా ఆవ్యాధులని ప్రయోగిస్తారు?"

"మంచినీళ్ళు తాగే చెరువుల్లో, బావుల్లో కలపటం, పొలాల్లో వెదజల్లి ఆహారపదార్థాలద్వారా వ్యాపింపచేయటం.. ఇలా చాలా పద్ధతులు. కొన్ని బాంబుల ద్వారా వాతావరణంలోని గాలిలో వ్యాపించేలా చేస్తారు. ఆ గాలి పీల్చిన వాళ్ళకి ఆ వ్యాధి వస్తుంది"

"దాన్ని అరికట్టడానికి మందు వుంటుందా?"

"ఉంటుంది. ఆక్సిజన్ సిలిండర్స్‌తో, శరీరమంతా కప్పివుంచే ప్రత్యేకమయిన సూట్‌లో వస్తారు సైనికులు వాళ్ళని బంధించేందుకు లేదా కాల్చి చంపేందుకు.

"ఇలాగే కెమికల్ వార్ ఫేర్ అని మరో పద్ధతి వుంది. కెమికల్స్ ద్వారా మనిషి ప్రవర్తనలో రకరకాల మార్పులు సంభవిస్తాయి. ఒక మనిషికి మరోమనిషంటే భయం కలుగుతుంది. అది శతృసేనమీద ప్రయోగిస్తే సైన్యంలో ఒకరికొకరు కనబడకుండా దాక్కుంటారు వాళ్ళలో వాళ్ళు. మరో కెమికల్ వల్ల సరిగ్గా ఆలోచించే శక్తి కోల్పోతారు. వీటిని ప్రపంచంలోని అనేక దేశాలు నిషేధించినా కొన్ని దేశాలు పరిశోధనలని ఇంకా విస్తృతం చేస్తున్నాయి.

"ఎవ్విరీ థింగ్ ఈజ్ ఫెయిర్ ఇన్‌లవ్ అండ్ వార్ అన్నారందుకే" అన్నాడతను నవ్వి.

చేతి గడియారం వంక చూసుకున్నాడు గౌతమ్.

"ఆఖరి ప్రశ్న. ఈ వ్యాధివల్ల మనదేశ జనాభా మొత్తం తుడిచిపెట్టుకుపోవచ్చా?"

"దేముడు సృష్టించిన ఈ వ్యాధిని ఆయనే అరికడతాడు. లేదా అరికట్టే మార్గం మనకి చూపిస్తాడు. చైనా లాంటి అధిక జనాభాగల దేశాల్లో ఇలాంటి ఎపిడమిక్స్ కొత్తేం కావు"

"థాంక్‌యు మిస్టర్ డిటెక్టివ్"

"నేను డాక్టర్ని?"

"కాదు మెడికల్ డిటెక్టివ్ మీరు" కరచాలనం చేశాడతను.

* * *

డాక్టర్ గౌతమ్ ఆ ఎలుకలని మరోసారి పరిశీలించాడు. బాధగా అరుస్తున్నాయి. ఎగిరెగిరి పడుతున్నాయి. వాటి అరుపులు కూడా స్పష్టంగా లేవు. వాటి నోట్లోంచి రక్తం కారిన గుర్తుగా అవున్న పెట్టె లోపల రక్తపు చారలున్నాయి.

కొన్ని మగతగా పడి వున్నాయి కదలక. వాటిల్లో కొన్ని మరణించి వుంటాయనుకున్నాడు గౌతమ్ అవి పడుకున్న తీరుని బట్టి.

ఎనిమిదో రోజు ఆ రోజు.

మర్నాటికల్లా ఆ వైరస్ క్రిముల ఆయువు నిండచ్చు. కాని అవి మరణించే లోపల వాటి పిల్లలు వాటి చోటుని తీసుకుంటాయి.

మైక్రోస్కోప్ కింద వుంచే గ్లాస్‌స్లైడ్ అందుకుని ఓ టెస్ట్‌ట్యూబ్ దగ్గరకి వెళ్ళాడు. అది పదో టెస్ట్‌ట్యూబ్.

ఆ ట్యూబ్‌లో ఓ సన్నటి గాజు పిప్పెట్ ముంచి, పైన వేలువుంచి బయటకి తీశాడు. పిపెట్‌లోంచి ఆ గాజు స్లైడ్ మీద ఓ బొట్టు ఎర్రటి ద్రవం వేశాడు. పిప్పెట్‌ని టెస్ట్‌ట్యూబ్‌లో వుంచి మరో గాజు స్లైడ్ అందుకుని మొదటి దాని మీద రెండోది వుంచి ఆ ద్రవం




గాజు పలక మీద పూర్తిగా అంటేలా రాశాడు. ఆ రెంటినీ గ్లోవ్స్ తొడుక్కున్న చేత్తో ఎలక్ట్రాన్ మైక్రోస్కోప్ కింద వుంచాడు.

లోపలికి చూస్తూ లెన్స్ అడ్జస్ట్ చేశాడు. గాజు స్లైడ్ అడుగున చిన్న బల్బు వెలిగే స్విచ్ నొక్కి, ఫిల్టర్‌తో లైట్‌ని కావలసిన మంద్ర స్థాయికి తెచ్చాడు.

ఆ తర్వాత దీక్షగా చూడసాగాడు. మళ్ళీ లెన్స్ అడ్జెస్ట్ చేశాడు స్క్రూ కదిపి.

ఊపిరి బిగబట్టాడు - మైక్రోస్కోప్ లోంచి కనబడే దృశ్యాన్ని చూసి.

స్పష్టంగా కనిపించాయి.

మొట్టమొదటి సారి ప్రపంచంలో వాటిని చూసిన ప్రథమ వ్యక్తి డాక్టర్ గౌతమ్.

భయం లేదు. ఉత్సాహంగా చూశాడు.

వందలు. వందల సంఖ్యలో వున్నాయి ఆ రెండు మిల్లీ మీటర్ల మేర. కదులు తున్నాయి.

డైమండ్ ఆకారంలో వుంది శరీరం. పూర్తి నలుపు రంగు. పట్టులా, సిల్క్‌లా మెరుస్తోంది ఆ నల్లటి శరీరం. నల్లశరీరం మీద ఎరుపు, తెలుపు రంగుల్లో గీతలు అడ్డదిడ్డంగా వున్నాయి.

హంతకులు !

మరి కొద్దిసేపు వాటిని చూస్తూండి పోయాడు. వేగంగా కదులుతున్నాయి. కాదు ఈదుతున్నాయి.

విపరీతమయిన వేగంతో ఈదు తున్నాయి.

అంత వేగంగా అన్నీ ఆ కాస్త చోటులో ఈదుతున్నా, ఒకదానికొకటి అడ్డం రావడంలేదు. మార్గంలో ఎదురు పడి ఢీకొనడం లేదు. ఎవరు ఏ మార్గంలో వెళ్ళాలో ముందే ఆలోచించుకున్నట్లుగా కదులుతున్నాయి.

ఆ ద్రవంలో అక్కడక్కడా వున్న ఏనిమల్ లివింగ్ సెల్స్‌ని ఆత్రంగా, ఆకలిగా తింటున్నాయి.

కిడ్నీలోంచి తీసిన టిష్యూ అది.

రక్తంలో అవి కదిలే వేగానికి శరీరంలో వుష్ణోగ్రత పెరుగుతుందచ్చనిపించింది డాక్టర్ గౌతమ్‌కి. కిడ్నీ టిష్యూలని తినడం ద్వారా కిడ్నీ పాడవుతుంది.

చాలా సేపు వాటి వంక చూస్తూండి పోయాడు.

తర్వాత మైక్రోస్కోప్‌కే అటాచ్ చేయబడివున్న కెమేరా లెన్స్ ఎడ్జెస్ట్ చేశాడు.

స్విచ్ నొక్కాడు.

మర్నాడు వుదయం పేపర్‌లో ఆ ఫొటో మొదటి పేజీలో ప్రచురింపబడు తుంది. కొన్ని వేలమందిని బలికొన్న ఆ శత్రువు ఫొటోని మొదటి సారి డాక్టర్ గౌతమ్ తీశాడు. మొదటిసారి ప్రజలు మర్నాడు చూస్తారు.

ఫొటో ప్రింట్ వచ్చాక, దాన్ని ఎన్‌లార్జ్ చేసి, షుమారు ఎన్ని క్రిము లున్నాయో లెక్క కడతాడు గౌతమ్. ముందు ముందు దాని వుపయోగం వుంటుంది.

"కనబడ్డాయా ?" అడిగింది ఉదయ వుత్సాహంగా

"చూడండి"

పక్కకి తప్పుకున్నాడు గౌతమ్.

"గాడ్ గ్రేషియస్. ఎంత అసహ్యంగా వున్నాయో చూడటానికే" అన్నది ఉదయ మైక్రోస్కోప్‌లోంచి ఓ నిమిషం పాటు వాటి వంక పరీక్షగా చూసి.

"థాంక్స్ దీ స్టార్స్. ఇంత త్వరగా ఈ అధ్యాయం ముగుస్తుందనుకోలేదు. శత్రువెవరో, ఎలా వుంటుందో తెలిసింది కాబట్టి దాని లెథల్ డోస్ అవి పెరిగే క్రమం, అనుకూల వాతావరణం, అనుకూలం కాని వాతావరణం, మొదలయిన విషయాలు కనుక్కోవడం తేలిక, చాలా సమయం తీసుకున్నా"

"కంగ్రాచ్యులేషన్స్"

"థాంక్స్"

డాక్టర్ గౌతమ్ మైక్రోస్కోప్ లోంచి ఆ స్లైడ్స్ తీసి ఎలక్ట్రిక్ స్టౌవ్‌లో పడేసి దాని స్విచ్ ఆన్ చేశాడు. మరో టెస్ట్‌ట్యూబ్ లోంచి ద్రవం తీసి కొత్తగా గ్లాస్ స్లైడ్స్ మీద ఎక్కించి దాన్ని మైక్రోస్కోప్‌లో వుంచి చూశాడు.

ఈ సారి ఇదివరకున్నంత అధికంగా లేవు ఆ వైరస్ క్రిములు. తక్కువగా వున్నాయి.

వాటిని కూడా ఫొటో తీశాడు.

మిగతా ఎనిమిది టెస్ట్‌ట్యూబ్‌లలోని ద్రవాన్ని కూడా మైక్రోస్కోప్‌లో వుంచి వాటి ఫొటోలు తీశాడు.

చివరిదాంట్లో సూక్ష్మ క్రిములు తక్కువగా వున్నాయి, ఆ టెస్ట్ ట్యూబ్ లలో వేసిన విషజ్వరం తాలూకు రక్తం క్వాంటిటీలో తేడాలు వుండటం వల్ల.

అరగంట తర్వాత బిర్లా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ రీసెర్చి డైరెక్టర్ వుజ్వల్ సింగ్ లోపలికి వచ్చి వాటిని మైక్రోస్కోప్‌లోంచి చూసి తృప్తిగా నిట్టూర్చాడు.

"ఇంక ఇవాళ రెస్ట్ తీసుకోండి మీరు" చెప్పాడు అలసిపోయిన డాక్టర్ గౌతమ్ వంక చూసి.

"నెక్ట్స్ ఫేజ్ ఆఫ్ రీసెర్చ్‌కి ఏర్పాట్లు చేస్తారా?" అడిగాడు డాక్టర్ గౌతమ్.

తలవూపి చెప్పాడు వుజ్వల్‌సింగ్-

"డాక్టర్ సత్యనారాయణ చూసుకుంటాడా పని"

"లేదు. రాత్రి పదింటికి మళ్ళీ వస్తాను నేను"

ఆరోజే డాక్టర్ గౌతమ్ పుట్టినరోజు.




నోట్లోని బీడీ ఆరిపోయింది.

అయినా మళ్ళీ అగ్గిపుల్ల గీచి దాన్ని వెలిగించే ప్రయత్నం చెయ్యలేదు ప్రజాపతి. ఆలోచనలో వుండటంతో బీడీ ఆరిపోయిన సంగతి కూడా గుర్తించలేదు.

ప్రజాపతి జైలుకి వచ్చి ఆరు సంవత్సరాలు దాటింది. బయటి ప్రపంచంలో ఎన్ని మార్పులు జరుగుతున్నా లోపల ఎలాంటి మార్పులూ లేవు.

ఒక్క సెంట్రీ తప్ప.

గిటయిరయిన సెంట్రీ స్థానంలో కొత్త సెంట్రీ వచ్చాడు రెండేళ్ళ క్రితం.

అంతే.

తోటి ఖైదీలు తన లాగా యావజ్జీవ కారాగార శిక్ష పడని వాళ్ళు చిన్న నేరాలతో కొద్ది కాలం వుండి వెళ్ళే వాళ్ళు మాత్రం వస్తూ పోతూంటారు. వాళ్ళే బయట ప్రపంచంలోని మార్పుల గురించి చెప్తూంటారు.

"లే"

చెప్పాడు సెంట్రీ లాఠీతో వూచల తలుపు మీద కొట్టి. మరో సెంట్రీ తన సెల్ తలుపు తాళం తీశాడు.

"ఎక్కడికి ?" అడిగాడు ప్రజాపతి లేచి నిలబడి ఆరిపోయిన బీడిని చెవులో వుంచుకుని.

"జైలర్ పిలుస్తున్నారు"

ప్రజాపతి ఓ సారి బద్ధకంగా వళ్ళు విరచుకుని బయటకి వచ్చాడు. ఎందుకు పిలిచాడా అని ఆలోచించలేదు.

ఇంక కొద్ది నిముషాల్లో తెలుస్తుంది. మళ్ళీ ఆలోచన దేనికి అనుకున్నాడు.

సెంట్రీ వెంట నడిచాడు.

జైలర్ ఎదురుగా నిలబడ్డాడు. మల్లయ్యని కొట్టిన సంగతి రిపోర్ట్ ఇచ్చి వుంటాడు. విచారణలాగా వుంది అనుకున్నాడు- మల్లయ్య కూడా అక్కడ వుండటంతో.

కాని తను కొట్టి వారం దాటితే ఇప్పుడు రిపోర్ట్ ఇచ్చాడే?

"మీ ఇద్దరూ లైఫ్ ఇంప్రిజన్‌మెంట్ అనుభవిస్తున్నారు. మీకు బయటికి వెళ్ళాలని వుంటే ఓ మార్గం వుంది" చెప్పాడు జైలర్ ఇద్దరి మొహాలనీ ఎగాదిగా చూసి.

మల్లయ్య, ప్రజాపతి ఒకరి మొహాల వంక మరొకరు చూసుకున్నారు కొన్ని క్షణాలు.

"మీరిద్దరూ హంతకులు. వురిశిక్ష పడనందుకు సంతోషించాలి. ఇప్పుడు బయటికి వెళ్ళే మార్గం లభిస్తోంది"

"ప్రభుత్వం మారిందా మళ్ళీ?" అడిగాడు మల్లయ్య.

క్రితంసారి ఎన్నికల ముందో, తర్వాతో ఖైదీలని విడుదల చేస్తున్నారనే పుకారు విన్నాడు కానీ అది పుకారుగానే వుండిపోయింది.

"మన దేశంలో ఓ కొత్త రకం వ్యాధి ప్రబలింది. అది మన రాష్ట్రం నించే ప్రారంభమయింది. దాని పేరు కిడ్నీ ఫీవర్. దానికి మందు కనుక్కునే ప్రయత్నం జరుగుతోంది. ఆ ప్రయత్నంలో కొందరు మనుషుల సహాయం కావల్సి వచ్చింది. జైలునుంచి వాలంటీర్లని పంపమని ఆర్డర్స్ వచ్చాయి. మీకిష్టమేనా?"

అప్పుడప్పుడు బ్లడ్ బ్యాంక్ వాళ్ళు వచ్చి రక్తం తీసుకువెళ్ళడం వరకే తెలుసు వాళ్ళకి. రక్తం తీసుకున్న రోజు పని చేయనవసరం లేకుండా పూర్తిగా విశ్రాంతి తీసుకోవచ్చు.

"ఇష్టమే!" మల్లయ్య వుత్సాహంగా చెప్పాడు.

"ఆ రోగం వచ్చి బ్రతికిన వాళ్ళున్నారా?" అడిగాడు ప్రజాపతి. మళ్ళీ ఆలోచించి అడిగాడు- "మమ్మల్నేం చేస్తారు అక్కడ?"

జైలర్‌కి తెలుసు ప్రజాపతి తెలివిగలవాడని.

"మిమ్మల్ని పంపబోయేముందు పూర్తి వివరాలు చెప్పే పంపుతాం. ఈ కిడ్నీ జ్వరం మీ ఒంట్లోకి ఎక్కిస్తారు. దానికింతదాకా మందులేదు. ఆ జ్వరం వచ్చి బ్రతికిన వాళ్ళులేరు. ఏ పద్ధతిలో అది అంటుకుంటుందో తెలుసుకోవడానికి చేసే ప్రయోగాల్లో మిమ్మల్ని వాడుకుంటారు. మీరు బతికి బయటపడితే... ఇక జైలుకి రానవసరంలేదు. లేకపోతే..."

మల్లయ్య, ప్రజాపతి మౌనంగా వుండిపోయారు.

"ఇందులో బలవంతం ఏంలేదు.



మీకిష్టం లేకపోతే మానేయచ్చు"

"డబ్బేమయినా ఇస్తారా?" అడిగాడు మల్లయ్య.

"వెయ్యి రూపాయలిస్తారు ఇన్‌స్టిట్యూట్ వాళ్ళు. మరణిస్తే మీరు ఎవరికి చెప్తే వాళ్లకి మీ తరపున ఇస్తారు"

"వెయ్యి రూపాయలా?" అడిగాడు మల్లయ్య.

"తొందరలేదు. ఆలోచించుకుని ఓ గంట తర్వాత చెప్పండి. వెళ్లండి చెప్పాడు జైలర్.

* * *

మెనీ హేపీ రిటర్న్స్ ఆఫ్ ది డే" చెప్పింది ఉదయ దారిలో.

డాక్టర్ గౌతమ్ ఉదయ ఇంటికి స్వీట్స్, డాగ్ బిస్కెట్స్‌తో వెళ్లాడు.





తర్వాత ఉదయని హోటల్‌కి తీసుకు వచ్చాడు.

"థాంక్స్" చెప్పాడు డాక్టర్ గౌతమ్.

"వచ్చే బర్త్‌డేకి మీకు ఎన్నేళ్లు వస్తాయి?" అడిగింది ఉదయ నవ్వుతూ హోటల్‌లో.

"ఈ బర్త్‌డే కన్నా ఓ సంవత్సరం పెరుగుతుంది వయసు" నవ్వుతూనే బదులు చెప్పాడు డాక్టర్ గౌతమ్ కళ్ళలోకి చూస్తూ.

"మీ వయసు తెలుసుకుందామనుకున్నాను. కాని అడగకూడదుగా?"

"అడిగారుగా! అయినా నేను ఆడపిల్లని

కానుగా వయసు దాచుకోడానికి. మీకన్నా ఎనిమిదేళ్ళు పెద్ద"

"నా వయసెలా తెలుసు మీకు?"

"కనుక్కున్నాను"

"ఎలా?"

"వెరీ సింపుల్. మీ పర్సనల్ ఫైల్ చూసి మీ బర్‌డే, వయసు, కులం, మతం, మాతృభాష మొదలయిన వివరాలన్నీ మీరు చేరిన కొత్తలో చూశాను"

"ఆ తర్వాతే మేరేజ్ ప్రొపోజ్ చేశారా?"

"యు ఆర్ రైట్."

"అన్నట్లు ఇవాళ ఈవినింగ్ ఎడిషన్‌లో మీ ఇంటర్వ్యూ వేశారు"

"దేంట్లో?"

"పేపర్‌లో"

"నేనే పేపర్‌కి ఇంటర్వ్యూ ఇవ్వలేదే?"

"చూడండి మీరే-తెచ్చాను.నాక్కూడా చెప్పకుండా..."

పేపర్ అందుకుని గబగబా చదివాడు. డాక్టర్ గౌతమ్ ఫొటో కూడా ప్రచురించారు ఇంటర్వ్యూలో.

"జర్మ్‌వార్‌ఫేర్ గురించి నాకెప్పుడూ చెప్పలేదే?" అడిగింది ఉదయ.

"మై గుడ్‌నెస్. వుదయం ఎవర్నో మా పక్క ఫ్లాట్ ఆయన తీసుకువచ్చాడు. ఆయన అడిగిన ప్రశ్నలకి సమాధానం చెప్పాను. అంతే! అతను పేపర్‌నించి వచ్చిన రిపోర్టర్ అనుకోలేదు. తెలిస్తే ఇది ప్రచురింపబడేదే కాదు"

"అందుకనే రహస్యంగా వుంచి వుంటాడు తను ప్రెస్ రిపోర్టర్‌నన్న సంగతి"

"మన ఇన్‌స్టిట్యూట్‌ని మామూలు ప్రకారం డైరక్టర్ తప్ప మరెవరూ ప్రెస్‌కి ఇంటర్వ్యూలు ఇవ్వకూడదు. డైరక్టర్ చూస్తే ఇబ్బంది. ఆయన రోజూ చదివే పేపర్ ఇదే"

"రేపు వుదయం చెప్పండి జరిగింది ఆయన అడగకముందే"

డాక్టర్ గౌతమ్ పేపర్ తిరగేశాడు. ఓ వార్త అతన్ని ఆకట్టుకుంది. చదివి చెప్పాడు ఉదయతో.

"పాపం కిడ్నీ ఫీవర్ వచ్చిన ఓ యువకుడు దానికి మందు లేదని తెలిసి, ఆ బాధ పడలేనని చార్‌మినార్ మీద నించి దూకి ఆత్మహత్య చేసుకున్నాడట"

"చదివాను"

"ఇలాంటి వార్తలు ప్రచురించితే మిగతా వాళ్లు అదే మార్గం తొక్కే-అవకాశం వుంది"

"కాసేపు ఈ కిడ్నీ ఫీవర్‌ని పక్కన పెడదాం. ఇంకేమయినా కబుర్లు చెప్పండి. మీ బర్‌డే విష్ ఏమిటి?" అడిగింది ఉదయ.

"రెండు...బహుశ రెండూ మీకు నచ్చవు."

"ఏమిటి ?" కొద్దిగా సిగ్గుగా అడిగింది.

"ఒకటి కిడ్నీ ఫీవర్ వేక్సిన్ కనుక్కోవాలని"

"రెండోది నే చెప్తాను. అమెరికా వెళ్ళి దీని మీద పేపర్‌ని సబ్‌మిట్ చేయాలని అంతేగా ?"

ఇది తప్పు"

"మరేమిటి ?"

"చెప్పనా!"

"చెప్పండి"

"చెప్పేస్తున్నాను."

"ఊఁ"

ఉదయ కనురెప్పలు తాటించింది.

 

"ఏమిటి?" అడిగింది.

"మీకు తెలుసు చెప్పండి"

"వారం కోటా ప్లస్ బర్త్‌డే కోటా ఇవాళే కొట్టేయాలని. అవునా?" కళ్ళు వాల్చేసింది.

ఉదయ బుగ్గలు సిగ్గుతో ఎర్రబడ్డాయి.

"ఊహు"

"ఇంకేమిటి ?"

కళ్ళెత్తి చూసి అడిగింది.

వంగి చెవులో చెప్పాడు డాక్టర్ గౌతమ్ అదేమిటో.

ఉదయ ఇందాకటికన్నా సిగ్గు పడటం పక్క టేబిల్‌లోని ముసలి దంపతులు గమనించారు.

"పెళ్ళయ్యాకే"

"కాదన్నానా? బర్త్‌డే విష్ చెప్పమంటే చెప్పానంతే"

"........."

"బావుందా ?"

"బావుళ్ళేదనను"

"గుడ్ గర్ల్! పెళ్ళయ్యాకటి కోటాలో కొద్ది భాగం ఇప్పుడే అడ్వాన్స్‌గా మంజూరు చేయొచ్చుగా ?"

"పెళ్లయ్యాక కోటా సిస్టం ఉండదుగా"

"దటీజ్ రియల్లీ ఏ వెరీ గుడ్ గర్ల్"

"ఐ నో"

* * *

ప్రజాపతి జైలర్‌తో చెప్పాడు.

"నేను ఒప్పుకుంటున్నాను"

"నువ్వు" మల్లయ్యని అడిగాడు జైలర్.

చెయ్యి పైకెత్తి చెప్పాడు.

"ఒప్పుకుంటాను. ఇలా జైల్లో మగ్గే కంటే అలా చావడం మేలు. బతికితే వెయ్యి రూపాయలు. స్వతంత్రంగా బ్రతకచ్చు" నవ్వాడు జైలర్.

"నేను ఎనభై ఏళ్ళ దాకా బ్రతికాను. కావాలంటే నా ఆయువు రేఖ చూడండి."

కుడి అరచేతిని తెరచి ఓ పొడుగాటి గీత చూపించాడు. మల్లయ్యకి జ్యోతిషంలో కొద్దిగా ప్రవేశం వుందని, ఇతర ఖైదీలకి చెప్పి బీడీలు కొట్టేస్తుంటాడన్న సంగతి కూడా తెలుసు.

"ఇంకో గంటలో వేన్ బయలుదేరుతుంది. ఈలోగా మీ ఎకౌంట్స్ సెటిల్ చేయిస్తాను."

ప్రజాపతి తన సెల్‌కి తిరిగి వెళ్ళాడు. దాని వంక చూసాడు. ఆరేళ్ళనించి ఇదే సెల్‌లో నడుస్తోంది తన జీవితం, జూలో జంతువు బ్రతుకులాగా.

మరణిస్తే పర్వాలేదు.

బతికి బయటపడితే సింహాలు బ్రతకడిక. ఆ తర్వాత మరోసారి పట్టుబడితే జైలుకి రావడమో, వురికంబం ఎక్కడమో జరుగుతుంది. మళ్ళీ యావజ్జీవ కారాగార శిక్ష పడి జైలుకి రావడం జరిగితే ఈ సెల్ మాత్రం వద్దంటాడు తను. ఏడో నంబర్ సెల్ అడుగుతాడు.

ఉరిశిక్ష పడితే, ముడి కాస్త గట్టిగా వేయమని చెప్తాడు.

అంతే!

షావుకారుని చంపి, వాళ్ళ ఇంట్లోని బంగారు నగలు, సొమ్ము కాజేసి, పోలీసులకి లంచాలు పెట్టి తన్ని హంతకుడిగా జైలుకి పంపి బయట ప్రపంచంలో కులుకుతున్న సింహాలుని తన చేతులతో గొంతు పిసికి, కత్తి లేకుండా గోళ్ళతోనే గుండె చీల్చి మరీ చంపుతాడు.

నెమ్మదిగా నవ్వాడు.



కాలితో జైలు గోడని తన్నాడు.
మళ్ళీ నవ్వాడు.
ఈసారి ఇంకా స్త గట్టిగా తన్నాడు.
నవ్వు ఎక్కువయింది.
విరగబడి నవ్వుతున్న ప్రజాపతిని కసిరాడు బయట కాపలా కాస్తున్న సెంట్రీ.
"ఆపు"
"నువ్వాపు" అన్నాడు ప్రజాపతి నవ్వుతూనే.




"ఇంతదాకా మనుషులలో ఎవరూ బతక లేదు కిడ్నీ ఫీవర్ వల్ల. ప్రతీ మనిషి శరీరంలోకి ఎలాంటి వైరస్ క్రిమి ప్రవే శించినా దాన్ని నాశనం చేసే, సరిగా దానికి వ్యతిరేక శక్తి అయిన 'ఏంటీ-బాడీ' వుంటుంది. ఆ కొత్త శత్రువుని అది చంపేస్తుంది. ఒకోసారి వైరస్‌ని చంపలేకపోతాయి ఏంటీ-బాడీస్ వాటి శక్తే అధికంగా వుండటంతో. ఇలాంటి అధిక శక్తి గల రోగాలు తక్కువే! దాంట్లో మొదటిది కిడ్నీ ఫీవర్. ఇది మొదటి స్థానంలో చేర్చదగ్గ వ్యాధి. ఏ వ్యాధికయినా చికిత్స చేసే మందు, ముఖ్యంగా వైరస్ వల్ల వచ్చే వ్యాధులకి, ఆ రోగం వచ్చి బతికిన వాళ్ళ శరీరం లోని రక్తంలో వుండే ఏంటీ బాడీస్‌నించే తయారు చేస్తారు. జంతువుల శరీరంలో కూడా ఇలాంటి రోగ నిరోధక శక్తి వుంటుంది.

మనుషులలోని రోగ నిరోధక శక్తి కన్నా ఈ రోగ క్రిమి శక్తివంతమయిన దని రుజువయింది కాబట్టి ఇతర జంతు వుల మీద ఈ రోగక్రిమిని ప్రయోగించి ఫలితాలు చూడబోతున్నాం"

-బిర్లా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ రీసెర్చ్ కాన్ఫరెన్స్ హాల్‌లో జరిగే ప్రెస్‌మీట్‌లో డైరెక్టర్ వుజ్వల్‌సింగ్ ప్రెస్ రిపోర్టర్స్‌కి చెప్పాడు, ఈ రోగానికి మందు లేదా అన్న ప్రశ్నకి సమాధానంగా.

"ఈ వ్యాధి అకస్మాత్తుగా ఎలా వచ్చింది ? ఈ రోగ క్రిములు కొత్తగా వుద్భవించాయా ? అలా కాకపోతే ఇంత కాలం ఇవి ఎక్కడ దాక్కున్నట్లు ?" అడిగాడు ఓ రిపోర్టర్.

"ఆ ప్రశ్నకి సమాధానం ఇంకా దొరకలేదు. ఈ వైరస్ ఆర్బోవైరస్‌గా మాత్రం అనుమానిస్తున్నాం."

"ఆర్బో వైరస్ అంటే ?" ఇంకో రిపోర్టర్ అడిగాడు

"అంటే కాళ్ళతో నడిచే పురుగుల ద్వారా అంటుకునే వైరస్. బొద్దింకలు, మిడతలు లాంటివన్నమాట."

"రోగాలు ప్రపంచం మొదలయి నప్పటినుంచీ వున్నాయా? లేక మధ్యలో వస్తాయా?"

"మానవ శరీరంలోని ఏ భాగంలో లోపం వచ్చినా అది అధికంగా ఆ భాగానికి పని ఇవ్వడం వల్ల వస్తుంది. ఉదాహరణకి ఆల్కహాల్ తాగే వాళ్ళ లివర్ పాడవుతుంది. సిగరెట్స్ తాగేవాళ్ల వూపిరితిత్తులు, గుండె పాడవుతాయి.

వైరస్ ద్వారా, అంటే బయటనించి




మానవ శరీరంలోకి చొచ్చుకు వచ్చే విష క్రిముల ద్వారా కలిగే అనారోగ్యం కొత్తది కాదు. కాకపోతే వాతావరణం లోని మార్పుల వల్ల, నేటి అణుయుగంలో వివిధ సముద్రాలలోకి, నదులలోకి నెట్టబడే ఫేక్టరీలలో మిగిలే కెమికల్స్ వల్ల కొత్త రోగక్రిములు పుట్టే అవకాశం వుంది. ప్రతీ శతాబ్దంలో కొత్త రోగాలు కనుక్కోబడుతున్నాయి. వాటికి మందులు కూడా కనుక్కోబడుతున్నాయి. కొన్ని రోగాలు నెమ్మదిగా మనిషిని అనారోగ్యానికి దారి తీస్తే మరికొన్ని వేగంగా పని చేస్తాయి."

"కడప జిల్లాలోని నెమలికొండ ప్రాంతంలోనే ఈ వ్యాధి ప్రబలడానికి కారణం?"

"ఆ గ్రామంలోని చుట్టుప్రక్కల గల ఎలుకలని, పురుగులని, ఇతర జంతువులని పట్టుకుని వాటిలో ఈ రోగ క్రిములు కనబడతాయేమో చూడాలి. ఆ ప్రయత్నం ఎల్లుండి నించి జరుగుతుంది, మా ఇన్‌స్టిట్యూట్‌లో డాక్టర్ గౌతమ్ కిడ్నీ ఫీవర్ వైరస్‌ని ఐడెంటిఫై చేశారు కాబట్టి. ఎల్లుండి మా ఇన్‌స్టిట్యూట్ నించే ఓ యూనిట్ వెళుతుంది కడపకి."

"రీసెర్చ్ ఫెసిలిటీస్ వున్నాయా కడపలో?"

"ఊహుఁ మూడు మొబైల్ ఏర్ కండిషన్డ్ లేబొరేటరీలు కూడా వెళుతున్నాయి. ఆ రోగ క్రిమి సోర్స్ కనుక్కోవడానికి ఇదివరకే ఓ డాక్టర్స్ టీమ్ వెళ్ళింది లాంబేలోని హాస్కిన్ ఇన్‌స్టిట్యూట్ నించి. మావాళ్ళు అదనంగా వెళుతున్నారు"

"ఇంతదాకా మన రాష్ట్రంలో ఇరవై వేలమంది పైనే మరణించారు కిడ్నీ ఫీవర్ వల్ల. దీనికి మందును కనుక్కోవటంలో మీరు జాప్యం ఎందుకు చేస్తున్నట్లు?"

"జాప్యం గాదు. పెళ్ళయిన రోజే బిడ్డ కావాలనుకుంటే లభ్యం అవుతుందా? నెల తప్పాక కనీసం తొమ్మిది నెలలయినా ఆగాలి కదూ!" నవ్వుతూ అడిగాడు డైరెక్టర్ వుజ్వల్ సింగ్.

మిగతా రిపోర్టర్స్ కూడా నవ్వారు ఆ సమాధానానికి.

"ప్రస్తుతం ఏ విధంగా ఈ రోగం అంటుకోకుండా కాపాడుకోవచ్చు అనే అంశం మీద పరిశోధన చేస్తున్నారు డాక్టర్ గౌతమ్. మీరు గమనించే వుంటారు. కిడ్నీ జ్వరం రోగులుండే ఇంట్లోని అందరికీ ఈ రోగం రావటం లేదు. కేవలం కొందరికే వస్తోంది. ఎందుకిలా జరుగుతోంది అన్న సంగతి తెలుసుకుంటే ఆ తర్వాత ఏ విధంగా సోకకుండా కాపాడుకోవచ్చు అన్న విషయం గురించగలుగుతాం."

ప్రెస్‌కాన్ఫరెన్స్ పూర్తయ్యాక కిడ్నీ ఫీవర్ రోగక్రిమి ఫొటో రిపోర్టర్స్‌కి ఇచ్చాడు వుజ్వల్ సింగ్.

"ఇరవై వేలమంది పైగానే మరణించడానికి కారణం అయిన కిడ్నీ ఫీవర్‌ని సృష్టించే జీవి ఫొటో ఇది" చెప్పాడు,

"ఇది ఎన్నిరెట్లు పెద్దది చేసి ఫొటో తీసారు?" అడిగాడొక రిపోర్టర్ ఆసక్తిగా.

"యాభై వేల రెట్లు"

ఆ సంగతి ఫొటో వెనకాల రాసుకున్నాడతను.

తర్వాత డాక్టర్ గౌతమ్ చేయబోయే పరిశోధనలలో పాల్గొనే వ్యక్తులని పరిచయం చేశాడు ఉజ్వల్ సింగ్ ప్రెస్‌కి.



అందరూ యావజ్జీవ కారాగార శిక్ష విధించబడ్డ ఖైదీలు.

హంతకులు.

ప్రజాపతి తమకింత పబ్లిసిటీ ఇస్తారని వూహించలేదు. కొద్దిగా భయపడ్డాడు. ఇదంతా పేపర్‌లో రాస్తే, సింహాలు చదివి తన సంగతి కూడా తెలుసుకుంటే జాగ్రత్తపడచ్చు. తన సాహసం వృధా అవుతుంది.

అయిదుగురు ఖైదీలని వరసగా నిలబెట్టి ఫొటోలు తీసుకున్నారు ప్రెస్ ఫొటోగ్రాఫర్లు.

అనేక ప్రశ్నలడిగారు రిపోర్టర్లు.

"మీకు చచ్చిపోతామనే భయం లేదూ?"

"బ్రతికి బయటపడగలమనే ధైర్యం వుంది. మేం చేసే ఈ సాహసం వల్ల మాకు స్వతంత్రం రావచ్చు."

"జైలు కెందుకెళ్ళావ్ ?"

"ఆవేశంలో మా అమ్మని హత్య చేసినందుకు"

"ఇప్పుడు అందుకు బాధపడుతున్నావా ?"

"అవును. అందుకే దీనికి ఒప్పుకున్నాను. వురిశిక్ష వేస్తారనుకున్నాను కాని వెయ్యలేదు. ఓసారి ఆత్మహత్యకి ప్రయత్నించాను జైల్లో."

"ఏమైంది మరి?"

"బతికే వున్నాగా ? తాడు తెగింది నా బలానికి" నవ్వి చెప్పాడు. ఆ నవ్వులో ఎంతో బాధ కనిపించింది రిపోర్టర్‌కి.

"మీ అమ్మని ఎందుకు చంపావ్?"

తలవంచుకున్నాడు సిగ్గుగా. సమాధానం చెప్పలేదు. అర్థం అవటంతో జాలి వేసింది రిపోర్టర్‌కి.

"డాక్టర్ గౌతమ్‌గారు ఎక్కడ ?" అడిగాడొక ఫొటోగ్రాఫర్.

"ఇవాళ ఆయన పుట్టిన రోజు సెలబ్రేట్ చేసుకుంటూంటారు బహుశ. రాత్రి పదింటికి వస్తారు" చెప్పాడు డైరెక్టర్.




ఉదయ తల్లి కలిపిచ్చిన కాఫీ తాగాడు డాక్టర్ గౌతమ్.

హోటల్ బంజారాలో డిన్నర్ ముగించాక ఇద్దరూ కాసేపు హోటల్ ఎదురుగా వున్న చెరువు పక్కన చల్ల గాలికి కూర్చున్నారు.

"మిమ్మల్ని ఇంటిదగ్గర దింపి నేను ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్తాను" చెప్పాడు డాక్టర్ గౌతమ్.

"మా అమ్మగారి కాఫీ మీకిష్టంగా తాగి వెళ్లరుగాని."

"ఉదయా! మన పెళ్ళయ్యాక నువ్వు కూడా కాఫీ మీ అమ్మగారిలా పెట్టాలి. గుబ్బిగింజలు వేయించి, అప్పటి కప్పుడు గ్రైండర్‌లో ఆ గింజలని పొడిచేసి, ఫిల్టర్‌లో కలిపే కాఫీ ఎంత రుచిగా వుంటుంది."

"పెళ్ళంటూ అయితే మీకేది ఎలా ఇష్టం అంటే అది ఆ విధంగా చేస్తాను" నవ్వి అంది ఉదయ.




''థాంక్స్.''

"చిన్న రిక్వెస్ట్."

"ఏదయినా సరే అది గ్రాంటెడ్" డాక్టర్ గౌతమ్ ఉదయ చేతిని తన పెదవుల దగ్గరకి తీసుకుని వేళ్ళని ముద్దు పెట్టుకున్నాడు.

"నన్ను 'నువ్వు' అనండి. 'మీరు' మానేయండి''

''ఎందుకో?"

"మీ గుండెకి ఇంకా దగ్గరగా వద్దామని"

"గుండెకా? మనసుకా?''

"ప్లీజ్ నువ్వు అనండి''

"పెళ్ళయ్యాక అంటాను."

కొద్దిసేపు ఇద్దరూ నీళ్ళమీద నుంచి వస్తున్న చల్లగాలిని పీలుస్తూ మౌనంగా వుండిపోయారు.

"అహల్యా ఎప్పుడైనా కనబడితే ఏమనాలి నేను ? ఇదివరలా 'నువ్వా' లేక 'మీరు' అనాలా ?" అడిగాడు డాక్టర్ గౌతమ్.

"మీకెలా అనాలనిపిస్తే అలా"

"మీ సలహా?"

''మీ సలహా కాదు. 'నీ' సలహా"

"'మీ' నించి 'నీ' గా రావాలంటే పెళ్ళవ్వాలి" తన పెదవులతో ఉదయ చుటివేలిని గట్టిగా పట్టుకున్నాడు.

"నిజం చెప్పండి నన్ను తప్పకుండా వివాహం చేసుకుంటారా ?" అడిగింది ఉదయ.

''ఆగి చూడండి.''

"ఆగి 'చూడండి' కాదు. ఆగి చూడు"

"అందుకు ఒకటే దారి అన్నాగా"

"విడిపోతే ?''

''ఎవరు ?''

''మీరు''

''ఎవరినించి"

''నానుంచి''

''అబ్సర్డ్... ప్రిపోస్టరస్.''

"నన్ను పెళ్ళి చేసుకోవడం తప్పదా-అంటే ?"

"తప్పించుకోవాలనే ఆలోచనే లేదు నాలో. ఉందనుకుంటున్నారా ?"

"ఆడపిల్ల కన్యత్వం తన భర్తవల్లే కోల్పోవాలనుకుంటుంది."

"ఐయామ్ సారీ ... ఆగుదాం ఆరోజుదాకా"

"బాధపడకండి"

"ఛ! దేనికి?"

"........"

"......"

"ఇందాక చెవిలో చెప్పారు. చిలిపిగానా? సరదాగానా ? ఇష్టంవుండా? ఇష్టం లేక? లేక..."

"సీరియస్‌గానే. పుట్టినరోజు కాబట్టి"

ఉదయ మాట్లాడబోయే ముందు కొన్ని నిమిషాలు మౌనంగా ఆలోచిస్తూండిపోయింది. తర్వాత చెప్పింది-

"అయితే ఇవాళ మీ ఇష్టం"

"అంటే... ?"

వంగి తన (కాబోయే) భర్త చెవిలో చెప్పింది ఉదయ.

"మీ ఇష్టం"

"నిజంగా"

"నమ్మకం వుండాలి భర్తమీద అనేక విషయాల్లో. అది ఇప్పటినించే ఏర్పరచుకోవడం మంచిది కదా ?"

మృదువుగా ఉదయ చెయ్యి నొక్కి-చెప్పాడు గౌతమ్-

"భార్య నమ్మకం సంపాదించిన భర్త సుఖపడతాడు"

"ఇవాళ నేను కూడా ఇన్‌స్టిట్యూట్‌కి వస్తాను."

"ఇన్‌స్టిట్యూట్‌కా? ఇవాళ కాదు. ఈ రాత్రి...ఇప్పుడు పదిన్నర దాటుతోంది"

"ఈ ఒక్క రాత్రి మీరేం చేసినా అభ్యంతరం చెప్పను"

డాక్టర్ గౌతమ్ చెప్పాడు–

"నా మీద నమ్మకానికి థాంక్స్. ఇన్ని సంవత్సరాలుగా ఆగాను. ఇంక కొన్ని నెలలు ఆగలేనా? పెళ్ళయ్యేదాకా ఆగ తాను"

* * *

డాక్టర్ సత్యనారాయణలో ఆ ఆలోచన వచ్చి రెండు రోజులు దాటింది. తనని తాను రక్షించుకోడానికి అది మంచి వుపాయం అనుకున్నాడు.

డాక్టర్ గౌతమ్ తనని చంపేలోగా, తనే అతన్ని మట్టుపెడితే? ఆత్మరక్షణకి చంపటం తప్పుకాదు. అయినా తను చంపాడన్న సంగతి ఎవరికీ తెలియదు.

రెండేళ్ళ క్రితం డాక్టర్ సత్యనారాయణ ఇన్‌స్టిట్యూట్‌లో పని చేసే ఓ లేబ్ అసిస్టెంట్‌ని తీసుకుని స్టోర్ రూంకి వెళ్ళాడు. లేబొరేటరీలకి కావలసిన వస్తువులు ఓ పెద్దగదిలో భద్రపరుస్తారు. బాగా పొడుగ్గా వుండే ఆ గదిలో వరసగా వుంటాయి ఇనప రేక్‌లు. అందులో స్టోర్ కీపర్, అతని ఇద్దరు అసిస్టెంట్‌లు తప్ప మరెవరూ వుండరు.

లేబ్ అసిస్టెంట్ శివరంజని అందంగా వుండదు. ఆ కారణంచేత వివాహంకాలేదు.



ముప్ఫై రెండు దాటుతోంది అప్పటికే. శీలం అనే పదం అర్థం మరిచి పోయి చాలా కాలం అయింది.

సత్యనారాయణ కళ్ళు ఆమె తత్వాన్ని పట్టేశాయి. నాలుగైదు సార్లు మాట్లాడాక అతను ఇన్‌డైరెక్ట్‌గా అడిగాడు.

ఒప్పుకుంది.

ఒప్పుకోగానే స్టోర్ రూంలో గాజు సీసాలు వుంచే రేక్ దగ్గర కలుసుకోమని చెప్పాడు. రహస్యంగా అక్కడికి వెళ్ళాడు ఆఫీస్ టైంలోనే. అప్పటికే శివ రంజని ఎదురుచూస్తోంది.

డాక్టర్ గౌతమ్ థర్మామీటర్స్ కోసం ఇండెంట్ ఇచ్చాడు. చాలా రోజులుగా అవి రాకపోవడంతో స్టోర్‌కి తానే వెళ్ళాడు. స్టోర్‌కీపర్ వాటికోసం ఆ రేక్ వైపు వెళ్ళాడు. వెళ్తూ గాజు సీసాలున్న రేక్ దాటాలి.

దాటలేదు. సత్యనారాయణని, శివరంజనిని చూశాడు.

డాక్టర్ గౌతమ్‌ని పిలిచాడు.

గౌతమ్ ఇద్దరినీ తిట్టాడు.

"మీరెలా తిరిగినా అది మీఇష్టం. కాని ఆఫీస్‌టైంని ఇలా వృధాచేయటం సహించలేను. మరోసారి పట్టుపడితే డైరెక్టర్‌కి రిపోర్ట్ చేయాల్సి వుంటుంది."

ఆ సంగతి ఇన్‌స్టిట్యూట్‌లోని అందరికీ స్టోర్‌కీపర్ ద్వారా క్రమంగా తెలిసిపోయింది. అతను తెలివయినవాడు కాబట్టి ఆ లేడీ లేబ్ అసిస్టెంట్ పేరు బయట పెట్టలేదు—ఆమెని అందరూ ఆ దృష్టితో చూడటం ఆమెకి బావుండదని.

మరో వుద్యోగం చూసుకుని వెళ్ళిపోయింది ఆమె. డాక్టర్ సత్యనారాయణ మాత్రం అందరిలో నవ్వుల పాల య్యాడు. డాక్టర్ గౌతమ్ దగ్గర పని చేస్తున్నాడు సత్యనారాయణ అప్పుడు.

డాక్టర్ గౌతమ్ తనకి ఉదయ విషయంలో అడ్డువస్తున్నాడు కాబట్టి ఆ అడ్డు కూడా తొలగించినట్లవుతుంది అనుకున్నాడు. రోజూ కారులో వెళ్ళే ఉదయ, గౌతమ్ రాత్రి లేబ్‌లో వుండిపోతే బస్ ఎక్కబోయింది.

సత్యనారాయణ చొరవగా అడిగాడు ఆమెని—

"బస్ దేనికి? నా బైక్‌లో రండి మీ ఇంటి దగ్గర డ్రాప్ చేస్తాను"

"మీకెందుకండీ శ్రమ?" చెప్పింది ఉదయ.

"శ్రమ కాదు. సంతోషం"

"ఐయామ్ సారీ"

చిన్నగా నవ్వుకున్నాడు డాక్టర్ సత్యనారాయణ ఆ రెండు సంఘటనలు గుర్తువచ్చి.

లేబొరేటరీలోకి నడిచాడు. ఖాళీగావుంది. ఉదయ, గౌతమ్ హోటల్ బంజారాలో వున్నారా సమయంలో. డైరెక్టర్ ప్రెస్ మీట్‌లో వున్నాడు. మిగతా స్టాఫ్ కూడా కాన్ఫరెన్స్ హాల్‌లోని ఆ ప్రెస్‌మీట్ చూడటానికి వెళ్ళారు.

డాక్టర్ గౌతమ్ ఎక్స్‌పరిమెంట్ చేసే గదిలోకి వెళ్ళాడు—గ్లొవ్స్, మాస్క్ మొదలయినవి ధరించి.

తలుపు తెరచుకుని లోపలికి వెళ్ళాక కొద్దిసేపు అక్కడే నిలబడి దీక్షగా చూశాడు ఎలుకల వంక. ఎర్రగా కంది పోయివున్నాయి వాటి నోళ్ళు. మగతగా పడుకుని వున్నాయి.

అడుగులో అడుగు వేసుకొంటూ టేబిల్ దగ్గరకి వెళ్ళాడు. టెస్ట్‌ట్యూబ్‌లో పెరుగుతున్నాయి కిడ్నీ ఫీవర్ వైరస్





క్రిములు.

జేబులోంచి చిన్న సీసా తీశాడు. దాని రబ్బర్ మూత తీసి ఓ పిప్పెట్‌ని అందుకున్నాడు. ఓ టెస్ట్‌ట్యూబ్‌లోని ద్రవం సీసాలోకి వంచాడు సగం దాకా పిప్పెట్ నుపయోగించి.

ఆ సీసాకి రబ్బరు మూతని గట్టిగా బిగించాడు. పిప్పెట్ మామూలు చన్నీళ్లతో కడిగి యథాస్థానంలో వుంచాడు. సీసాని జేబులో వేసుకుని చిన్నగా నవ్వుకున్నాడు.

'బేడ్ లక్ టు డాక్టర్ గౌతమ్' అనుకున్నాడు మనసులో. బయటకి నడిచాడు ఏ విధంగా ఆ రోగ క్రిములని గౌతమ్‌కి అంటించాలాని ఆలోచిస్తూ.

డాక్టర్ సత్యనారాయణ మనసంతా ఆనందంతో నిండిపోయింది- అత్యంత ప్రమాదకరమయిన రోగ క్రిములు తన దగ్గర వున్నాయన్న ఆలోచనతో.




డాక్టర్ గౌతమ్‌కి పరిచయం చేశాడు డైరక్టర్ వుజ్వల్‌సింగ్. ఒక్కొక్కరినీ కరచాలనం చేశాడు ఆ ఖైదీలతో

వాళ్ళంతా మనుషులని చంపినవాళ్లని తెలుసు డాక్టర్ గౌతమ్‌కి. ఆలోచించో, ఆవేశంలోనో ఆ పని చేశారు. ఎమోషన్‌ని కంట్రోల్ చేసుకోవడం చాలామంది మనుషుల తరం కాదు. ఎమోషన్ భౌతికంగా ఆరోగ్యానికి భంగం కలిగిస్తుందని కాలేజీ రోజుల్లోనే చదువుకున్నాడు పుస్తకాల్లో. ప్రత్యేకమయిన ద్వేషం కానీ, ప్రేమ కానీ లేదు ఆ ఖైదీల మీద.

మెడికల్ రీసెర్చ్ ప్రోగ్రెస్‌లో కేవలం వాళ్ళు పరికరాలు మాత్రమే.

గౌతమ్ వాళ్ళతో చెప్పాడు-

"మీకు ఫిజికల్ చెకప్ చేశారు. ఆ రిపోర్ట్స్ చూశాను. ఎవరికీ ఎలాంటి అనారోగ్యం లేదు. ఈ పరిశోధనలో మీకు రోగ క్రిములని వివిధ రూపాలలో ఈ వివిధ వాతావరణాల్లో ఎక్కిస్తాను. కొందరికి క్రిములు హాని చెయ్యలేవు. మీ రక్తంలో మరణిస్తాయి. కొన్ని జ్వరాన్ని కలిగిస్తాయి"

కొందరి మొహంలో భయం చోటు చేసుకుంది. డైరక్టర్‌తో చెప్పాడు-

"హాస్పిటల్‌లో ఎడ్మిట్ చేయబడి మరణించిన అనేకమంది కేస్ షీట్స్ చదివాను. దాదాపు అయిదు వందల మందివి స్టడీ చేశాను. ఈ రోగం వచ్చిన వాళ్లందరికీ అది ఆహారం ద్వారా వచ్చి వుంటుందనుకుంటున్నాను"

ఆగి డైరక్టర్ వంక చూసి చెప్పాడు-

"పురుగుల ద్వారా వ్యాపించే వ్యాధి ఇది. నేను ఉస్మానియా జనరల్ హాస్పిటల్‌లో మరణించిన అయిదు వందలమంది కేస్ షీట్స్ స్టడీచేసి వారిలో ఏభై మంది ఇళ్లకి ఓ టీమ్‌ని పంపించాను. మీరు చూసి అంగీకరించిన ప్రశ్నా పత్రానికి ఆ ఏభై మంది ఇళ్లలోంచి సమాధానాలు లభించాయి. రాత్రి వాటినన్నిటినీ పరిశీలించాను.

"దాదాపు ప్రతి వ్యక్తి భోజనం చేశాకే

ఈ రోగానికి గురయ్యాడు. ఆ ఏభై మంది ఇళ్ళలో హైజెనిక్‌గా వండటం తెలియదు. వాళ్ళు నూట ఏభై - రెండు వందల రూపాయలలోపు ఆదాయం వున్నవాళ్ళు. నిజానికి పేషంట్స్‌లో చాలా భాగం ధనవంతులు కారు.

మరో సంగతి - చాలా ఆశ్చర్యం కలిగించేది గమనించాను. ఈ రోగం అంటుకున్న ప్రతీ వ్యక్తి మాంసాహారి. శాకాహారులెవరూ ఇంతదాకా పేషంట్స్‌లో లేరు.

"శాకాహారుల శరీరాల్లో, మాంసాహారుల శరీరాల్లోని రక్తంలో వుండే లింఫోసైట్స్ శాతంలో, వైట్ బ్లడ్ సెల్స్ శాతంలో చెప్పుకోదగ్గ మార్పు వుండదే?" అడిగాడు వుజ్వల్‌సింగ్.

"ఉండదు. అదే నాకు అర్థం కాని విషయం"

ఆ గదిలోకి అప్పుడే ప్రవేశించిన ఓ వ్యక్తి ఆ మాటలని విన్నాడు. అతను కూడా డాక్టర్ కాబట్టి లింఫోసైట్స్ వ్యాధిని నిరోధించడంలో సహాయ పడతాయని తెలుసతనికి.

అతని పేరు మనోహర్.

''మరో సంగతి గమనించాను లేబొరేటరీలో. నూట మూడు, నూట నాలుగు డిగ్రీల వేడిమికంటే తక్కువ వుష్ణం వున్నచోట కిడ్నీ ఫీవర్ క్రిములు పెరగవు. చావవు. అలాగే వుంటాయి"

డాక్టర్ గౌతమ్ మనోహర్‌ని చూసి గుర్తు పట్టాడు.

"హలో మిస్టర్ మనోహర్! కులాసానా?" అడిగాడు.

బాగా చిక్కిపోయాడతను. నాలుగైదు కిలోల బరువైనా తగ్గి వుంటాడని అనుకున్నాడు గౌతమ్.

"మీరు హ్యూమన్ స్పెసిమన్స్‌మీద ఎక్స్‌పరిమెంట్ చేస్తున్నారని విన్నాను?"

"అవును. మీ కోసం ప్రయత్నించాను మిమ్మల్ని కొన్ని ప్రశ్నలడగడానికి. ఆ వ్యాధి మొదలయింది మీ గ్రామంలోనేగా? కాని మీ జాడ తెలియ లేదు ?"

"అడగండి. ఆ సంగతి తెలిసే వచ్చాను"

"అనిమా రెడ్డి, డాక్టర్ జేమ్స్, దయానా మాంసాహారులా లేక శాకాహారులేనా?"

"అనిమారెడ్డి, డాక్టర్ జేమ్స్ మాంసాహారులు. దయానా గురించి నాకు వివరంగా తెలియదు"

"అనిమారెడ్డి ఆరోజు ఏం భోజనం చేశారో తెలుసా ?"

మనోహర్ కళ్ళలో విషాదం చోటు చేసుకుంది వెంటనే.

"ఆ ముందురోజు నేను నెమలికొండ పెళ్ళయ్యాక మొదటిసారిగా వెళ్ళిన సందర్భంగా మా మామగారు కనకరావుగారు కొన్ని కోళ్ళు, ఓ గొర్రె కోయించారు. గ్రామంలో చాలామంది భోజనానికి పిలిచారు"

"మీరు శాకాహారులా ?"

"చిన్నప్పటించీ నాకు మాంసం అంటే సరిపడదు. ఆరోజు నేను అవి ముట్టుకో లేదు"

''అవి తిన్న ప్రతీవాళ్ళకీ ఈ రోగం వచ్చిందా ?''

"అహ. ప్రస్తుతం అత్తగారి వైపు నుంచి నా కెవరూ మిగలలేదు. వాళ్ళింట్లో అంతా, నా భార్యతో సహా మాంసాహారులే. ఇంతకాలం నా కెందుకీ వ్యాధి రాలేదా అనే నా ప్రశ్నకి సమాధానం

 

తెలిసింది ఇప్పుడు''

"ఇక మీ మీద ఎక్స్‌పరిమెంట్ చేసి ఉపయోగం లేదు. శాకాహారులు స్వత సిద్ధంగా ఈ వ్యాధికి ఇమ్యూన్

"మాంసాహారుల్లో కూడా అందరికీ అంటుకోవడం లేదు కిడ్నీ ఫీవర్. ఇంత డిస్క్రిమినేటింగ్ డిసీజ్ ఇదొక్కటే"

''ఆరోజు మీ మామగారు భోజనంలో వుపయోగించిన జంతువులు ఎక్కడనించి వచ్చాయో తెలుసా?" అడిగాడు వుజ్వల్ సింగ్ మనోహర్‌ని.

''తెలియదు. బహుశా కొనివుంటారు''

"ఎక్కడ?"

"నెమలికొండలో పెద్ద మార్కెట్ లేదు. కడప నించి కొని తెచ్చి వుంటారు. సాధారణంగా కడపకే వెళ్తారు ఏం కావాలన్నా''

"మరో సంగతి గమనించాను. మొగ వాళ్ళలో ఈ వ్యాధి పనిచేసినంత వేగంగా ఆడవాళ్ళలో పనిచేయటంలేదు.దయానాకి, మిగతా ఆడవాళ్ళకి నాలుగు రోజుల తేడాతో రోగక్రిములు పని చేశాయి.అంటే నాలుగురోజులు అవి శరీరంలో దాక్కుని వున్నాయి ఇన్ ఏక్టివ్‌గా" చెప్పాడు గౌతమ్.

"రేపు ఉదయం నన్ను కలవండి. ఈ పాయింట్స్ మరోసారి డిస్కస్ చేసి ప్రెస్ నోట్ విడుదల చేద్దాం. ప్రజల్లో భయం కాస్త తగ్గుతుంది" చెప్పాడు డైరెక్టర్.

ఖైదీలు పారిపోకుండా పదిమంది సాయుధ పోలీసులు గుమ్మం బయట కాపలా కాస్తున్నారు.

డైరెక్టర్ గదిలో బాత్‌రూంకి వెళ్ళాడు ప్రజాపతి. అది అసహజం అని ఎవరికీ అనిపించలేదు. పది నిమిషాలయినా బయటకి రాకపోవడంతో అనుమానం కలిగింది మిగతా ఖైదీలకి.

"ప్రజాపతి పారిపొయ్యాడు"చెప్పాడు మల్లయ్య నవ్వుతూ.

తలుపు తట్టారు మిగతా ముగ్గురు ఖైదీలు.

సమాధానం లేదు.

కొందరు పోలీసులు బయటికి పరిగెత్తారు. మరి కొందరు బాత్‌రూం కిటికీ లోంచి లోపలికి ప్రవేశించి లోపలనించి బాత్‌రూం గడియ తీసి తలుపు తెరిచారు.

"అద్దం లేదు" చెప్పాడు డైరెక్టర్ లోపలకి అడుగు పెట్టగానే. ఎదురుగా గోడ ఖాళీగా వుంది.

"బయటకి తీసుకెళ్ళి దాన్ని పగల కొట్టి ఆయుధంగా వుపయోగిస్తాడు.టవల్ కూడా లేదు చూడండి. దాన్ని చేతికి చుట్టుకుని దాంతో పగిలిన అద్దం పట్టు కుంటాడు" చెప్పాడు పోలీస్.

"తప్పించుకోవడం కష్టం. ఇక్కడ నించి సిటీకి పదిహేను మైళ్ళు. రోడ్డు మీద దొరికిపోతాడు" చెప్పాడు డైరెక్టర్ వుజ్వల్‌సింగ్.

"రోడ్డు ఎక్కడు వాడు. బహుశ ఇక దొరకడు" చెప్పాడు మల్లయ్య నవ్వుతూ.

జైలు దుస్తుల్లో వున్న ఖైదీ పది మంది కంటపడే ప్రయత్నం చెయ్యడు. ముందర సివిల్ దుస్తులకోసం ప్రయత్నం చేస్తాడు.

ప్రజాపతి ఆ సమయంలో సరిగ్గా అదే పని చేస్తున్నాడు. స్టోర్ రూం కిటికీ తలుపు తెరిచి లోపలికి వెళ్ళి లేబ్ అసిస్టెంట్ యూనిఫాం తొడుక్కుంటున్నాడు.

డాక్టర్ గౌతమ్ చెప్పాడు ఖైదీలతో-

"ఒకళ్ళ తర్వాత మరొకరు లోపలికి వెళ్ళండి. ఎడం వైపు బాత్ రూం వుంటుంది. సోప్‌తో స్నానం చేసి, అక్కడ వున్న బట్టలు తొడుక్కొని లోపలికి వెళ్ళండి. లేబొరేటరీలో కుర్చీల్లో కూర్చోండి"

ఆలోచించి చెప్పాడు మళ్ళీ నవ్వుతూ-

"పారిపోదలచుకుంటే ప్రజాపతిలాగా ఈపాటికే ఆ పనిచేసి వుండాల్సింది మీరు. ఇక ప్రయోజనంలేదు. లేబొరేటరీ లోపలికి వెళ్ళినా రకరకాల విష క్రిములు అంటుకుంటాయి. వాటికి మందు లేదు. బాధపడి మరీ చస్తారు"

ఆ లేబొరేటరీ ఇదివరలో వుపయోగించబడలేదు. ఇప్పుడు డాక్టర్ గౌతమ్ వుపయోగిస్తున్న అవసరం కోసమే కట్టబడింది అది పరిశోధనల కోసం.

రకరకాల పరిశోధనలకి ఖైదీలని రప్పించడం కొత్తకాదు. పరిశోధన ఆరంభంఅయ్యాక వాళ్ళు పారిపోకూడదని సరయిన కట్టుదిట్టాలతో కట్టారు దాన్ని.

డాక్టర్ గౌతమ్ కాసేపు తను రాసుకున్న నోట్స్ వంక చూసుకున్నాడు.

తర్వాత టెస్ట్‌ట్యూబ్‌లలోని ద్రవాన్ని ఇంజక్షన్‌లోకి తీసుకునిబోనుల్లో వున్న కుందేలు, కుక్క, కోతికి ఇంజక్షన్ చేశాడు. ఇంజక్షన్ చేసేటప్పుడు అవి కదలకుండా వుండేందుకు బోను గోడని లోపలికి నెట్టాడు. అది లోపలికి చక్రాలమీద కదిలి బోనులోని జంతువుని అంగుళం కూడా కదలకుండా నొక్కిపట్టి వుంచడంతో ఇంజక్షన్ చేయడం తేలికయింది గౌతమ్‌కి.

లేకపోతే ఇంజక్షన్ చేసే సమయంలో అవి కదిలితే వేలుకి గుచ్చుకోవచ్చు సిరంజ్ పొరబాటున.

తన ఊహ నిజమయితే శాకాహారులయిన కుందేలు, కోతికి ఏం కాకూడదు. కేవలం మాంసంతో పెంచబడ్డ కుక్కపిల్లకి ఆ రోగం అంటుకోవాలి. మర్నాటికల్లా ఆ సంగతి తెలుస్తుంది. అప్పుడు కొంతమంది ప్రజలకి ధైర్యం చెప్పచ్చు.

ఆహారం ద్వారా ఈ రోగ క్రిములు శరీరంలోకి ప్రవేశించేటట్లయితే, మంచి నీటి ద్వారా కూడా ప్రవేశించవచ్చు. చల్లటి నీళ్ళలో కొంత ద్రవం కలిపాడు.

"ఈ నీళ్ళు ఎవరు తాగుతారు ?" అడిగాడు.

"నేను"

ఓ ఖైదీ ముందుకు వచ్చి తాగాడు.

"గుడ్. నీ గదిలో విశ్రాంతి తీసుకోవచ్చు నీవు"

నీళ్ళు ఆస్పత్రులలో ఇరవై నిమిషాలు కాగబెడతారు. ఆ రోగ క్రిములు కలిపిన నీటిని ఇరవై నిమిషాల సేపు వెచ్చ చేసి, తర్వాత ఆ నీటి చుక్కలని మైక్రోస్కోప్ కిందవుంచి చూసిన గౌతమ్ ఆశ్చర్యపోయాడు.

ఇంకా బతికే వున్నాయవి. ఎలాంటి వైరస్ అయినా నశించిపోవాలి ఆ వేడికి.

మళ్ళీ చన్నీళ్ళలో కొత్త క్రిములని కలిపి గంటసేపు కాచి చూశాడు గౌతమ్. మైక్రోస్కోప్‌లోంచి మరణించిన రోగ క్రిములు కనబడ్డాయి. ఆ పాయింట్ నోట్ చేసుకున్నాడు- మంచి నీటి విషయంలో తీసుకోవలసిన జాగ్రత్త.

వదబోయకుండా ఆ నీటిని ఓ ఖైదీ చేత తాగించాడు. మరణించాక వాటి శరీరాలు కూడా హాని కలిగిస్తాయా?

ఒక సిసి ద్రవంలో నూట ఏభై క్రిములకంటే ఎక్కువ వుండని టెస్ట్ ట్యూబ్‌లోంచి ఇంజక్షన్‌లోకి ఆ క్వాంటిటీ తీసుకుని మల్లయ్య రక్త నాళంలోకి ఇంజక్ట్ చేశాడు.

ఆఖరి ఖైదీ మొహానికి ఆక్సిజన్ మాస్క్ తగిలించాడు. ముందరే ఆ ఆక్సిజన్‌లో ద్రవం నించి వేరు చేసిన రోగ క్రిములని ప్రవేశపెట్టాడు.

గాలి ద్వారా శరీరంలోని వూపిరి తిత్తులలోకి వెళ్ళే ఆ క్రిమి ఆక్సిజన్ ద్వారా రక్తంలో కలిసి వృద్ధి చెందుతుందా క్షయక్రిమి లాగా? కనుక్కోవాలి.

ఖైదీలలో వుత్సాహం ప్రవేశించింది కొద్దిగా. కొన్ని సంవత్సరాల తరబడి ఒకే రకం రొటీన్‌కి అలవాటయి విసిగిపోయిన వాళ్ళకి ఇది కొత్తగా, సరదాగా వుంది. ఒక ముఖ్యమయిన పరిశోధనలో తమకి భాగం వుందని సంతోషంగా వుంది. తమకేం కాకపోతే స్వతంత్రం లభిస్తుంది.

వాళ్ళందరూ మాంసాహారులే.

* * *

డాక్టర్ గౌతమ్ పుట్టుకతో శాకాహారే అయినా ఎప్పుడైనా మాంసాహారం తీసుకోవడం అలవాటు. ఈసారి పరిశోధన తన మీద తానే చేసుకున్నాడు.

ముందుగా డైరక్టర్‌కి కానీ, ఉదయకి కానీ చెప్పలేదు. చెప్తే అభ్యంతరం చెప్తారని తెలుసు. పరిశోధన పూర్తయ్యాక చెప్పొచ్చు.

లేబొరేటరీలో వండించిన శాకాహారంలో వెజిటబుల్ బిర్యానీలో ఆ ద్రవం బాగా కలిపాడు. తర్వాత స్పూన్‌తో తిన సాగాడు.

తింటూంటే మైక్రోస్కోప్‌లోంచి కనబడ్డ ఆ రోగ క్రిములు గుర్తుకు వచ్చాయి.

అసహ్యం వేసింది.

అయినా కళ్ళు మూసుకుని గబగబా ఆ ప్లేట్‌లోని బిర్యానీని పూర్తి చేశాడు.

* * *

డాక్టర్ సత్యనారాయణ మర్నాడు వుదయం గౌతమ్ గదిలోకి అడుగు పెట్టాడు. ఉదయ పేపర్ తిరగేస్తూ కనబడింది.

"డాక్టర్ ఇంకా రాలేదా?" అడిగాడు.

"రాలేదెందుకో"

ఉదయని పరిశీలనగా చూశాడు సత్యనారాయణ. ఇరవై ఆరు-ఇరవై ఎనిమిది మధ్య వుంటుంది. తెల్లగా కడిగిన ముత్యంలా వుండకపోయినా నలుపుకాదు. కోల మొహం, నల్లని బొట్టూ...

"ఏమిటి చూస్తున్నారు?" పేపర్ లోంచి తలెత్తి చూసి అడిగింది ఉదయ.

"మిమ్మల్నే!"

నవ్వాడు.

"నాకు నచ్చదు"

సత్యనారాయణ కుడిచేత్తో జేబులోని బాటిల్‌ని తడుముకున్నాడు కసిగా. బయటకి నడిచాడు.

పదకొండయినా డాక్టర్ గౌతమ్ రాక పోవడంతో ఆందోళన మొదలయింది ఉదయలో. ఇంటర్నల్ ఫోన్‌లో అప్పటికే మూడుసార్లు అడిగింది డైరక్టర్ పి. ఏ. గౌతమ్ వచ్చాడా అని.

గౌతమ్ ఫ్లాట్‌కి ఫోన్ చేసింది ఉదయ.

ఫోన్ మ్రోగింది చాలా సేపు. కానీ ఎవరూ ఎత్తలేదు. ఇంట్లో లేడా? లేక

ఆ జ్వరం తగిలి లేవలేక అలాగే ఫోన్ చప్పుడు వింటూ పడుకున్నాడా? మనసు పరి పరి విధాలపోయింది.

సత్యనారాయణ పావుగంట తర్వాత వచ్చాడు లోపలికి. ఉదయ ఎదురుగా కూర్చుని నవ్వి చెప్పాడు—

"నాకు తెలుసు డాక్టర్ ఎక్కడ వున్నారో?"

"ఎక్కడ?" అడిగింది ఆత్రంగా.

"క్వారన్‌టైన్ లేబ్‌లో"

ఉదయ మొహంలో రిలీఫ్ కనబడింది అతనికి.

"ఎక్స్‌పరిమెంట్స్ కోసం వెళ్ళారా?"

"అవును. రాత్రి ఓ ఖైదీ పారిపోయాడట. అతని బదులు తనమీద తనే పరిశోధన చేసుకున్నాడు. భోజనంలో ఆ రోగ క్రిములని కలుపుకుని తిన్నారట రాత్రి"

ఉదయ లేచి గబగబా బయటకి నడిచింది.

చిచునవ్వు నవ్వాడు సత్యనారాయణ.

ఇప్పుడు డాక్టర్ గౌతమ్ కడుపులోని క్రిములు అతన్నేం చేయలేకపోతే తన దగ్గర భద్రంగా మరికొన్ని వున్నాయి.

టైప్‌రైటర్ కీ మీద కుడి చేతి వేలుని వుంచి దాంతో అయిదు అక్షరాలు వెదుక్కుంటూ కొట్టాడు— కాగితం లేని ఖాళీ రోలర్ మీద.

డెత్

* * *

మంచం మీద పడుకుని వున్నాడు



గౌతమ్. రోజూ గడ్డం గీసుకోవడం అలవాటు కాబట్టి ఒక రోజు పెరిగిన గడ్డం స్పష్టంగా కనబడింది అతని తెల్లటి చెంపల మీద ఉదయకి.

వాళ్ళిద్దరినీ విడదీస్తూ గాజు అద్దం గోడలా వుంది.

ఆ గాజు పలకమీద వేళ్ళతో కొట్టింది. గౌతమ్ తల తిప్పి ఉదయ వంక చూసి లేచి కూర్చున్నాడు. నవ్వాడు.

ఉదయ కళ్ళలో నీళ్ల తిరగగం గమనించి కళ్ళు తుడుచుకోమన్నట్లుగా సౌంజ్ఞ చేశాడు.

"గౌతమ్ గారికి ఏం కాలేదు. మిగతా నలుగురిలో ఇద్దరికి జ్వరం వచ్చింది" చెప్పాడు అసిస్టెంట్.

"ఆయనెందుకింకా క్వారంటెయిన్‌లో?"

"జ్వరక్రిములు ఆలస్యంగా ఎటాక్ చేస్తాయేమోనని మరో ఇరవైనాలుగు గంటలు వుండదలుచుకున్నారు"

"ఎంతుంది టెంపరేచర్ ?"

"తొంభై ఎనిమిది"

"కొద్దిగా జ్వరం వచ్చిందయితే" భయంగా అన్నది.

"అవును. కాని ఇతర లక్షణాలు కనబడటం లేదు"

"జ్వరంవచ్చిన వాళ్ళని ఏం చేశారు?"

"వాళ్ళ బ్లడ్ సేంపుల్స్ తీసుకున్నారు. డాక్టర్ గౌతమ్ వాటి సంగతి చూసారు"

లేబ్ అసిస్టెంట్ పక్కకి వెళ్ళాక డాక్టర్ గౌతమ్ గాలిలోకి ముద్దు వదిలాడు సంతోషంగా.

ఉదయ బాధగా చూసిందతని వంక. ఇది మొదటిసారి గౌతమ్ తనమీద తనే పరిశోధన చేసుకోవడం. తను ఇంకా అప్పటికి చేరలేదు కాని, ఇన్‌స్టిట్యూట్‌లో చేరాక విన్నది.

ఓసారి ఓ ట్రాపికల్ ఫీవర్ గురించి పరిశోధన చేస్తూంటే ఎలాగో పొరబాటున అది అతనికి సోకింది. రెండు వారాలపాటు ఇన్‌స్టిట్యూట్‌లోని క్వారన్‌టెయిన్‌లో బాధపడుతూ గడిపాడు.

పది పౌన్లు బరువు తగ్గి పదిహేను రోజుల తర్వాత బయటికి వచ్చాడు. తర్వాత కోలుకోడానికి కూడా మూడు వారాలు పట్టింది. నాలుగో వారంలో విడాకుల గురించి కోర్టుకి హాజరవ్వాల్సిందిగా సమన్స్ వచ్చాయి.

డాక్టర్ గౌతమ్‌కి అర్థమైంది ఉదయ ఏ విషయాన్ని గురించి ఆలోచిస్తోందో, ఆమె ముఖ కవళికలను బట్టి.

నవ్వుతూ చూపుడు వేలుతో 'కొడతాను' అన్నట్లుగా సౌంజ్ఞ చేశాడు.

ఉదయ నవ్వింది.




డాక్టర్ గౌతమ్ జ్వరం సోకిన ఇద్దరు ఖైదీల బ్లడ్ సేంపుల్స్ వున్న బాటిల్స్‌ని మైక్రోస్కోప్ పక్కన వుంచాడు. గ్లోవ్స్ తొడుక్కున్న చేత్తో గాజు పిప్పెట్‌ని ఓ బాటిల్‌లోని రక్తంలో ముంచి గాజు స్లైడ్‌మీద ఓ బొట్టు వేసి రెండో స్లైడ్‌తో దాన్ని గాజు పలక మొత్తం అంటేలా

రాసి దాన్ని మైక్రోస్కోప్ కింద వుంచాడు.

మైక్రోస్కోప్ కింద వుండే లైట్ వెలిగించి లైట్‌కీ, గాజు పలకకి అడ్డుగా వున్న కలర్ ఫిల్టర్‌లని ఎడ్‌జస్ట్ చేసి చూశాడు.

ఆ రోగ క్రిములు కనబడ్డాయి. చిన్నవి కనపడకుండా అస్పష్టంగా కనబడ్డాయి. పెద్దవి మాత్రం స్పష్టంగా కనబడ్డాయి. అవి ఆ పేషెంట్ రక్తంలో క్రితంరోజు ఇన్‌జెక్ట్ చేయబడ్డవి.

బ్రతికి లేవవి!

తొమ్మిది రోజులు అవడంతో మరణించి వున్నాయి!

తను వూహించింది నిజమే. వాటి జీవిత పరిమాణం కేవలం తొమ్మిది రోజులే. ఈ తొమ్మిది రోజుల లోపల అవి శరీరంలో ఏ భాగానికి హాని కలిగించకుండా జాగ్రత్త తీసుకోగలిగితే పదో రోజు మనిషి బ్రతుకుతాడు - ఆర్టిఫీషియల్ కిడ్నీ మెషిన్ వుపయోగించక్కర్లేకుండా.

గుండెలోని రక్త నాళాలని, కిడ్నీని అధికంగా నాశనం చేస్తున్నాయి ఇవి. ఈ రెండూ కంట్రోల్ చేయాలి. జ్వరం అధికం కాకుండా చూడాలి.

రెండో ఖైదీ రక్తం కూడా మైక్రోస్కోప్ కింద పరిశీలించాడు. అవే ఫలితాలు.

మొదటి రోజు ఆ జీవి పరిమాణం మైక్రోస్కోప్‌కి అందదు. మర్నాడు చూడాలి.

డాక్టర్ గౌతమ్ కళ్ళు మూసుకుని దీర్ఘంగా ఆలోచించసాగాడుతన పరిశోధన గురించి.

గాలిలో కలిసిన క్రిములు పీల్చడం ద్వారా ఈ రోగం సోకదు. అలా చేసిన తను ఇంతదాకా ఆరోగ్యంగా వున్నాడు.

ఓ గంటసేపు మరిగిన నీళ్ళలో, మరణించిన ఆ క్రిములని వడబోయకుండా ఆ నీటిని తాగినా ఆ రోగ ప్రభావం వుంటుంది. సరాసరి రక్తంలోకి ఇంజెక్ట్ చేస్తే వేగంగా ఆ వ్యాధి అంటుకుంటుంది.

ఆ క్రిములు కలిసిన చన్నీళ్ళు మరగబెట్టకుండా తాగితే ఆ వ్యాధి సోకడానికి కొద్దిపాటి వ్యవధి వుంది-అయిదు గంటల తేడా.

శాకాహారంలో కలిపి తింటే తనకేం కాలేదు. ఎందుచేత ? మాంసాహారం వల్ల రక్తంలో క్లోరోస్టెల్ అధికంగా ఉత్పత్తి అవుతుంది. రక్తంలోని ఆ కొవ్వు పదార్థం గుండెకి చెరుపు చేస్తుంది.

క్లోరోస్టెల్ శాకాహారం తినేవాళ్ళలో కూడా వుంటుందిగా ?

ఈ రెండు రకాల కొవ్వు పదార్థాలలో తేడా వుంటుందా ? ఆ తేడా వల్ల కిడ్నీ ఫీవర్ నశించటమో, జీవించటమో జరుగుతుందా ? ఆ విషయంమీద తర్వాత పరిశోధన చేయాలనుకున్నాడు. కొవ్వే కాకుండా, మాంసాహారం వల్ల మనిషి శరీరంలోకి చేరే ఇతర పదార్థాల గురించి కూడా పరిశోధన చెయ్యాలని మనసులో అండర్‌లైన్ చేసుకున్నాడు.

వ్యాధి ప్రారంభదశలో వుంది. దీన్ని ఇప్పుడే అరికట్టాలి. ఎలా ? వ్యాధి క్రిములు శరీరంలో అభివృద్ధి చెందకుండా ఏం జాగ్రత్త తీసుకోవాలి ? ఎలాంటి జాగ్రత్త ?

ఆ విషయం తెల్సుకోడానికి తను అంతదాకా వైరస్‌మీద చదివిన విషయాలలో పనికి వచ్చే అంశం ఏదయినా వుంటుందా అని ఆలోచించసాగాడు.

పక్కగదిలో జ్వరం రాని పేషెంట్స్ నించిర క్తంతీసుకుంటున్నారు అసిస్టెంట్స్, డాక్టర్ సత్యనారాయణ సూచనల ప్రకారం. ఆ రక్తాన్ని టెస్ట్‌ట్యూబ్‌లలోని టిష్యూలలో కలిపి రోజూ వాటిలో వైరస్ క్రిములేమయినా అభివృద్ధి చెందుతున్నాయేమో తణిఖీ చేస్తూండాలి.

మెడికల్ రీసెర్చ్‌లో ఏదీ స్పష్టంగా తెలిసేదాకా వూహలకి వదలకూడదు.

అందరూ మొహాలకి మాస్క్‌లు, చేతులకి గ్లోవ్స్, ఒంటికి డిస్‌ఇన్‌ఫెక్టెడ్ గౌన్లు వేసుకున్నారు, ఆ శత్రువు తమ మీద కూడా దండయాత్ర చేయకుండా.

డాక్టర్ గౌతమ్ దేన్నీ అదృష్టానికి వదలడు.

*   *   *

డాక్టర్ సత్యనారాయణకి తన అదృష్టం మీద నమ్మకం వుంది. తగిన అవకాశం ఎలా దొరుకుతుందా అనిఆలోచిస్తున్నాడు.

డాక్టర్ గౌతమ్‌కి ఇంతదాకా ఎలాంటి అనారోగ్యం కలగలేదు. మొండి ప్రాణం అయివుండాలి. లేదా గొప్ప కోసం అసలెలాంటి ఎక్స్‌పరిమెంట్ చేసుకోకుండా క్వారన్‌టైన్ గదిలో కూర్చుని వుండాలి.

బయటకి వచ్చాక ఎంత త్వరగా తన కార్యం సాధిస్తే అంత మంచిది. ఆలస్యంగా రోగం బయట పడిందనుకుంటారు.

కాని ఎలా? గౌతమ్ శరీరంలోకి ఎలా ఆ రోగ క్రిమిని ప్రవేశపెట్టాలి?

తను డాక్టరై వుండీ సరయిన ఆలోచన తట్టడం లేదు. ఏ పేషెంట్‌కో అయితే. బి. కాంప్లెక్స్ ఇంజక్షన్‌లో కలిపి ఎక్కించేవాడు.




ఆలోచనగా చూశాడు డాక్టర్ గౌతమ్ గదిలోని అన్ని వస్తువుల వంకా.

సత్యనారాయణ ఏదో ఆలోచనలో వున్నాడని గ్రహించింది ఉదయ. అదేమిటో అంతుబట్టలేదు.

ఉదయ తనని గమనించడం చూసి లేచి బయటకి వచ్చాడు సత్యనారాయణ శివరంజని కనబడింది అకస్మాత్తుగా.

"ఎప్పుడు చేరావ్ ?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఇవాళే"

"ఏం?"

"అక్కడ వుద్యోగం చెయ్యలేను. అందరూ కిడ్నీ ఫీవర్ పేషెంట్స్. మానేసాను."

"వెరీ గుడ్. అసలు నాతో చెప్పకుండా రిజైన్ చేసావ్?" చిరుకోపంతో అడిగాడు.

"అంత అవమానం జరిగాక..."

"ఈసారి అవమానం జరగదులే. మరో కొత్తచోటు కనుక్కున్నాను రా"

"ఊహూ"

"బెట్టు చేయకు రా. ప్లీజ్!"

"ఇప్పుడు కాదు"

"ఇప్పుడే"

"ఎక్కడికి?"

"నే తీసుకెళతాగా నా వెంట రా, ఎవరికీ అనుమానం కలగకుండా."

శివరంజని శరీరం కూడా ఆ అనుభవం కోరుకుంటోంది చాలా వారాలనించి.

పరిశోధన కోసం తెచ్చిన ఏనిమల్స్‌ని స్టోర్ చేసే గది వైపు నడిచాడు సత్యనారాయణ. అతన్ని అనుసరించింది.

రోజూ వుదయం ఒకసారే ఆ స్టోర్ తెరుస్తారు. కావలసిన జంతువులని లేబ్‌లకి ఇచ్చాక మర్నాడు వుదయందాకా పని వుండదు. మధ్యలో రెండుసార్లు వాటికి

మేత పెట్టడానికి మాత్రం తెరుస్తారు ఆ ఏనిమల్స్ గోడౌన్ తలుపు.

ఆ గోడౌన్ తాళం చెవి డాక్టర్ సత్యనారాయణ దగ్గర కూడా వుంది. ఎప్పుడూ జేబులో వుంటుంది. డూప్లికేట్ తాళం చెవుల గుత్తిలోంచి దాన్ని కొట్టేసాడు ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీస్ నుంచి చాలా కాలం క్రితం.

ఇప్పుడది ఉపయోగపడుతోంది.

తను పట్టుబడితే ఏం చెప్పాలో కూడా ఎప్పుడో ఆలోచించి పెట్టుకున్నాడు.

ఓసారి చుట్టూ చూసి జేబులోంచి పర్స్ తీసి అందులోంచి తాళంచెవిని బయటకి తీసాడు. తాళం చెవిని తాళం కప్పలో వుంచి తిప్పాడు. మనసంతా వుత్సాహంగా వుంది.

* * *

చప్పుడవగానే ప్రజాపతి గబగబా కాలుతున్న మంట మీద గోనెపట్టాని కప్పాడు మంట ఆరడానికి.

ఆకలి మండిపోతుంటే ఓ కుందేలుని బోనులోంచి తీసి చంపి, నిప్పుల మీద కాల్చుకుంటున్నాడు. రాత్రినించి బయటకి కదలలేదు. అందులోనే దాక్కుని వున్నాడు.

చటుక్కున లేచి తలుపు పక్కకి వెళ్ళి నిలబడ్డాడు చేతిలోని అద్దం ముక్కతో. కుందేలుని చంపిన రక్తం ఇంకా తడిగా వుంది దానిమీద. తలుపు తెరచుకుంది. ముందు ఓ మగ వ్యక్తి వచ్చాడు. వెనక్కితిరిగి ''రా'' అని పిల్చాడు ఎవరినో.

కొద్దిగా సందేహిస్తూ లోపలకి వచ్చింది ఓ యువతి.

తలుపు మూస్తూ, అప్పుడు చూశాడు సత్యనారాయణ ఎలుకలున్న బోనుల వెనకనించి ఎవరో కదలడం.

ప్రజాపతి చేతిలోని అద్దం ముక్క వీపులో దిగింది. అరవకుండా చేతో అదిమి పట్టాడు సత్యనారాయణ నోరు. మరో రెండుసార్లు పొడిచి వదిలేసాడు.

నిశ్శబ్దంగా నేలమీదకి జారిపోయింది డాక్టర్ సత్యనారాయణ శవం.

శివరంజని నిశ్చేష్టురాలై చూస్తూండి పోయింది.

''అరవక. భయపడక'' నవ్వుతూ చెప్పాడు ప్రజాపతి శివరంజని కొంగుకి రక్తం అంటిన తన చేతిని తుడుచుకుంటూ.

భయంతో వణికిపోతోంది శివరంజని.

''ముందు కుందేలు మాంసం తింటావా లేక నా ఆకలి చల్లారుస్తావా?'' అడిగాడు శివరంజనిని దగ్గరకి లాక్కుంటూ. కాలిన మాంసం వాసన వేసింది శివరంజనికి అతని నోటినుంచి. ఆరు సంవత్సరాలనించి స్త్రీతో అనుభవం లేని ప్రజాపతికి, ఓ స్త్రీ కోసం మరో మొగాడి ప్రాణాలు తీయడంలో అతిశయోక్తి కనబడలేదు. ఎలాగా ఇంకో హత్య-సింహాలుని చంపబోతున్నాడు. రెండు హత్యలకి రెండు సార్లు వురితియ్యలేరు కదా!

"మాటవింటే తర్వాత ప్రాణాలతో వదులుతాను. లేదా ఇంతేసంగతులు"

గొడౌన్ లోపల గడియ పెట్టి శివరంజనిని ఓ మూలకి ఎత్తుకెళ్ళాడు ప్రజాపతి.

ఎలుకలు కీచు కీచు మంటున్నాయి అలజడిగా.

సత్యనారాయణ శవం నేల మీదకి జారుతుండగా ఆ వరిపిడికి అతని జేబులో పగిలిన సీసాలోని రక్తం, సీసాముక్కలు ప్రజాపతి మోకాలు కింద భాగంలో గీచు

కున్నాయి బలంగా.

* * *

తన పరిశోధన ఫలితాలు ఇంటర్ కంలో డైరెక్టర్ వుజ్వల్‌సింగ్‌కి చెప్పాడు డాక్టర్ గౌతమ్ "శాకాహార జంతువులు కుందేలు, కోతి ఆరోగ్యంగా వున్నాయి"

"మిగతా ఇద్దరు ఖైదీల సంగతి?"

"మరో పరిశోధన నిమిత్తం ఆపండి. ఆ తర్వాత తిరిగి జైల్‌కి పంపిస్తే వాళ్లని విడుదల చేసారు."

"పారిపోయిన ఖైదీ గురించి ఇంకా వెదుకుతున్నారు."

నవ్వాడు డాక్టర్ గౌతమ్

"ఇంకా దొరుకుతాడనా?"

"నా పర్మిషన్ లేకుండా ఇంక మీరు ఇలాంటి ఎక్స్‌పరిమెంట్స్ మీ మీద చేసుకోకూడదు" కఠినంగా చెప్పాడు డైరెక్టర్ వుజ్వల్‌సింగ్.

"ఎవరి ప్రాణాలయినా ఒకటేగా?"

"కాని మీకేమయినా అవుతే ఈ పరిశోధన కొనసాగించేది ఎవరు?"

"చాలా మంది డాక్టర్లున్నారు"

"నిజమే.కాని..."

మొహం మీద పొగడటం ఇష్టం లేక ఆగిపోయాడు డైరెక్టర్.

"బ్లడ్ సేంపుల్స్‌లోని క్రిములని వాతావరణంలోని మార్పు ద్వారా నిరోధించగలననుకుంటున్నాను"

"ఎలా?"

డాక్టర్ గౌతమ్ తన దగ్గరేవున్న కొన్ని దిన పత్రికలలోని కటింగ్స్ చూశాడు. అవన్నీ కిడ్నీ ఫీవర్ గురించి వివిధ పత్రికలలో వచ్చిన వార్తలు. ఉదయ వాటిని కట్ చేసి ఓ తెల్ల కాగితాల పుస్తకంలో అతికిస్తోంది. వాటిని మరోసారి జాగ్రత్తగా చదివాడు డాక్టర్ గౌతమ్.

"ఓ చిన్న వార్త ప్రచురించారు మొన్న. ఈ రోగ లక్షణాలున్న ఒకతను ఆఫీస్‌కి వెళ్ళాడు.

అతను ఆఫీసర్ కాబట్టి ఏర్‌కండిషన్డ్ గది వుంది ప్రత్యేకంగా. ఆ గదిలో వున్నంత సేపు జ్వరం నూరు దాటేది కాదు. బయట వాతావరణంలోకి రాగానే జ్వరం పెరిగేదిట.

అదే ఎక్స్‌పరిమెంట్ చేశాను. రోగ క్రిములని అరవై డిగ్రీల వాతావరణంలో వుంచాను. అవి చనిపోలేదు.

కాని నిద్రపోయినట్లుగా కదలకుండా పడి వున్నాయి.

కిడ్నీ ఫీవర్ వున్న మనిషి కూడా బాగా చలిగా వుండే వాతావరణంలో వుంటే జ్వరం పెరగదు. తొమ్మిది రోజుల తర్వాత వైరస్ ఆటోమేటిక్‌గా చచ్చిపోతుంది. శరీరంలోపలి భాగానికి హాని కలగదు.... అఫ్‌కోర్స్ ఇది హేతువాదం మాత్రమే"

"వాతావరణం చల్లగా వున్నా బాడీ టెంపరేచర్ నార్మల్ తగ్గదు కదా?" అడిగాడు డైరెక్టర్.

"కావచ్చు. కాని పెరగదు. అది ముఖ్యం. 104 డిగ్రీల ఫారన్ హీట్‌లో ఇవి అత్యధికంగా శరీరానికి హాని కలిగిస్తాయి. బాగా తేమ వుండే వాతావరణంలో బాడీ టెంపరేచర్ నార్మల్ మించి పెరగదు ... మన దగ్గరున్న ఇద్దరు సబ్జెక్ట్స్ మీద ఆ ప్రయోగం చేయదలచుకున్నాను"

"యు ఆర్ మోస్ట్ వెల్‌కం ఐస్‌కి ఇండెంట్ పంపింది అందుకేనా?"

"అవును. రెండు టన్నుల. ఐస్ని




వుపయోగించి ఏర్‌కండిషన్డ్ గదిని ఇంకా స్త చల్లబరచి తరచు బ్లడ్ సేంపుల్స్ తీసుకుని..."

"గుడ్ లక్ గౌతమ్ !"

"థాంక్స్ సర్"

డైరెక్టర్ వెళ్ళిపోయాక డాక్టర్ గౌతమ్ తను చేయబోయే పరిశోధన గురించి ఆలోచించసాగాడు.

నిమోనియా వ్యాధి ఒక్కటే అతన్ని ఇబ్బంది పెడుతోంది. అంత చల్లటి ప్రదేశంలో తొమ్మిది రోజులుంటే నిమోనియా జ్వరం వచ్చే అవకాశం అధికంగా వుంటుంది.

ఆలోచనలతో అలసి పోయిన డాక్టర్ గౌతమ్ క్రమంగా నిద్రలోకి జారి పోయాడు.




"మీ మీద నాకు గొంతుదాకా కోపంగా వుంది" చెప్పింది.

"గొంతు దాటి పైకి పోనివ్వకు. పెదవుల మీదకి ఆ కోపం పాకితే ముద్దుపెట్టకోవు కొరుకుతావు" నవ్వాడు డాక్టర్ గౌతమ్.

"ఐయామ్ గ్లాడ్ యు ఆర్ బేక్ డాక్టర్"

"ఈ వారం కోటా పెరుగుతుందా ఈ సందర్భంలో ?"

"ఊహుఁ! రెండు నిమిషాలు తగ్గింది. ముందే చెప్దామనుకున్నాను కాని మీరే ఆ సందర్భం తెచ్చారు"

"బ్రతికి వచ్చినందుకా ?"

"కాదు నాతో మాటమాత్రం కూడా చెప్పకుండా ఈ సాహసం చేసినందుకు"

"ఉదయా! డిక్టేషన్ తీసుకోండి"

అరగంట దాకా డాక్టర్ గౌతమ్ తను రాసుకున్న నోట్స్ చూసుకొంటూ కిడ్నీ ఫీవర్ గురించి తన పరిశోధనలో బయట పడ్డ విషయాలన్నీ డిక్టేట్ చేశాడు. మధ్య మధ్యలో తనకే వచ్చే అనుమానాలని మార్జిన్‌లో రాసుకున్నాడు.

"ఆఁ" మీ సబ్‌జెక్ట్స్ ఇద్దరూ బతుకుతారనిపినిస్తోంది" చెప్పింది ఉదయ డిక్టేషన్ పూర్తయ్యాక.

"విష్ మి గుడ్‌లక్."

ఉదయ చేతిలోని షార్ట్ హేండ్ బుక్, పెన్సిల్ బల్ల మీద పడేసి గౌతమ్ భుజాల చుట్టూ చేతులు వేసి అతని బుగ్గల మీదనించి తన పెదవులని సుతారంగా రాస్తూ వాటిని కుడిచెవి దగ్గరకి తీసుకెళ్ళి చెప్పింది సున్నితంగా

"గుడ్‌లక్ టు యు, మైడియర్ హజ్బెండ్"

తర్వాత తన పెదవులని అతని పెదవులకి అందించింది. ఉదయ తన భుజం గిల్లేవరకూ గౌతమ్ అన్నీ మరచి పోయాడు.

సరిగ్గా తొంభై క్షణాల సేపు.

* * *

రెండు రోజులు గడిచాయి.

ఐస్‌తో టెంపరేచర్ కంట్రోల్ చేస్తూ మల్లయ్యని, మరో ఖైదీని ఓ గదిలో వుంచారు. ప్రతీ మూడు గంటల



కోసారి వాళ్ల రక్త నాళంలోకి సిరంజి చొప్పించి రక్తాన్ని బయటకి తీసి మైక్రోస్కోప్‌లో పరీక్షిస్తున్నాడు డాక్టర్ గౌతమ్.

జ్వరం వంద దాటటంలేదు. చెవుల్లో హోరుమనే శబ్దం వినిపించటం లేదు. అరిపాదాలు మండటం లేదు. ముక్కునించి రక్తం కారటం లేదు.



ఎలాంటి వికారం లేదు వాళ్లలో.

తన పరిశోధన చాలావరకు విజయవంతం అయిందని గ్రహించాడు గౌతమ్. ఏంటీ బయాటిక్స్ లాంటి వేమీ ఇవ్వటం లేదు వాళ్ళకి. కేవలం వాతావరణంలోని మార్పు వల్లే జ్వరం కంట్రోల్ అవుతోంది.

తొమ్మిది రోజుల్లో ఇంకా ఏడు రోజులు గడవాలి. రోజులు జరుగుతున్న కొద్దీ శరీరంలో సంపర్కం చెంది పాత క్రిములు కొత్త క్రిములని పుట్టిస్తే వాటి శక్తి అధికం అయి ప్రమాదం జరగవచ్చనే భయం వుంది గౌతమ్‌లో.

డాక్టర్ సత్యనారాయణ విషయమే అంతు పట్టలేదు ఎవరికీ. గౌతమ్‌కి కూడా! ఆ ఏనిమల్స్ గోడౌన్‌కి వెళ్ళాల్సిన అవసరం ఏం వచ్చింది? అసలు డూప్లికేట్ తాళం చెవి ఎక్కడిది ?

శివరంజనిని, సత్యనారాయణని చంపింది పారిపోయిన ప్రజాపతేనని తెలుసు అందరికీ. చాలామంది ఆడవాళ్ళు, కొందరు మొగవాళ్ళు పైకి బాధపడ్డట్టు

కనబడ్డా మనసులో సంతోషించారు.

ఉదయకి వాళ్ళ శవాలు చూడగానే కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. సత్యనారాయణ ఎంత తుచ్ఛుడయినా, కాపురాలు కూల్చే స్త్రీలోలుడైనా, ప్రేమికులని విడదీసే వెధవ అయినా వాడూ మనిషే కాబట్టి ఉదయలో దుఃఖం సహజంగా వుద్భవించింది.

శివరంజని మరణానికి అంతా సమానంగా బాధపడ్డారు.

ఉదయకి, గౌతమ్‌కి అంతు పట్టలేదు. సత్యనారాయణ జేబులోకి ఆ సీసా ఎలా వచ్చింది ? దాంట్లోని రక్తం ఎవరిదో ? పోలీసులు తీసుకెళ్ళారు దాన్ని.

ఆ సీసాలో రక్తం 'ఎ బి' గ్రూప్ రక్తం అని మాత్రం తెలుసుకున్నాడు. దాంట్లోని కిడ్నీ ఫీవర్ క్రిముల కోసం సత్యనారాయణ దాన్ని లేబ్ నించి సంగ్రహించాడని అనుమానించలేదు.




"మీ కోసం ఫోన్" చెప్పింది ఉదయ రిసీవర్ అందించి.

"హలో డాక్టర్ గౌతమ్ స్పీకింగ్"

"......"

"హలో దిసీజ్ గౌతమ్"

"......"

"హలో...హలో...హలో"

"అహల్యని"

డాక్టర్ గౌతమ్ చేతి వేళ్ళు యాంత్రికంగా రిసీవర్ చుట్టూ బిగుసుకున్నాయి. తన ఎక్స్‌టెన్షన్ నంబర్ ఎలా తెలుసు ?

"హలో"

"మీతో మాట్లాడాలి"

రిసీవర్ క్రెడిల్ మీద వుంచాలన్న కోరికని ఎంతో బలవంతం మీద ఆపుకున్నాడు.

"మీతో మాట్లాడాలి"

"నేనిప్పుడు చేసే పని వింటమే"

"ఇలా కాదు. పర్సనల్‌గా"

"ఏ విషయం ?"

"మీ నుంచి దూరం అయ్యాక ఏం పోగొట్టుకున్నానో తెలుసుకున్నాను.నాకు మీరు మళ్ళీ కావాలి"

"పేపర్‌లో నా ఫొటో చూశాకా ? నా గురించి అనేకమంది పొగుడుతూ రాసిన వాక్యాలు చదివాకా ?"

"కాదు. ఇలా ఒంటరి జీవితం నా వల్ల కాదు"

"విడాకులు తీసుకునేది తెలివయిన వాళ్ళు తిరిగి వివాహం చేసుకోడానికే అనుకుంటున్నాను ఇంత దాకా"

"నే రాసిన వుత్తరం అందలేదా ?"

"చదవలేదు"

"ఏం ?"

"ఉత్సాహం లేక"

"......"

"నాకు పనుంది"

"మీరు తప్ప నన్నెవరు చేసుకోరు"

"నేను ఉదయని తప్ప మరెవరినీ చేసుకోను"

"ఉదయ ?"

"సరిగ్గా అయిదు నెలల పన్నెండు రోజుల తర్వాతనుకుంటాను మేం పెళ్ళి చేసుకోబోతున్నాం. కార్డ్ పంపుతాను.




దానిమీద మా ఇద్దరి ఫొటోలు వుంటాయి. చూడాలనుకుంటే స్వయంగా వివాహ మంటపానికి రావచ్చు"

"అయిదు నెలల తర్వాత ?"

"అంతదాకా మేం ఎందుకు ఆగాలో, నీ తరఫున వాదించిన నీ లాయర్‌నడుగు చెప్తాడు"

"మరో మాట చెప్పాలి"

"ఐయమ్ సారీ. పెట్టేస్తున్నాను. ఇంకోసారి ఫోన్ చేస్తే నీ కంఠం వినగానే లైన్ కట్ చేస్తాను. ఆవేశం ఎక్కువ నీకు దేనికయినా. చక్కని గుణపాఠం నేర్చుకున్నావ్"

"ఈ ఒక్క మాట..."

రిసీవర్‌ని బలంగా వుంచాడు క్రెడిల్ మీద.

"ఛీ! ఛీ!" అన్నాడు

"ఎవరయినా ఫోన్ చేసినప్పుడు వాళ్ళు చెప్పేది పూర్తిగా వినటం సభ్యతనుకుంటున్నాను ఇంతదాకా" అన్నది ఉదయ.

"బాస్ పర్సనల్ కాల్ మాట్లాడు తున్నప్పుడు, సెక్రటరీ బయటకి వెళ్ళడం సభ్యతనుకుంటున్నాను ఇంతదాకా" చిరాకుగా బదులు చెప్పాడు గౌతమ్.

"సెక్రటరీని కోటా అడగటం ఇంకా అసభ్యం" అన్నది ఉదయ ఉద్రేకంగా లేచి నిలబడి.

"నీకు కోపం నటించడం చేతకాదు" చెప్పాడు డాక్టర్ గౌతమ్ ఉదయని కొన్ని క్షణాలు రెప్పవాల్చకుండా చూసి.

"ఆమె చెప్పేది వినకుండా ఏమిటి పట్టుదల"

"స్కిప్‌హర్ రిఫరెన్స్ హియరాఫ్టర్. విల్‌యు?" అరిచాడు గౌతమ్ కోపంగా.

"నేను ఆమెకి అడ్డు వస్తున్నానేమో నని మోరల్‌గా భయపడుతున్నాను."

"ఉదయా! మీరు కాదు. అహల్యా భయపడాలి ఇక అలా" చెప్పాడు సౌమ్యంగా.

*  *  *

అయిదు రోజులు గడిచాయి.

ఐసగదిలో, ఏభై డిగ్రీల వాతావరణంలో వున్న మల్లయ్య, మరో ఖైదీలో జ్వరం తొంభైతొమ్మిది డిగ్రీలకి తగ్గింది. అంటే కిడ్నీ ఫీవర్ వైరస్ శరీరంలో ఎదగడం లేదు. నీరసించిపోతోంది.

ఆ ఇద్దరు రోగుల చేతులూ ఇంజక్షన్స్ తరచు గుచ్చటంతో చిల్లులు పడినట్లుగా అయ్యాయి. చలికి వణికిపోతున్నారు. తరచు బ్రాందీ ఇవ్వటంచేత చలికి తట్టుకో గలుగుతున్నారు.

వాళ్ళ రక్తంలో తెల్లకణాలు నాలుగు వేల రెండు వందల దాకా వున్నాయి క్యూబిక్ మిల్లీమీటర్‌కి. కిడ్నీ ఫీవర్‌లో ఓ భాగం అయిన తెల్లకణాల క్షీణత లేదు. నాలుగువేల ఎనిమిదివందలనించి నాలుగు వేల రెండువందలకి దిగడానికి కారణం, అవి వైరస్‌తో పోట్లాడి నశించిపోవడమే.

హెమ్ పేరసైట్స్ అసలు లేనేలేవు.

పేపర్‌లో డాక్టర్ గౌతమ్ పరిశోధన తాలూకు విశేషాలు రోజూ ప్రచురిస్తున్నారు. కిడ్నీ ఫీవర్ ఇంకా 'నంబర్ ఒన్ న్యూస్ ఐటమ్'గానే భావించ బడుతోంది.

రాష్ట్రంలో అరవై వేలమంది పైనే మరణించారు కిడ్నీ ఫీవర్ వల్ల. మిగతా రాష్ట్రాల్లో మరో అరవై వేలమంది దాకా మరణించారు.

డాక్టర్ గౌతమ్ పరిశోధనల ఫలితాలని అనుసరించి ఎవరూ మాంసాహారం తీసుకోవడం లేదు. నీళ్ళని గంటదాకా

మరగబెట్టి ఆ తర్వాత వడబోసి తాగుతున్నారు.

ఈ జాగ్రత్తల వల్ల కిడ్నీ ఫీవర్ తగ్గుముఖం పడుతోంది క్రమంగా.

ఆరో రోజు మధ్యాహ్నం నిమోనియా వచ్చింది ఆ ఇద్దరిలో ఓ ఖైదీకి.

మర్నాడు ఉదయానికల్లా నిమోనియాతో మరణించాడు.

ఇక మిగిలింది మల్లయ్య.

* * *

కాన్ఫరెన్స్ హాల్లో అర్జెంట్ మీటింగ్ ఏర్పాటు చేశాడు డైరెక్టర్ వుజ్వల్‌సింగ్. డాక్టర్ గౌతమ్‌తో సహా, పదిమంది డాక్టర్స్ దానికి హాజరయ్యారు.

గౌతమ్ ఎలాంటి మర్యాదలూ లేకుండా సూటిగా చెప్పదలచుకున్నది చెప్పాడు అందరికీ—

"అరవై డిగ్రీల టెంపరేచర్లో, కిడ్నీ ఫీవర్ రోగి బ్రతకగలుగుతాడనేది ఋజువయింది. ఏడోరోజు ఇవాళ. మల్లయ్యని మామూలు వాతావరణంలోకి తీసుకురావాలా వద్దా అన్నది ఇప్పుడు ప్రశ్న. అదే వాతావరణంలో వుంటే అతనూ మరణించచ్చు. బయటకి తెస్తే కిడ్నీఫీవర్ అధికమయ్యే అవకాశం వుంటుంది. మీ సలహా కావాలి ఈ విషయంలో."

"వైరస్ ఇంకా వుందా శరీరంలో?"

"ఉంది."

డాక్టర్లందరికీ తెలుసు వైరస్ అంత త్వరగా నాశనం కాదని. శరీరం బయట అవి బ్రతకలేవు. కాని శరీరంలో తమ జీవన పరిమితి అయేదాకా బ్రతుకే మొండి జీవాలవి.

హిపాటిటిస్ అనే వైరస్ మైనస్ 80 డిగ్రీల సెంటిగ్రేడ్ వాతావరణంలో, అంటే మంచులో కూడా బ్రతుకుతుంది. ఫినాయిల్‌లో వేసినా మరణించదు.

"వైట్ బ్లడ్ సెల్స్?"

మల్లయ్య బ్లడ్, ఇతర రిపోర్ట్‌ల తాలూకు ఫైల్‌ని అందించాడు. ఒక్కొక్కరూ వాటిని జాగ్రత్తగా పరిశీలించారు.

డాక్టర్ గౌతమ్ తలెత్తి కాన్ఫరెన్స్ హాల్లోని అనేక వైరస్ రోగాలకి మందులు కనుక్కొన్న వాళ్ళ ఫొటోలని చూడసాగాడు. రేబీస్‌కి మందు కనుక్కొన్న పాశ్చర్, స్మాల్ పాక్స్‌కి మందు కనుక్కొన్న జెన్నర్, పోలియో మందు కనుక్కొన్న జోనస్‌సాల్క్, ఆల్బర్ట్ సేబిన్, మీజిల్స్ వేక్సైన్ కనుక్కొన్న ఎండర్స్ మొదలయిన వాళ్ళ ఫొటోలు తగిలించి వున్నాయి వరసగా.

ఆ మహానుభావుల పేర్లు తెలియకపోయినా, అనేక కోట్లమంది ఆ రోగాల నించి నివారణ పొందుతున్నారు. చిన్నప్పుడు టెక్స్ట్‌బుక్స్‌లో చదివి పెద్దయ్యాక మర్చిపోతారు చాలామంది గుర్తుంచుకోవాల్సిన అవసరం ఎవరికీ వుండదు

అరగంటసేపు వివిధ మెడికల్ విషయాలమీద, మల్లయ్య రిపోర్ట్స్‌కి సంబంధించిన అంశాలమీద చర్చలు జరిపారు పదకొండుమంది.

చివరికి అంతా ఏకగ్రీవంగా మల్లయ్యని ఆ మంచుగదిలోంచి బయటకి తీసుకురావాలని నిర్ణయం తీసుకున్నారు.

* * *

కిడ్నీ ఫీవర్ వచ్చాక ఏడు రోజుల పాటు ఎలాంటి అనారోగ్యానికీ గురి కాకుండా జీవించిన మొదటి వ్యక్తి మల్లయ్య.




ఆ సందర్భంగా మంచు గదిలోంచి బయటకి వచ్చే మల్లయ్యని తమ ప్రేక్షకులకి చూపించడానికి హైదరాబాద్ టెలివిజన్ కెమేరా యూనిట్, ఇండియన్ న్యూస్ రివ్యూ యూనిట్, వివిధ పత్రికల ప్రెస్ ఫొటోగ్రాఫర్లు వచ్చారు.

అకస్మాత్తుగా వాతావరణంలో మార్పు తేకూడదు కాబట్టి డాక్టర్ గౌతమ్ ఆ గదిలో వేడి సక్రమంగా పెరిగే జాగ్రత్త తీసుకున్నాడు. మంచు నీటితో నడిచే ఏర్‌కండిషనర్‌ని ఆపేశారు.

ఐస్ గడ్డలని కొద్దికొద్దిగా తరలించసాగారు.

వాతావరణంలో వేడి అరవైనించి తొంభై రెండుకి పెంచడానికి రెండున్నర గంటలు తీసుకున్నారు. వేడి పెరుగుతుండగా మల్లయ్య టెంపరేచర్ పావు గంటకోసారి చూడసాగారు.

టెంపరేచర్ వంద డిగ్రీలు దాటలేదు.

ఏడోరోజు సాయంత్రం ఆరున్నరకి మల్లయ్య ఆ గదిలోంచి బయటకి వచ్చాడు. గాజు తలుపులోంచి కనబడే అతన్ని కెమేరాల్లో బంధించారు. స్వయంగా అతన్ని కలుసుకునే వీలులేదు ఇంకా రెండు రోజులు వైరస్ వుంటుంది కాబట్టి.

ఇంటర్‌కం ద్వారా క్వారన్‌టెయిన్ గదిలోంచి మాట్లాడాడు మల్లయ్య ప్రెస్ రిపోర్టర్స్‌తో.

"జ్వరం వచ్చినట్లుగా వుందా?"

"కొద్దిగా వుంది"

"చెవులు వినబడుతున్నాయికదా?"

"చక్కగా. పాదాల్లో కూడా మంట లేదు"

"ఏ విధమయిన అనారోగ్యం లేదా?"

"లేదు. డాక్టర్‌గారు దగ్గరుండి నన్ను జాగ్రత్తగా చూసుకుంటున్నారు"

"రెండు రోజుల తర్వాత నీకు స్వతంత్రం లభించాక ఏం చేస్తావు?"

"ఇక్కడే పనిచేయదలుచుకున్నాను. డైరెక్టర్‌గారినడిగాను. పని ఇస్తానన్నారు. వాచ్‌మన్ పని. క్వార్టర్స్ కూడా వున్నాయి వాచ్‌మన్‌కి ఇక్కడ"

"నువ్వు ఇదివరలో హత్య చేశావు కదా! దాన్ని గురించేయయినా చెప్తావా?"

గౌతమ్ అడ్డువచ్చాడు.

"ప్లీజ్ ! వ్యక్తిగతమయిన అలాంటి ప్రశ్నలు వద్దు"

"మంచుగదిలో వారం దాకా వున్నావు కదా? ఎలా అనిపించింది నీకు?"

"చలి. విదేశాల్లో అలా వుంటుందిట చలి"

"విదేశాల్లో ఈ వ్యాధి ప్రబలే అవకాశం లేదా?" అడిగాడో రిపోర్టర్ గౌతమ్‌ని.

"చలి దేశాల్లో ఎలాంటి అవకాశం లేదు"

"కిడ్నీ ఫీవర్ వచ్చిన ప్రజల్ని ఈ వాతావరణంలో వుంచితే బ్రతికే అవకాశం వుందా?"

"డాక్టర్ సూపర్‌విజన్‌లో తప్ప స్వతంత్రగా చేస్తే చాలా ఇబ్బందులు ఎదుర్కోవాలి. భరించగలిగేంత చలిలో వుంటే మంచిది. ఇది కిడ్నీ ఫీవర్‌కి మందు కాదు. మందు ఇంకా కనిపెట్టాలి. మందులేదు కాబట్టి, అది చలి వాతావరణంలో మనిషిని ఏం చేయలేదు కాబట్టి ఈ ఎక్స్‌పరిమెంట్ చేశాం" చెప్పాడు గౌతమ్.

"ఐస్ ఖరీదు ఇప్పటికే పెరిగింది" ఓ రిపోర్టర్ నవ్వి అన్నాడు డాక్టర్ గౌతమ్‌తో.

"మరణించే వారి సంఖ్య తగ్గుతుం దని ఆశిస్తాను" జవాబిచ్చాడు.

* * *

మల్లయ్యకి మిగతా వాళ్ళకి వైరస్ ఎక్కించిన రోజునుంచి డాక్టర్ గౌతమ్ ఇన్‌స్టిట్యూట్ లోనే వుంటున్నాడు. బయటకి కదలలేదు. ఓ సూట్‌కేస్‌లో తనకి కావలసిన వస్తువులు, బట్టలు తెచ్చుకున్నాడు. ఇరవైనాలుగు గంటలూ ఆ ఇద్దరు సబ్‌జెక్ట్స్ మీదే దృష్టిని కేంద్రీకరించి, లేబ్‌లో వాళ్ళ బ్లడ్ సేంపుల్స్ పరిశీలిస్తూ వైరస్‌కి చెందిన వివిధ పుస్తకాలు చదువుతూ గడుపుతున్నాడు. రోజుకి ఆరు గంటలని మించి నిద్ర పోవటం లేదు.

ఉదయ డాక్టర్ గౌతమ్ నోట్స్ అయిదు వందల పేజీల పైనే టైప్ చేసింది. డాక్టర్ గౌతమ్ పరిశోధన పద్ధతి దాన్నిబట్టి ఉదయకి కూడా అర్థం కాసాగింది.

అప్పుడప్పుడు ప్రశ్నలు వేసి తెలియని సంగతులు తెలుసుకుంటోంది.

మల్లయ్య మంచు గదిలోంచి బయటకి వచ్చి ఎనిమిది గంటలు దాటింది. డాక్టర్ గౌతమ్‌కి ధైర్యం వచ్చింది. అతను భయపడ్డ మార్పు ఏమయినా జరిగితే వెంటనే జరిగి వుండేది. బ్లడ్ సేంపుల్స్‌లో అభివృద్ధి లేకపోయినా క్షీణించడం లేదు.

ఉదయ లేబొరేటరీనించి వచ్చిన గౌతమ్‌తో అన్నది—

"నన్ను ఇంటి దగ్గర డ్రాప్ చెయ్యరాదూ?"

"ఇప్పుడా? అవతల..."

"గంటా గంటన్నరలో తిరిగి వచ్చేస్తారుగా? ఇన్ని రోజులనించి ఎలాంటి రిక్రియేషన్ లేకుండా ఎంతో శ్రమపడుతున్నారు. మీ ఆరోగ్యం కూడా చూసుకోవాలిగా? ఫరే ఛేంజ్"

"ఆల్‌రైట్ వస్తాను. సత్యనారాయణ, శివరంజనిల చావు, నా సబ్జెక్ట్ చావు... నాకూ పిచ్చిపట్టినట్లుగా వుంది"

"యు ఆర్ ఏ గుడ్ బాయ్"

"బేడ్ బాయ్‌గా మారనా?"

డైరక్టర్‌కి చెప్పాడు గౌతమ్ సిటీకి వెళ్ళి వస్తానని. తన అసిస్టెంట్‌కి చెప్పాడు టెంపరేచర్ పెరిగితే మల్లయ్యకి ఐస్ బేగ్ అరగంటలో అయిదారు నిమిషాలకో సారి పెట్టమని.

ఇద్దరూ బయలుదేరారు.

"మీరు కారు నేర్చుకోవాలి" చెప్పాడు కారు స్టార్ట్‌చేసి. "ఇప్పుడు డ్రయివ్ చేసే ఓపిక లేదు. కాని తప్పదు"

"పెళ్ళయ్యాక"

"దీనికి, పెళ్ళికీ సంబంధం లేదు. పెళ్ళికి మునుపే నేర్చుకోవచ్చు. నిజానికి ఆ తర్వాత డ్రయివింగ్ నేర్చుకోవడానికి ఓ సంవత్సరం దాకానయినా టైం వుండదు"

''డోంట్ బి నాటీ''

''నో డియర్! నిజంగా చెప్తున్నాను"

"అయితే మీరే నేర్పండి''

"డ్రయివింగ్ నేర్పే స్కూల్లో నేర్చుకోండి. ఎవరు చేయాల్సిన పని వాళ్ళే చెయ్యాలి.

''మీరు నేర్పితే నాకు బావుంటుంది''

''అలా అయితే పెళ్ళయ్యేదాకా ఆగాలి''

''పేపర్‌లో మీ గురించి చాలా రాస్తున్నారు''

''అబ్బ! ఆ టాపిక్ వద్దు ఇప్పుడు.

''కారు పక్కన ఆపండయితే''

 

"ఎందుకు ?''

''ఓ నిమిషంసేపు మాత్రమే ఆపాలి సుమా''

''ఓహో''

నవ్వుతూ కారు రోడ్డుపక్కన ఆపాడు

''కరెక్టుగా ఒక్క నిమిషం సేపే''

''నువ్వు ఆ విషయంలో చక్కటి టైం కీపర్‌వి''

''తప్పదు''

"ఎందుకో ?''

''నిమిషంన్నర దాటితే ఆ తర్వాత నా వల్లకాదు. హద్దుల్లో వుండటం మంచిది కదా ?"

''ముద్దుతో హద్దు దాట లేదా ?''

''కాదు. హద్దు ముద్దుతో ఆగి పోయింది ముచ్చటగా'' సరిగ్గా నిమిషం పావు తర్వాత కారు కదిలింది మళ్ళీ.

''భుజంమీద గిల్లటం నేర్చుకున్నారు" చిరుకోపంతో అన్నాడు డాక్టర్ గౌతమ్, భుజం తడుముకుని.

"మీకు అదే సరయిన అలారం''

''నో యు ఆర్ బీయింగ్ నాటీ"




మల్లయ్య ఐసు గదిలోంచి బయటకి వచ్చి, జ్వరక్రిములు ఎక్కించి తొమ్మిది రోజులు గడిచాయి. మల్లయ్య ఆరోగ్యంగానే వున్నాడు.

టెంపరేచర్ 99:7కి దిగింది.

టెంపరేచర్ నార్మల్‌కి వచ్చే దాకా మల్లయ్యని క్వారన్‌టైన్‌లోనే వుంచడానికి నిశ్చయించుకున్నాడు గౌతమ్. బయటకి వస్తే ఇతర వైరస్, బేక్టిరియా, ఫంగస్ లనించి రక్షణ వుండదు.

ఆ రోజు పేరుకు పోయిన వుత్తరాలకి జవాబులు డిక్టేట్ చేయడానికి కూర్చు న్నాడు గౌతమ్.

చాలాభాగం దేశంలోని వివిధ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్స్‌నించీ, పరిచయం లేని డాక్టర్లనించీ కంగ్రాచ్యులేషన్స్ తెలుపుతూ వచ్చిన వుత్తరాలవి.

వాళ్ళందరికీ దైవ కృప వల్లనే తనా పని సాధించగలిగానని, ఆయన సృష్టించిన బీభత్సాన్ని అణచడానికి దేముడు తనని ఎన్నుకున్నాడని తను భావిస్తున్నానని కృతజ్ఞతలు తెల్పుతూ జవాబు డిక్టేట్ చేశాడు.

దాదాపు అయిదు వందల వుత్తరాల దాకా వచ్చాయి. కిడ్నీ ఫీవర్‌తో బాధపడే వాళ్ళ బంధు మిత్రులనుంచి ఎలాగైనా కాపాడమని, ఎంత డబ్బయినా ఇస్తామని మరికొందరు మల్లయ్యకి ఇచ్చిన చికిత్సా విధానం తెలియచేయవలసిందిగా కోరారు.

"వీటన్నిటికీ దేన్నీ వదలకుండా జవాబులు మీరే టైప్ చేసి ఫర్ అని సంతకం పెట్టండి" కొన్ని చదివి ఉదయ వైపు తోశాడు వాటిని.

"ఈ కిడ్నీ ఫీవర్ ఎందువల్ల వచ్చిందో వూహించగలరా?" అడిగింది ఉదయ.

తల అడ్డంగా వూపాడు గౌతమ్.

"ఈజెట్ ఏజ్‌లో రోగాలు అతిత్వరగా ప్రయాణం చేస్తాయి. అందుకే విదేశాలకి వెళ్ళేవాళ్ళు తప్పనిసరిగా టీకాలువేయించుకోవాలనే నియమం పెట్టారు. విమానాలు కనిపెట్టని రోజుల్లో ఏ ప్రదేశంలో రోగం

అక్కడే వుండేది. కాని ఇప్పుడు మనుష్యులతో పాటు వేగంగా ప్రయాణం చేసి ప్రపంచంలోని ఏ ప్రాంతానికయినా చేరుకుంటున్నాయి. ఆఫ్రికాలో, అమెజాన్ తీరంలోని అడవుల్లో వున్నన్ని విష జ్వరాలు మరెక్కడా లేవు. ఎక్కువ భాగం కొత్త రోగాలు అక్కడినించే దిగుమతి అవుతుంటాయి"

"మన ఇన్‌స్టిట్యూట్‌లో ఎవరికీ రాలేదు ఇది?"

"తీసుకోవలసినన్ని జాగ్రత్తలూ తీసుకున్నాంగా?"

ప్రపంచంలో మొదటిసారి ఒకరి గుండె మరొకరికి అమర్చిన సర్జన్ డాక్టర్ క్రిష్టియన్ బెర్నార్డ్ ఫొటో వంక చూశాడు గౌతమ్. అతని రివాల్వింగ్ ఛెయిర్ ఎదురుగా గోడమీద వేలాడుతోంది అది. జీవితంలో తను కూడా అలాంటి అపూర్వమయినదేదయినా సాధించాలనీ, తన ఫొటోగ్రాఫ్ కూడా





వాళ్ళ ఫొటోలతోబాటు మెడికల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్‌లో ప్రదర్శింపబడాలనీ డాక్టర్ గౌతమ్ చిరకాల వాంఛ.

*  *  *

రైలు టిక్కెట్ కోసం క్యూలో నిలబడ్డాడు ప్రజాపతి. గడ్డం పెంచేశాడు. తనని పోలీసులు గుర్తించకుండా వుండటానికి అనేక జాగ్రత్తలు తీసుకున్నాడు. శ్రీకాకుళం వెళ్ళాలి.

సింహాలుని చంపాలి.

అదే కోరిక. అదే ధ్యేయం.

ఎవరయినా పోలీసులు వస్తే తనని

గుర్తించకుండా వుండటానికి అడ్డు పెట్టుకోడానికి ఓ పేపర్ కొన్నాడు. రైల్లో కూర్చున్నాక దాన్ని తిరగేస్తూంటే మల్లయ్య ఫొటో కనబడింది.

ఆశ్చర్యపోయాడు.

కింద రాసింది చదివాడు. పూర్తిగా చదివాక అనిపించింది, తనూ పారిపోకుండా వుంటే బావుండేదేమోనని. ఆ ఆలోచనని మనసులోంచి చెరిపేశాడు వెంటనే.

వాడికి గీత బావుంది.

తనయితే ఖచ్చితంగా చచ్చిపోయి వుండేవాడు.

తనని చూడగానే ఎంత భయపడుతాడు సింహాలు? జేబులోని కత్తిని తడుముకున్నాడు.

* * *

ప్రజాపతి ఒళ్ళంతా నిప్పుల పెనం మీద వుంచినట్లుగా వుంది. రైలు దిగాడు కాని నడవలేకపోయాడు. ఒక్క అడుగు కూడా వేయలేకపోయాడు.

కాళ్ళు నేలమీద పెడితే మంట. రైల్వే స్టేషన్ ప్లాట్‌ఫాంమీద వున్న సిమెంట్ బెంచీమీద పడుకున్నాడు.

చలికి వణుకుతున్నాడు.

తను పారిపోకుండా వుండి వుంటే బావుండేది అనిపిస్తోంది' అతనకిప్పుడు. మల్లయ్యలాగా తనూ ప్రాణాలతో బయటపడి స్వేచ్ఛ సంపాదించేవాడు.

తనని వెంటాడే పోలీసులు... పైగా ఈ జ్వరం.

సింహాలుని చంపితేకాని తన కసి తీరదు. ఇంతదాకా వచ్చి ఇక్కడ ఏం చేయలేకపోతున్నాడు. వంద గజాల దూరంలోనే వుంది ఆ సింహాలు ఇల్లు.

మగతగా కళ్ళు మూసుకున్నాడు.

ప్రజాపతి పరిస్థితి చూసి ఓ రైల్వే అధికారి అంబులెన్స్ కోసం ఫోన్ చేశాడు.

సింహాలు కిడ్నీ ఫీవర్ రోగంతో అతను బిర్లా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ రీసెర్చ్ నుంచి తప్పించుకున్న రోజే మరణించడాన్న సంగతి ప్రజాపతికి తెలియదు.

హాస్పిటల్ డాక్టర్ ప్రజాపతి ఎవరో గుర్తుపట్టాడు – అతని ఫొటో పేపర్లో చూసి వుండటంవల్ల.

* * *

మరో రెండు రోజులు ఎంతో ఆదుర్దాగా గడిచాయి డాక్టర్ గౌతమ్‌కి. మల్లయ్య జ్వరం నూట ఒకటి దాకా పెరిగింది. ఐస్ బేగ్ వుపయోగించిన రెండు గంటల తర్వాత నూరికి దిగింది.

మర్నాడు నార్మల్‌కి వచ్చింది టెంపరేచర్.

కిడ్నీ ఫీవర్ సోకిన రోగి మొదటిసారిగా బ్రతికాడు.

ఆ వార్తని దక్షిణ భారతదేశంలోని పేపర్లన్నీ మొదటిపేజీలో ప్రచురించాయి, మల్లయ్య ఫొటోతో సహా.

పన్నెండో రోజు కూడా మల్లయ్యని క్వారన్‌టైన్‌లో వుంచాడు గౌతమ్. మర్నాడు బయటకుతీసుకువచ్చాడు–ఆఖరిసారి బ్లడ్, యూరిన్, స్టూల్స్ టెస్ట్‌చేసి. రాష్ట్రంలోని చాలా ఆస్పత్రులు గౌతమ్ పద్ధతిని అవలంబించి కిడ్నీ ఫీవర్ పేషెంట్స్‌కి చికిత్స చేయసాగాయి.

హాస్పిటల్‌నించి విడుదల చేయబోయే ముందు మల్లయ్య శరీరాన్ని పూర్తిగా తణిఖీలేసి, ఎక్స్‌రే కూడా తీసి ఫర్వా




లేదనుకుని నిర్ణయించాక విడుదల చేశాడు గౌతమ్.

ఇన్‌స్టిట్యూట్ స్టాఫ్ మొత్తం మల్లయ్యకి హృదయపూర్వకంగా వీడ్కోలు చెప్పారు.

డాక్టర్ గౌతమ్ ఆరోజు మధ్యాహ్నం లంచ్ అవర్‌లో చెప్పాడు ఉదయతో-

"ఆఫీస్‌కి వెళ్ళాక నోట్స్ డిక్టేట్ చేస్తాను. డైరెక్ట్‌గా టైప్ చెయ్యండి''

''అలాగే''

"చాలాకాలం అయినట్లుంది పెసరట్ తిని."

"తమరు దొరికితేగా. ఉదయం దాకా ఎప్పుడు చూసినా బిజీ బిజీ బిజీ.

''అయిపోయిందిగా''

''అయితే ఈ రాత్రి మా ఇంటికి డిన్నర్‌కి రాకూడదూ!''

''రాకూడదనేం లేదు. కాని డైరెక్టర్ వాళ్ళింటికి పిలిచారు డిన్నర్‌కి''

''రేపు వెళ్ళండి వాళ్ళింటికి''

"ఉహుఁ ముందాయన పిలిచారు. రేపు వస్తాను మీ ఇంటికి''

''ఎల్లుండి రండి. లేదా ఎప్పుడు తీరిక దొరికితే అప్పుడు రండి'' కోపంగా అన్నది.

''ఎల్లుండి మెడికల్ అసోసియేషన్ వాళ్ళతో డిన్నర్. కుదిరితే రేపే కుదురు తుంది. లేదా వచ్చేవారం ఇదే మంగళ వారం వస్తాను. ఓకే?''

''ఓకే కాదు. నోకే! మళ్ళి నే పిలిచే దాకా రాకండి. నాకెప్పుడు వీలుంటే అప్పుడు పిలుస్తాను''

లంచ్ తర్వాత అడిగింది ఉదయ టైప్ రోలర్‌లోకి కాగితం ఎక్కించి.

"ఒన్ ప్లస్ ఒన్?''

"ఒకటి చాలు...సరే వుంచండి''

"చెప్పండి''

ఇంగ్లీష్‌లో గబగబా చెప్పసాగాడు డాక్టర్ గౌతమ్.

"మాంసాహారం తీసుకునే మనుష లకే కిడ్నీ ఫీవర్ వైరస్ సోకడానికి కారణం?"

రక్తంలోని క్లోరోస్టైల్‌కి దీనికి ఏమ యినా సంబంధం వుందా?

ఆహారం ద్వారా, మంచినీటి ద్వారా ఈ వ్యాధి క్రిములు మానవ శరీరంలోకి ప్రవేశిస్తాయని తేలింది. ఈ రెండు పద్ధ తుల వల్లే కాకుండా కనీసం ఇంకో పద్ధతి కూడా వుంది. అనిమారెడ్డి నించి డాక్టర్ జేమ్స్‌కి, నర్స్ దయానాకి ఎలా సోకింది? చెమట ద్వారానా? చెమటద్వారా ఈ వ్యాధి క్రిములు బయటకి వస్తాయా?

శరీరంలో ఈ వైరస్ ఎక్కడ అధి కంగా వుంటుంది? ఆడవాళ్ళలో ఆల స్యంగా ఈ వైరస్ పని చేయడానికి కారణం? అంతదాకా శరీరంలో ఏ భాగంలో ఇవి దాక్కుంటున్నాయి? వీటి లెథల్ డోస్ ఎంత?

సాధారణంగా ఓ మనిషినించి మరో మనిషికి అంటుకునే రోగంలో, ఆ రోగ క్రిముల పొటెన్స్ తగ్గుతుంటుంది అది దీనికి కూడా వర్తిస్తుందా? ఎన్నో మని షికి సోకిన ఈ రోగం నిరపాయకర మయింది? మొదటి వ్యక్తిని బాధించి నట్లుగా అంచెలంచెలుగా పాకే ఈ వ్యాధి నా వూహ ప్రకారం ఇరవై నాలుగో వ్యక్తిని బాధించక పోవచ్చు. అందుకనే దేశంలో ఈ రోగం తగ్గుముఖం పట్టిందని నా అభిప్రాయం!

శరీరంలో ఈ వైరస్‌ని ఎదుర్కొనే ఏంటీ బాడీస్‌లేవా? ఉంటే సరయిన

పరిమాణంలో లేవా ? ఈ వ్యాధి ఏ కీట కాల ద్వారా వ్యాపిస్తుంది? అసలిది ఎక్కడ మొదలైంది?...

నాలుగైదు పేజీల పైనే టైప్ చేసింది ఉదయ డాక్టర్ గౌతమ్ చెప్పే ప్రశ్నలు.

"వీటన్నిటికీ సమాధాలు దొరకడానికి చాలా కాలం పడుతుందనుకుంటాను" అన్నాడి ఉదయ టైప్‌రైటర్‌లోంచి ఆఖరి పేజీ తీసి.

"అవును"

కాగితాలని నంబర్ ప్రకారం సర్ది స్టేపిల్ చేసి చెప్పింది ఉదయ.

"అయిదు నెలల్లో చాలా ప్రశ్నలకి సమాధానాలు దొరుకుతాయనుకుంటాను"

"డైరక్టర్‌తో మాట్లాడి ఓ నలుగురు అసిస్టెంట్స్‌ని తీసుకుంటాను. రకరకాల ప్రయోగాలు చేయాలంటే నా ఒక్కడి వల్లా కాదు"

రిసీవర్ అందుకుని డైరక్టర్ నంబర్ తిప్పి పి. ఏ. తో చెప్పాడు తనెవరో. డైరక్టర్‌తో మాట్లాడాలని చెప్పాడు. కొన్ని క్షణాల తర్వాత "వుజ్వల్ సింగ్ హియర్" వినిపించింది.

"గుడీవినింగ్ సర్! దిసీజ్ గౌతమ్! ఇవాళ రాత్రి డిన్నర్‌కి వస్తానన్నాను. అనుకోకుండా ఓ కొత్త ఎక్స్‌పరిమెంట్ చేయాల్సి వచ్చింది. రేపు రాత్రి వస్తాను సర్"

"ఏమిటది?"

"రేపు చెప్తాను ఐయామ్ సారీ సర్ ఐ..."

"ఇట్సాల్ రైట్ మై బాయ్! రేపు రాత్రి ఎక్స్‌పెక్ట్ చేస్తాను మిమ్మల్ని"

"ఈ రాత్రి మళ్ళీ వర్క్ చేస్తారా?" అడిగింది ఉదయ.

"ఊహు. మీ ఇంటికి డిన్నర్‌కి వస్తున్నాను"

"థాంక్స్" సంతోషంగా చెప్పింది.

"యు ఆర్ వెల్‌కం"

"రేపు ఎక్స్‌పరిమెంట్ గురించి డైరెక్టర్ అడిగితే?" అనుమానంగా అడిగింది.

"రేపు రాత్రిదాకా ఏదో ఒకటి ఆలోచించుకోడానికి టైం వుందిగా ?"

"అబద్ధం చెప్తారా?"

"ఏం డాక్టర్లు అబద్ధం ఆడకూడదా?"

"దారిలో ఎలాంటి చిలిపి పనులూ చేయకూడదు"

"నాదో చిన్న కోరిక"

"ఏమిటి?"

"ఇక్కడ కాదు పద. దారిలో చెప్తాను"

"బహుశ నాకు తెలుసు మీరడిగేదేమిటో"

"తెలియదు. పెట్రోల్ సిటీ దాకా రాదు. పెట్రోల్‌బంక్ దారిలో ఒకటే వుంది. నువ్వు గుర్తు చేయకపోతే రాత్రంతా కారులోనే ఇద్దరం"

"నువ్వు ?"

"అవును. నిన్ను ఇంకా మీరేమిటి?"

"పెట్రోల్ బంక్ గుర్తుచెయ్యను"




"మీ కోసం ఎవరో వచ్చారు" చెప్పాడు లేబ్ అసిస్టెంట్ డాక్టర్

గౌతమ్‌తో. గౌతమ్ చేతిలోని టెస్ట్‌ట్యూబ్‌ని స్టాండ్‌లో వుంచి లేచి తన క్యూబికల్‌కి వెళ్ళాడు.

వెంటనే గుర్తుపట్టలేక పోయాడు.

డాక్టర్ మనోహర్!

బాగా చిక్కిపోయాడు. కళ్ళు గుంటలు పడ్డాయి. మొహంలో ఇదివరకటి వుత్సాహం, సంతోషం లేవు.

"హలో మనోహర్! కూర్చోండి" అన్నాడు గౌతమ్ తనని చూసి లేచి నిలబడ్డ మనోహర్‌తో.

గౌతమ్ కూడా కూర్చుని అడిగాడు.

"కులాసానా?"

తల వూపాడు.

"మీ నుంచి ఓ సహాయం కోరి వచ్చాను"

"అడగండి"

కొన్ని క్షణాలు సందేహించి చెప్పాడు మనోహర్.

"మీ దగ్గర సహాయకుడిగా చేరదామనుకుంటున్నాను. కిడ్నీ ఫీవర్ విషయంలో మీతో పాటు పనిచేసి ... నా భార్య వైపు వాళ్ళందరినీ చంపిన ఆ కొత్త శత్రువుని అరికట్టడానికి కృషి చేయాలనుకుంటున్నాను అప్పుడే నాకు మనశ్శాంతి"

డాక్టర్ గౌతమ్ మనోహర్‌లోని ఆవేదనని, ఆవేశాన్ని అర్థం చేసుకున్నాడు.

"తప్పకుండా. నలుగురు అసిస్టెంట్‌లకి ఖాళీలున్నాయి. డైరెక్టర్‌తో మాట్లాడతాను మీ గురించి"

"నిజానికి ఎం. ఎస్. చేసి ఏవేవో సాధించాలనుకున్నాను. కాని ఇప్పుడు నా జీవిత లక్ష్యం నన్ను ఒంటరిగాడిని చేసిన ఆ కిడ్నీ ఫీవర్ అంతం చూడటం"

రెండు గంటల తర్వాత మనోహర్‌కి అపాయెంట్‌మెంట్ ఆర్డర్ ఇచ్చాడు బిర్లా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ రీసెర్చ్ ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్.

*  *  *

"నా ఆఖరి కోరికా? సింహాలుగాడిని చంపుదామనుకుంటే ఆ కొత్త రోగం పొట్టన బడ్డాడు వాడు. నేను మీ చేతుల్లో పడ్డాను. ఇంకా ఆఖరి కోరికేమిటి?" చెప్పాడు ప్రజాపతి తనని వురి తీయబోయే వుద్యోగికి.

"ఏం లేదా? చికెన్ ఫ్రై, చికెన్ బిర్యానీ..."

"ఒకటుంది"

"ఏమిటి?"

"తాడు ముడి గట్టిగా వేయండి" చెప్పాడు ప్రజాపతి చేత్తో తన మెడని తడుముకుంటూ.



(ఆ మధ్య వచ్చిన మెదడు వాపు వ్యాధి ఈ నవలకి బీజం. ఈ నవలలో వర్ణించిన కొత్త రోగానికి చెందిన వైరస్‌ని కనిపెట్టే పద్ధతికి మూలం, ఓసారెప్పుడో చదివిన "ప్రెవెంషెన్ ఆఫ్ క్రూయల్టీ టు ఏనిమల్స్" వ్యాసంలో పేర్కొన్న విషయాలు. ఇందులో వుపయోగించిన మెడికల్ టెర్మ్స్ రక్త పరీక్ష చేయించుకున్నప్పుడు పేథాలజిస్ట్ ఇచ్చే కంప్లీట్ బ్లడ్ పిక్చర్‌లోంచి కొన్ని, మెడికల్ టెక్స్ట్‌బుక్‌లోంచి కొన్ని తీసుకోబడ్డాయి. మిగతాదంతా పూర్తిగా వూహ)

—రచయిత

# అబద్ధం

నేను యమ్మెస్సి పాసయి ఉద్యోగంలో చేరితే మా వూరిలోని ఆంజనేయ స్వామికి అర్చన, అభిషేకం కూడా చేయిస్తానని మొక్కుకుందిట మా అమ్మమ్మ. యమ్మెస్సీ ఫస్టు క్లాసులో అయితే పాసయ్యాను కానీ ఉద్యోగం ఇంకా రాలేదు. అయినాసరే, తన మొక్కు తీరాలని మంకుపట్టు పట్టిందావిడ. నేను తల వంచాను. ఆమెతో గుడిలోకి నడిచాను. అమ్మమ్మ భక్తిగా కళ్ళు మూసుకుంది. నాకు మాత్రం ఆశ్చర్యం, గగుర్పాటు, ఇంకా అలాంటి భావాలెన్నో ఒకేసారి కలిగాయి. ఆచారిగారు-శంకర భగవత్పాదులు విరచించిన హనుమత్ పంచరత్న మాల అపస్వరాలతో చదువుతున్నాడు. జనం తన్మయత్వంతో కళ్ళు మూసుకున్నారు. అప్రయత్నంగా నేను కూడా కళ్ళు మూసుకున్నాను. గతం మదిలో మెదిలింది.

* * *

బియెస్సీ పరీక్షలు రాసి విచ్చల విడిగా తిరుగుతున్నాం. ఊళ్ళో నానా అల్లరి చేసేవాళ్ళం. ఓ రోజు సాయంత్రం మసక మసకగా చీకటి పడుతోండగా ఊరికి దూరంగా వున్న తోట దగ్గర ఓ చెట్టుపై మేం కోతి కొమ్మచ్చి ఆడుతున్నాం. కాసేపటికి ఆట తారస్థాయి చేరుకుంది. రామం దొరక్కుండా చిటారు కొమ్మకు పోతున్నాడు. ప్రసాద్ వాణ్ణి తరుముతున్నాడు. సడన్‌గా రామం చెట్టుమీద నుంచి కాలుజారి కిందనున్న ఓ బండరాయిపై పడిపోయాడు. ప్రాణం లేని ఆ రాయి రామం నెత్తురు తాగేసింది.

మేం భయపడ్డాం. వెంటనే వాణ్ణి చేతులమీద ఎత్తుకుని ఊళ్ళోకి తీసుకొచ్చాం. ఆస్పత్రికి తీసుకువెళ్ళక ముందే రామం శాశ్వతంగా కన్ను మూశాడు. ఆ మర్నాడే నేను మా మావయ్యగారి వూరికి ముందే అనుకున్న ప్రకారం బైలుదేరాను. బస్సు కోసం నిరీక్షిస్తుండగా పెదకాపుగారి తోటలో 'స్వయంభూఆంజనేయ స్వామి వెలిశాడు'



అని జనం చెప్పుకోవడం నా చెవినపడింది.

ఆ తర్వాత అటునుంచే వెళ్ళి యూనివర్సిటీలో చేరాను. నాన్నగానీ, తమ్ముడుగానీ నన్ను చూడటానికి వచ్చినపుడు మా వూరిలో వెలసిన ఆంజనేయస్వామి మహత్మ్యాలను వివరించేవారు. కానీ ఇవేళ అమ్మమ్మతో గుడికి వస్తేనే కానీ, ఈ పరిసరాలు చూస్తేనే కానీ తెలియలేదు-ఆ వేళ రామం రక్తాన్ని తాగిన రాయే ఈ స్వయంభూఆంజనేయ స్వామి అని.

* * *

"ఏమిట్రా పిచ్చినాగన్నా – గుడిలోకి

 

రానన్నావు. వచ్చాక పూజ అయి పోయినా కదలడం లేదు. చూడు, మరి స్వామివారి మహత్యం" అంటూ అమ్మమ్మ నన్ను కదిపింది. గుడిలోంచి బైటకువస్తూ నాలో నేను గొణుక్కున్నాను 'ఈ దేవుడు అబద్దం. ఈ పూజలు అబద్ధం. ఈ మహత్యం అబద్ధం!'

—కొంపెల్ల విశ్వం

# సినిమా కథ

ఒక చిన్న కవి ఒక పెద్ద కథ రాశాడు.

ఆ కథకు సంబంధించిన కాగితాలు తీసుకొని మద్రాసు వెళ్ళి తనకు దూరపు చుట్టమైన ఒక నిర్మాతను కలుసుకున్నాడు. ఆ కథతో సినిమా తీయమని వేధించాడు.

ఆ పోరు పడలేక "సరే,ఇరవై రోజుల తరువాత రా! ఏ విషయం చెప్తాను" అన్నాడు నిర్మాత.

ఇరవై రోజులూ ఇరవై యుగాలుగా గడిచాయి ఆ కవికి. ఇరవై ఒక్కటో రోజు ఉదయం ఆరు గంటలకు వెళ్ళి తలుపు తట్టాడు.

నిర్మాత నిద్ర కళ్ళతో తలుపు తీసి "నీ కథ సిన్మాకి పనికిరాదు" అన్నాడు.

కవికి గుండె పగిలినంత పనైంది.

"ఎలాగైనా సరే, కొద్ది భాగమైన నా కథ సినిమాలో కనిపించాలి" అని పేచీ పెట్టాడు.

కవి పోరు పడలేక నిర్మాత సరే నన్నాడు.

కొన్నాళ్ళకు ఆ సినిమా రిలీజ్ అయింది. చిన్నకవి మొదటి రోజే వెళ్ళి చూశాడు. తన కథకు సంబంధించింది అందులో ఏమీ కనిపించలేదు. వెంటనే నిర్మాత వద్దకు పరుగు పరుగున వెళ్ళాడు,

"ఏమయ్యా! నువ్వు నా కథను గురించి చెప్పిందేమిటి? చేసిందేమిటి?" అని గట్టిగా అడిగాడు.

"అవునయ్యా! నీవేం చెప్పావు? నీ కథ ఎక్కడైనా సరే సినిమాలో కని పించాలన్నావు. మరి నీ కథను సినిమాలో వుపయోగించాం కదా!" అన్నాడు నిర్మాత.

"ఏ సీనులో?" అన్నాడు కొంచెం ఆశతో.

"అదేనయ్యా! హీరో మొదట ఆఫీసు




నుండి వచ్చేటప్పుడు వెంట ఒక ఫైలు తెస్తాడు, గుర్తుందా?" అన్నాడు.

"ఉంది" అన్నాడు కవి.

"మరి, ఆ ఫైలులో వుంది ఎవరి కాగితాలనుకున్నావ్!" అన్నాడు నిర్మాత గంభీరంగా.

—పగడాల జనార్ధనరావు.

# చిల్లర

పల్లెటూరి పరంధామయ్య డబ్బు తీసు కుందామని బాంకుకి వెళ్లాడు. ఫారం నింపి కౌంటర్లో యిచ్చాడు. పావు గంట కూచున్నాక అతని వంతు వచ్చింది. కౌంటర్‌లోకి వెళ్ళాడు పరంధామయ్య.

రెండు వేలరూపాయలకి గాను, ఇరవై వంద నోట్లు యివ్వబోయాడు కాషియర్. పరంధామయ్య ఆ నోట్లు పుచ్చుకో లేదు.

"చిల్లర కావాలి. చిల్లరివ్వండి" అన్నాడు. కేషియర్ వంద నోట్లు బాక్స్‌లో పడేసి, పది నోట్ల కట్టలు రెండు తీసియివ్వ బోయాడు.

మళ్ళీ అభ్యంతర పెట్టాడు పరంధా మయ్య, "వద్దొద్దు ... చిల్లర ... చిల్ల రివ్వండి" అంటూ. కేషియర్‌కి చిర్రెత్తింది. అయినా తమాయించుకుని, అయిదు రూపాయల కట్టలు మూడు, రూపాయి కట్టలు అయిదూ-సరికొత్తవి-లోపలినించి తెచ్చి యిచ్చాడు.

ఈసారి పరంధామయ్యకి చిర్రెత్తింది! "ఏమిటయ్యా! చెబితే అర్థంకాదా నీకు? చిల్లరివ్వ మంటుంటే నోట్లు తెచ్చి చూపిస్తావేమిటి? ఏనోట్లయితే నాకేమిటి- అన్నీ రూపాయల నోట్లే కదా? నాకు చిల్లర కావాలి...చిల్లర... అన్నాడు మరింత వత్తి పలుకుతూ.

కాషియర్ సహనం గాలిలో కల్సి పోయింది.

"ఏం చిల్లరయ్యా? రెండు వేల రూపా యలకి ఇంతకనా చిల్లరెలా గిస్తాను?" అంటూ అరిచాడు.

"నా డబ్బు నాక్కావాలన్నానా? నీ సొమ్ము అడిగానా? అలా గింజుకు పోతావేం? నాకీ నోట్లువద్దు-అంతా చిల్లరే కావాలి!" అంటూ మరింత భీష్మించాడు పరంధామయ్య.

వ్యవహారం ఏజంటు దాకా పోయింది. ఏజంటుగారు పరంధామయ్యని అనున యంగా అడిగారు-

"ఏమిటండీ? ఏం చిల్లర కావాలి మీకు? రెండు వేల రూపాయలకీ నాణాలు కావాలా? అది అంత తేలిక కాదే! అయినా



ఎందుకు మీ కంత పట్టింపు?" అంటూ.

"చూడండి ఏజంటు బాబూ! నేను పల్లెటూ రోడినైనా, దేశంలో జరుగుతున్న యవ్వారాలన్నీ తెల్సుకుంటున్నోడినే! ఈ మధ్య రూపాయి విలువ రోజు రోజుకీ పడిపోతోందని పేపరోళ్లు రాస్తూనే వున్నారట! మీకు మాత్రం తెలీదా? అందుకే, నాకురూపాయిలొద్దు రొక్క మంతా పైసల్లోనే యివ్వండి. పైసవిలువ పడిపోదు గదా!" అన్నాడు గడుసుగా నవ్వి.

ఆశ్చర్యంతో ఏజంటుగారి కళ్లు బంది

చక్రాలంతయిపోయాయి!

-పి. వి. ఆర్. శివకుమార్

## లాటరీ టికెట్

జోగినాథానికి లాటరీలో ప్రయిజొచ్చిం దని తెలిసి వెళ్ళాను అతన్ని అభినందించ డానికి.

నాకు ఆశ్చర్యంగా వుంది. ఎందుకంటే జోగినాథానికి లాటరీ పిచ్చి లేదు. అసలు ఏ పిచ్చీ లేదు. డబ్బుకీ, అతనికీ లంకె.



ఓ రూపాయి ఖర్చు పెట్టాలంటే వంద సార్లు ఆలోచిస్తాడు. ఓ ఐదైనా గిడితేకాని రూపాయి ఖర్చు పెట్టడు. ఓ సరదాలేదు. షికారు లేదు. ఎప్పుడూ డబ్బు యావ తప్ప మరో వ్యసనం లేదు. అటువంటి మనిషి లాటరీ టిక్కెట్టు ఎలా కొన్నాడా అని ఆశ్చర్యపోయాను. ఇలా రకరకా లుగా ఆలోచిస్తూ అతని ఇల్లు చేరాను.

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. మనిషిలో ఏకోశానా సంతోషం, ఆనందం కోసినా కనిపించడం లేదు. వీధరుగుమీద వాల్చిన నులక మంచం మీద మోకాళ్ళలో తల దూర్చుకుని కూర్చున్నాడు. కళ్లు ఎర్రగా వున్నాయి. మొహం కళావిహీనంగా అప్పుడే దగ్గిర బంధువుని శ్మశానాని కప్పజెప్పి వస్తున్నవాడి మొహంలా వుంది. నాకు చిరాకెత్తి - "అదేమోయ్! నిన్నే కదా ఫస్ట్ ప్రయిజ్ కొట్టేవు. ఇంకా ఎందుకా ఏడుపుగొట్టు మొహం ?" అన్నాను కసిగా.

"ఏం చెప్పమంటావ్ భాయి ! ఆ రాష్ట్రం లాటరీ టిక్కెట్లు ఒకటి కాదు... రెండు కొన్నాను. ఒకదాని మీద లక్ష వచ్చిందనుకో. కాని ఈ రెండోది వేస్ట్ అయిపోయింది కదా !" అని బావురు మన్నాడు.

—వి. చంద్రశేఖర్

## కాపీ

"అయితే మావాడు ఆ అమ్మాయి పేపరుని చూసి కాపీ చేశాడంటారు."

"ఔనండీ... రాజు ప్రతి అక్షరం సుజాత పేపరుని చూసి రాసేశాడు" అన్నాడు స్కూలు మాస్టరు.

రాజు ఫోర్ర్ క్లాస్ చదువుతున్నాడు. తల్లిదండ్రులకు ఒక్కడే కొడుకు. అందుకే అతి గారాబం చేసి పిల్లవాడిని కాస్తా పాడుచేశారు. మొన్న పరీక్షల్లో పక్కన కూర్చున్న సుజాత పేపరుని చూసి రాసేశాడు. మాస్టరుకి కోపమొచ్చి రాజు తండ్రికి కబురుపెడ్తే- తండ్రి వచ్చి కొడుకునే సమర్థించడం మొదలు పెట్టాడు.

"చూడండి మాస్టారూ ! మా వాడు ఆ అమ్మాయి పేపరుని చూసి రాసాడని

ఎందుకనుకోవాలి ? ఆ అమ్మాయి మా వాడిది చూసి రాసుండొచ్చు కదా !" అన్నాడాయన లాజికల్‌గా.

"చూడండి సార్... సుజాత ఎప్పుడూ క్లాసు ఫస్టే... ఆ అమ్మాయి ఇంకొకరిదాన్లో చూసి కాపీ చేయదు" అన్నాడు.

రాజు తండ్రి "చూడండీ! మా వాడూ, ఆ అమ్మాయి ఒకే పుస్తకం చూసి చదివుంటారు. అందుకే ఒకేలా రాసుంటారు" అన్నాడు వదలకుండా.

"అయితే నేను మిమ్మల్ని ఊరికినే




పిలిపించాననుకున్నారా ? చూడండి ఈ ఆన్సరు పేపర్లు" అని మాస్టరు ఆన్సర్ పేపర్లు అందించాడు.

మొదటి నాలుగు సమాధానాలు ఇద్దరి పేపర్లోనూ ఒకేలా ఉన్నాయి.

ఐదో ప్రశ్నకు సుజాత "నాకు రాదు" అని రాసింది. అదే ప్రశ్నకు రాజు "సుజాతకు లాగే నాకూ రాదు" అని రాశాడు.

మరి రాజు తండ్రి మాట్లాడలేదు.

# మోసం

సుబ్బరాజు, కామరాజు బిజినెస్ పార్ట్నర్లు. తమ కంపెనీలో ఇద్దరూ ఓ రోజు కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ కాఫీలు తాగుతుంటే, సుబ్బరాజు పక్కకు పడిపోయాడు.

వెంటనే అతడిని హాస్పటల్‌లో చేర్చారు. డాక్టర్లు పరీక్షించి మరో రెండు మూడు గంటలకంటే ఎక్కువ బ్రతకడన్నారు.

ఇది తెలిసి సుబ్బరాజు బయటనున్న కామరాజుని లోనికి రమ్మన్నాడు. గదిలో ఉన్నవారిని బయటకు వెళ్ళమన్నాడు.

తర్వాత కామరాజుతో "చూడు కామరాజూ! నీకు తీరని ద్రోహం చేశాను. నీకు తెలీకుండా కంపెనీ నుండి పాతిక వేలు మాయం చేశాను" అన్నాడు.

"పర్వాలేదులే సుబ్బరాజు... నువ్వు కాసేపు రెస్టు తీసుకో" అన్నాడు కామరాజు గద్గద స్వరంతో.

"అలా కాదు. మరి కాస్త చెప్పనివ్వు... మన కంపెనీకు మొన్న వచ్చిన ముడిసరుకులో సగం దొంగతనంగా అమ్మేయించాను"

"పర్వాలేదు గానీ... ఇప్పుడవన్నీ ఎందుకు ?''

"అదికాదు, మరణించే ముందు మరో విషయం చెప్పి పోనీ—మనిద్దరి పేరనున్న బాంకు ఎకౌంటు నుండి, దొంగ సంతకాలు చేసి లక్ష రూపాయలు కాజేసాను...నన్ను నువ్వు క్షమించగలవా?"




సుబ్బరాజు దీనంగా అడిగాడు.

"ఆ విషయానికి వస్తే, నువ్వే నన్ను



క్షమించాలి'' కామరాజు అన్నాడు.

"అదేంటి ?" సుబ్బరాజు అడిగాడు.

"అవును... నువ్వివాళ ఈ స్థితిలో ఉండటానికి కారణం నేనే. నీవు తాగే కాఫీలో ఎప్పుడో స్లో పాయిజన్ కలిపాను..'' అన్నాడు కామరాజు నెమ్మదిగా.

—పినిశెట్టి శ్రీనివాస్

# నేనెవరో తెలుసా?

ప్రముఖ రంగస్థల నటుడొకాయనకి భారీ సన్మానం జరుగుతోంది. చిల్లరనటులు, బడా నటులు, బడాయి నటులు, అమెచూరిష్ నటులు మొదలైన వాళ్ళతోనూ, అసంఖ్యాక అభిమాన ప్రేక్షకులోనూ హాలంతా కిటకిటలాడుతోంది. పత్రికా విలేఖరు రకరకాల ఏంగిల్స్‌లో ఫొటోలు 'క్లిక్' 'క్లిక్'మని తీసేస్తున్నారు.

ఎక్కడ చూసినా సన్మాన సంరంభం కనిపిస్తోంది.

ఇహ సన్మానం ముగింపుకి వస్తోందనగా హాలులో మొదటి వరసల్లో కూర్చున్న ఒకాయన -

"ఎవడండీ నటుడికటువేపుకూర్చున్న పెద్ద మనిషి? ఎప్పుడూ చూసిన గుర్తు లేదే" అన్నాడు.

"ఆయనే ఫలానా! తెలీదూ! ఆయనిప్పుడు మంత్రి ?" ఎవరిదో జవాబు పక్కనించి.

"వీడా? గొరిల్లాలా మొహంవాడూను. మొన్న జరిగిన ఆందోళనలో వందమంది చావుకి కారకుడు యీ చుంచు మొహం వాడే కదూ ?" అన్నాడు అక్కసుగా.

అంతసేపూ మౌనంగా ఆ పక్కనే కూర్చున్న ఓ సుందరాంగి ఒకసారి తీవ్రంగా అతని వంక చూసి "మిష్టర్ ఆయనెవరో తెలుసా? ఒళ్లు దగ్గరుంచుకొని మాట్లాడు. ఆయన మావారే!" అంది.



సదరు పెద్ద మనిషి నిదానంగా ఆమె వంక తిరిగి "సారీ మేడమ్! నేనెవరో మీకు తెలుసా ?" అడిగేడు.

ఆమె అడ్డంగా తల తిప్పింది, తెలియదన్నట్టు. 'థాంక్స్' అంటూ అతను లేచి

జనంలో కలిసిపోయాడు ఆమె కళ్ళ ముందే.

—కృష్ణ

# కోరిక

గుమాస్తా గోపాలానికి చాలకాలం నుంచి ఆఫీసరవ్వాలనే కోరిక వుండిపోయింది.

గోపాలానికి పై ఆఫీసరు చిదంబరం చండశాసనుడని ఆఫీసులో పెద్ద పేరు. అంచేత ఆయన్ని ఎలా ప్రసన్నం చేసుకోవాలా అని మధనపడి పడి చివరకు చిదంబరం ఎంత చండశాసనుడైనా ఇంట్లో భార్య దగ్గర పిల్లేనన్న విషయం తెలిసి హుషారుగా ఈలవేశాడు. ఏదో విధంగా ఆఫీసరుగారింటికి పోయి హోమ్ డిపార్టుమెంట్ ద్వారా డబల్ స్ట్రాంగ్‌గా రికమెండేషను చేయించుకొని ఆఫీసరై పోవాలని లబలబలాడిపోయాడు.

వెంటనే ఓ నాలుగు రోజులు సెలవు పెట్టి ఊరెళ్ళి ఓ అరొందలు అప్పు తీసుకుని తిరిగి వస్తూనే కేజీ లడ్డూ, కేజీ మైసూరు పాక్‌లూ, మాంచి ఖరీదైన పెర్లిన్‌సూటూ, ఖరీదైన పట్టుచీర వగైరా కొని సీట్‌గా పాక్ చేయించి తెచ్చి మరీ నిద్రపోయాడు. ఆ సాయంకాలం భార్య అలిమేలు వెంటరాగా ఆఫీసరు చిదంబరం గడప తొక్కేడు చిరునవ్వుతో. చిదంబరం గారు ఏదో హడావుడిలో వున్నట్లనిపించింది చూడగానే. గోపాలాన్ని, అతని శ్రీమతినీ చూసి ఎంతో 'యిదై'పోయి ఆహ్వానించేడాయన.

ఆమాటా, ఈమాటా అయినాక తాము వచ్చిన పని తన శ్రీమతి చేత ఆఫీసరు భార్య 'ఆండాళ్లు'కు చెప్పించాడు. అంతా విని ఆయన చిరునవ్వు నవ్వేడు. ఆండాళ్ళూ చిన్నసైజు చిరునవ్వు నవ్వింది.

"నువ్వీరోజు ఆఫీసుకు రాలేదటోయ్" అని అడిగారాయన.

"లేద్సార్! ఊరెళ్ళి ఈరోజే వచ్చాను" వినయంగా వంగి మరీ చెప్పి చేతిలోని పాకెట్ ని ఆయన ముందుంచాడు గోపాలం.

"అహ! అలాగా!" అంటూ పాకెట్ ని అందుకున్నాడు చిదంబరం.

గోపాలానికి యిక తన కోరిక తప్పక నెరవేరుతుందన్న గట్టి నమ్మకం వెంటనే కుదిరిపోయింది.

"ఎలాగైనా..." అంటూరిక్షావాళ్ల మీద రిక్షావాళ్లు చేసి తిరిగి వచ్చేశారు గోపాలమూ, అతని భార్య అలిమేలున్నూ.

మరునాడు హుషారుగా ఆఫీసు చేరుతూనే ఆఫీసరుగారి రూం ముందున్న నేమ్ ప్లేటు చూసి ఆ తర్వాత ప్యూను చెప్పింది విని కెవ్వున కేక పెట్టేడు. పిచ్చిపిచ్చిగా చూస్తూ జుత్తు పీక్కోబోయి అది ఆఫీసని తెలుసుకుని తమాయించుకుని ఆగిపోయాడు.

తీరా విచారిస్తే ఆఫీసరు చిదంబరం గార్కి తాను సెలవు పెట్టి ఊరెళ్ళిన మర్నాడే ఎప్పట్నుంచో ఎదురుచూస్తున్న ప్రమోషన్ వచ్చి బదిలీ అయిపోయిందనీ, ఉదయాన్నే కోరమాండల్ ఎక్స్‌ప్రెస్‌లో మద్రాసు వెళ్ళిపోయారనీ తెల్సింది.

-యం. ఉమామహేశ్వరరావు

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd.No. H/HD/402